ఫారెక్స్®
మొట్టమొదటి ఎంపిక!

## ఎందుకంటే క్రొత్త మేలుపర్చబడిన ఫారెక్స్®
## మొదటు మొదటు ఘన ఆహారాలకు మారే పాపాయికి
## సహాయకరంగా అత్యావశ్యక పదార్థాల సమ్మేళనం.

ఫారెక్స్. పాపాయి యొక్క పెరుగుదల మరియు సున్నిత జీర్ణశక్తికి అనువుగా ప్రొటీన్లు మరియు క్రొవ్వు పదార్థాల సరియైన కలయిక.

దీనిలో పాపాయి అవసరాలను పూరించి అతడి రక్తాన్ని ఆరోగ్యవంతంగా వుంచడానికై తగినంత ఐరన్ కలదు.

పాపాయి ఎముకలు మరియు పళ్లు చక్కగా పెరగడానికి సహాయకరంగా ఫారెక్స్‌లో కాల్షియం, ఫాస్ఫరస్ ఆదర్శవంతమైన నిష్పత్తిలో కలవు.

వీటితోపాటు ఇప్పుడు క్రొత్త ఫారెక్స్ కలపడానికి సులభం....మరింత రుచికరం కూడా.




క్రొత్త మేలు పర్చబడిన **ఫారెక్స్®**

పాలు చేర్చే అవసరం లేదు.
కేవలం నీటిలో కలిపి పట్టండి.

చతుర

సంపుటి : 9 సెప్టెంబర్ 1986 సంచిక : 8

# ఈ నెల సమగ్రనవల

"దేశానికి అమూల్యమైన సేవల్ని అందించవలసిన మీరు ఈ విధంగా– ఒక ఆడది మిమ్మల్ని దగా చేసిందనీ, మరో ఆడది నిర్లక్ష్యం చేసిందనీ– కుంగిపోయి, బతుకుబండలు చేసుకోవటంలో అర్థంలేదు.

పురుషుని జీవితంలో దివ్యమైన వరం కావలసిన స్త్రీ ఒక్కొసారి శాపంగా పరిణమిస్తుంది. మీభార్యను మార్చేందుకు ప్రయత్నించండి. ఆమెలో మార్పుకోసం ఎదురుచూడండి. ఇదే నా ఆఖరి కోరిక" అని రాసిన ఆమె, అతని ఒకనాటి ప్రేయసి!

తనవారికి దూరంగా వుంటూ, ఆర్థిక సమస్యలను సైతం ఎదుర్కొని ఉన్నత విద్యను అభ్యసించి, డాక్టరుగా పేరు పొంది తాగుబోతుగామారి, తిరుగుబోతు స్థాయికి దిగజారిన అతని జీవితంలో ఆమె ప్రభావం ఏమిటి?

## ముద్రగడ సూర్యప్రకాశరావు

కలం వెలువర్చిన భిన్న మలుపులతో సాగిపోయే రచన

# ఆశల శిఖరాలు

ఈ నెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల!

---

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్ : జగ్ మోహన్

# 'చిగురు' నవలపై చతుర సమీక్షలు

జూలై 'చతుర' నవల 'చిగురు' పై పాఠకుల నుంచి మాకు అందిన 'చతుర సమీక్ష'లలో ఉత్తమంగా వున్న మూడింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో ఉత్సాహంగా పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు! బహుమతులు పొందిన ముగ్గురికీ మా అభినందనలు!

## ప్రథమ బహుమతి
## రూ.100/- పొందిన సమీక్ష

ఈ మధ్యకాలంలో 'చతుర'లోగానీ, మరే ఇతర పత్రికల్లోగానీ వచ్చిన నవలల్లో ఉత్తమశ్రేణి నవల 'చిగురు'. చిత్రం ఏమిటంటే ... గుండెలదరగొట్టే సస్పెన్స్‌లూ, నరాలను ఉద్రేకపరిచే శృంగారఘట్టాలు ఇందులో లేవు. నేటి సాధారణ పాఠకుణ్ని వక్రమార్గంలోకి మళ్ళిస్తున్న మసాలాలూ, ఆకర్షణలూ అస్సలు లేవు. అయినా చదివించింది. అందుకేనేమో, ఇది చాలా మంచి నవల అయ్యింది. ఎన్నాళ్ళకి మళ్ళీ ఓ మంచి నవల చదివేను అని పాఠకుడు తృప్తిగా అనుకొనే నవల 'చిగురు'.

ఈ నవల్ని హాస్యనవలేమోననిపించే విధంగా పరిచయంచేశారు కానీ నిజానికిది కేవలం హాస్యనవల కాదు. సున్నితమైన హాస్యంతో గిలిగింతలు పెట్టే సంఘటనలతో తృప్తిగా నవ్వుకొని రెండోమారు వెంటనే చదివించగల నవల. రావుగారిపాత్ర ప్రతీకుటుంబంలో సాధారణంగా కనిపించేదే. వయసుమళ్ళినవారి చాదస్తంవెనక కనిపించని వారి ఆవేదన మనకళ్ళముందు ఉంచుతుంది ఈ నవల. ఒక వయస్సు వచ్చేక వారు కాలక్షేపం గురించి ఏవిధంగా అల్లాడిపోతారో, తమ పెద్దరికాన్ని పిల్లలు గుర్తించాలని ఆరాటపడ్డం, సంప్రదాయాలు, డబ్బుల వ్యవహారంలో వారి పట్టుదలలు మనోజ్ఞంగా చిత్రించిన నవల ఇది.

ఈనవల్లో గొప్పతనంఏమిటంటే-పాత్రలన్నీ పాఠకుడికి బాగా పరిచయం ఉన్నట్టుగా అనిపిస్తాయి. ప్రతిపాత్ర పాఠకుడిలో లీనమైపోతుంది. వాస్తవికతను ఆద్యంతం ప్రతిఫలింపచేసే పాత్రలే అన్నీను. రావుగారు ఆస్తిఇవ్వనుపొమ్మన్నపుడు, శివుడి తటపటాయింపు – చివరకు ప్రేమించిన జయంతికోసం వెళ్ళిపోవడం, అదే మాలతి దగ్గరకొచ్చేసరికి తండ్రి అంగీకారం దొరికే వరకూ వేచిచూడటం... పాత్రల మధ్య ఉన్నతేడాల్ని నిజజీవితంలో అన్వయించుకొని పరిశీలించుకుంటాడుపాఠకుడు. రావుగారి వంటప్రయత్నాలు, షికార్లు, పాఠాలు, సంగీతసాధన కరువుతీరా నవ్వుకునేలా ఉన్నాయి. అసలు నవల ప్రారంభమే తమాషాగా ఉండి పాఠకుడిలో ఆసక్తిని రేపుతుంది. ముగింపు సాధారణ పాఠకుడు ఊహించే విధంగానే ఉన్నప్పటికీ, ఆనందంగా 'మాలి' పెళ్ళి జరిపిస్తాడు పాఠకుడు. రాజమ్మది 'మహోన్నతమైన' అమ్మపాత్ర. తల్లిగా, ఇల్లాలిగా, అత్తగారిగా ఆవిణ్ని చిత్రించిన రీతి ప్రశంసనీయం.

చెబితేగానీ ఇది అనువాద నవల అని ఏ పాఠకుడూ ఊహించలేని విధంగా అనువదించిన ఉమా-కల్యాణి అభినందనీయులు.

—బి. వెంకటేశ్వరరావు
సింహాచలం.

## ద్వితీయ బహుమతి
## రు. 75/- పొందిన సమీక్ష

1986 జూలై నెల 'చతుర' నవల 'చిగురు' ప్రారంభం, నడక, ముగింపు ఆద్యంతం ఏకబిగిని చదివించేలా ఉన్నాయి. విందుభోజనంలా తృప్తి కలిగించిన నవలలో అక్కడక్కడ వంటకాలలో ఎక్కువ తక్కువలయిన కారం, ఉప్పు, పులుపులా కొన్ని అసందర్భాలు, అనువాదలోపాలు కనిపిస్తున్నా నవల చక్కగా ఉన్నట్టే లెక్క.

ప్రతిజ్ఞచేశాక రావుగారు హోమియోపతిని ఆశ్రయించి, ఇంగ్లీషు మందుల్ని తిట్టిపొయ్యసాగారు (26వ పేజీ). చేప తలకాయతెచ్చి దాన్ని సన్నికల్లుమీద అరగదీసి కంటికి పట్టించుకుంటే కళ్లు మసకలుతగ్గుతాయట...(27వ పేజీ). ఇది హోమియో వైద్యంలో లేదు. బహుశా అది జోక్ కావచ్చు.

బెంగుళూరునుండి మైసూరు రైలులో వెళ్ళిన రావుగారు, రైలు మైసూరుచేరి తిరిగి మద్రాసుమీదుగా బెంగుళూరు రావడం హాస్యాస్పదంగా ఉంది. రైలు చేరిన ఆఖరి స్టేషనులో రైలు శుభ్రపర్చేవారు తప్పనిసరిగా ఎక్కడం జరుగుతుంది. వాళ్లు నిద్రపోయిన రావుగారిని లేపడం జరుగుతుంది. పైగా మైసూరు నుండి బెంగుళూరు రావడానికి మద్రాసు మీదుగా ప్రయాణం ఎందుకు చేయాలి?

ఎక్కువ పాత్రలను పరిచయం చేయడం, ఆ పాత్రలకి భారీగా పిల్లలను కలిగించటం చేసినప్పుడు లెక్కలు తప్పకుండా చూసుకోవాలి. 37వ పేజీలో మాధవుడి పిల్లలు ముగ్గురు అనిచెప్పారు. 88వ పేజీలో "కమలక్కా...నీకెంతమంది పిల్లలు?" అని ప్రసాద్ అడిగితే "అయిదుగురు" అంటుందామె. మాధవుడి భార్య కమల అయినందున లెక్క తప్పయింది. 37వ పేజీలో కేశవుడికి, మాధవుడికి, రాజీవుడికి పిల్లలు మొత్తం 12మంది అనితెలియపర్చి 47వ పేజీలో 13 మందికి పెంచడం ఏమీ బాగోలేదు.

సంపాదించే కొడుకులు అందరూ తల్లికి డబ్బులు సరిగ్గా ఇస్తున్నదీ, లేనిదీ రావుగారు వాకబుచేశారు (48వ పేజీ). అందువలన 72వ పేజీలో రావుగారు భార్యకి నెలకి 10 రూపాయలు పాకెట్ మనీ ఇస్తున్నట్టుగా చెప్పించడం బొత్తిగా అతకలేదు. కొడుకులనుండి డబ్బులు వసూలుచేసే తల్లికి వేరే పాకెట్‌మనీ అవసరం ఏమిటి?

83వ పేజీలో శివుడేం చేస్తాడో తెలీదని చెప్పించి, 84వ పేజీలో శివుడికి మాలతి తనలాగే ఉపాధ్యాయురాలు కావాలి అని వుండేదని అనిపించి 85వ పేజీలో శివుడు లెక్చరర్‌గా ఉద్యోగంలో చేరాడు అని రాయడం కొంచెం తికమకగా కనబడుతున్నది.

'గుర్రాన్నిచూస్తే కాలునొప్పి' అన్నట్టుగా డాక్టరును చూసేసరికి ఆయనకి రోగాలన్నీ గుర్తొస్తాయి (25వ పేజీ)- అనేది అతకని సామెత. పాడగా, పాడగా రాగమట మూలిగి మూలిగి రోగమట అని ఉంటే బాగుండేదేమో! (85వ పేజీలో) "....బాగా సంగీతం నేర్చుకొని పీళ్ళమొహాల్లా నీళ్ళు కొడతాను..."

(61వ పేజీ)-ఈ వాక్యం తెలుగుదనానికి దూరంగా ఉంది.

'బెంగళూరు' అని కొన్నిచోట్ల, 'బెంగుళూరు' అని కొన్నిచోట్ల రాయడం బాగోలేదు. అలాగే మనుషుల పేర్లు ఉదహరించినప్పుడు కూడా రకరకాలుగా ఉదహరించడం జరిగింది.

తెలుగుదనంలేని వాక్యాలు కొన్ని...

"మరెన్ని నగలు చేయించగలరో అ డబ్బులో (72వ పేజీ) అయ్యా, తమరికి పిల్లలెందరు?"(19వ పేజీ), "నేను నోరు మూసుకున్నా నీ హృదయం తెర్చుకొని విగ్రహాన్ని ప్రతిష్ఠాపించింది"(97వ పేజీ).

మాలతికి కమల వదిన వరస. అయినా 77వ పేజీలో 'కమలక్క' అనీ, 92వ పేజీలో "కమలక్కను పిలుస్తాను" అని రాశారు.

—కుందుం కుసుమకుమారి

కాకినాడ-533003.

## తృతీయ బహుమతి
## రు. 50/-పొందిన సమీక్ష

'చిగురు' అనేది కొత్త భావాలకు, కొత్త జీవనానికి సంకేతం. కాలం తీరిన ఎండుటాకు రాలిపోయినా, కొత్త ఊపిరి పోసుకుని కొత్త చిగురుతో చిగురిస్తుంది చెట్టు. ఈ ప్రకృతిధర్మాన్ని ఆపాలను కోవడం వ్యర్థప్రయత్నం. ఈ సత్యాన్ని రావుగారనబడే ఒక మాజీ న్యాయవాది ఆత్మ సంస్కారంతో తెలుసుకోగలగడమే 'చిగురు' ఇతివృత్తం.

వృద్ధాప్యంలో అడుగుపెట్టి విశ్రాంతి తీసుకుంటున్న వృద్ధుల్లో కనబడే లక్షణాలన్నీ రావుగారిలోనూ పుష్కలంగా ఉన్నాయి. మన స్తత్వ శాస్త్రవేత్త అడ్లర్ విశ్లేషణలో-అందమైన గోడను ఖరాబుచేసి పసిపిల్లవాడు తన ఉనికిని తెలియజేద్దామనుకునేటట్టే రావుగారు కూడా తన ఉనికిని తెలియజెయ్యడంకోసం చాలా తాపత్రయపడతారు. వంట చెయ్యడానికి, తోటపని చెయ్యడానికి, ఇంటి పద్దులు రాయడానికి-ఆఖరికి కుమార్తె మాలతి, సుమారుడు శివుడు వివాహాలవిషయంలో అభ్యంతరాలు తెలపడానికికూడా కారణం 'ఆత్మన్యూనతాభావం'లోంచి పుట్టుకొచ్చిన ఈ విచిత్ర మనస్తత్వంలోనే వుంది. అయితే-సాధారణమైన వృద్ధులమాదిరిగా కాకుండా - ఆత్మవిమర్శతో రావుగారు సమస్య స్వరూపాన్ని అవగతం చేసుకోగలిగారు. 'జనరేషన్‌గేప్'ను అధిగమించి ఆర్ద్రతతో, ప్రేమతో, విధివశాత్తూ విధవరాలయిన కుమార్తె నుదుట కుంకుమ తీర్చిదిద్దగలిగారు. అయితే ఆ చేతోనే శివుడిని కూడా ఆశీర్వదించినట్టుగా ఉంటే నవలకు మరికొంత సమగ్రత వచ్చేది.

ప్రారంభంకావడానికి హాస్యనవలలాగే ప్రారంభం అయినా-ఆ పరిధిని అధిగమించి చివరికొచ్చేసరికి నవరసాల సమ్మేళనంగా ముగుస్తుంది. సంప్రదాయాన్ని పట్టుకుని-వేళ్ళాడే రావుగారు భగవద్గీతను తాత్కాలిక అవసరానికి మాత్రమే ఉపయోగించుకొనడం, ముసలివయస్సులో కూడా తనకు పిల్లనిచ్చేవాళ్ళుంటే బాగుండు ననే భావనను మనస్సులో ఏదో ఓమూల పెంచుకొనడం, సర్వత్రా వింటున్నవే అయినా మరోసారి చదువుకోడానికిబాగుంటాయి. మొత్తంమీద 'త్రివేణి'గారు 'చిగురు' నవలలో చెప్పిన అంశంలో కొత్తదనం అంతగా లేకపోయినప్పటికీ, రాసిన విధానం సరదాగా చదువుకోడానికి బాగుంది.

—శ్రీమతి కోడూరి
భారతీ శ్రీరామ్,
బొబ్బిలి.

## విజ్ఞప్తి

గత ఆరేళ్ళుగా మీ ప్రియమైన 'చతుర' మీకు 2రూపాయలకే అందుతోంది. ఒక ప్రక్క న్యూస్‌ప్రింట్, ప్రింటింగ్ ధరలు పెరిగినా, మా శాయశక్తులా ప్రయత్నించి అదే ధరకు 'చతుర' అందజేశాం.

కానీ, ఇటీవలికాలంలో న్యూస్‌ప్రింట్ మరియు ప్రింటింగ్ ధరలలో విపరీతమయిన పెరుగుదల, సిబ్బంది జీత భత్యాల పెంపుల వలన 'చతుర' ధరను పెంచటం అనివార్యమయింది.

పాఠకులు సహృదయంతో సహకరించి 'చతుర'ను ఎప్పటిలా ఆదరిస్తారని ఆశిస్తున్నాము

| | రు. పై. |
|---|---|
| 'చతుర' వెల సెప్టెంబర్ '86 నుండి | 2 = 50 |

— బిజినెస్ మేనేజర్

# చతుర ప్రపంచం

## డబ్బు...డబ్బు...

ప్రపంచంలోకెల్లా అత్యంత ధనవంతుడు బ్రూనే దేశపు సుల్తాన్ కాగా సౌదీ అరేబియాకు చెందిన అద్నాన్ ఖషోకికి ద్వితీయస్థానం లభించింది.

అద్నాన్ నూటికినూరుపాళ్ళూ 20వ శతాబ్దపు పారిశ్రామికవేత్తగా చెప్పుకోదగ్గవాడు. అతను తన పరిశ్రమలను వీలైనన్ని రకాలుగా విస్తరింపజేశాడు. అద్నాన్ తన దేశంలోనేకాక ఇతర దేశాలలోని పుణ్యస్థలాలను సైతం సందర్శిస్తుంటాడు. అలాంటి మతపరమైన పర్యటనలలో కూడా అతను తన వ్యాపారాలను విస్తృతంచేసే అవకాశాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరిస్తూనే వుంటాడు.

మిగతా అరబ్ షేక్‌లలా తైలనిక్షేపపు బావులవల్ల ధనవంతుడైనవాడు కాదు అద్నాన్. అతను పెద్ద పెద్ద వ్యాపార సంస్థలకు ఋణాలిచ్చే ట్రైడ్ కార్పొరేషన్ యజమాని. సౌదీ అరేబియాలో వివిధ వ్యాపారాలకవసరమైన పెట్టుబడులుపెట్టే వాటిలో అగ్రసంస్థ అదే!

అద్నాన్ ఎంతో మెలకువగల వ్యాపారవేత్త. ఏ వ్యాపారం విజయవంతమయేదీ, ఏది విఫలమయేదీ అతను ఇట్టే పసికట్టగలడు. అతను ప్రపంచమంతటా విస్తృతంగా పర్యటనలు జరుపుతూ ఏ సంస్థలో పెట్టుబడి పెట్టేందుకు అవకాశముందో చూస్తాడు. అద్నాన్‌కి విజయవంతంగా నడుస్తున్న అనేక సొంత పరిశ్రమలు వున్నాయి.

అద్నాన్ ప్రైవేటు రంగంలోని చిన్నతరహా పరిశ్రమలలోనేకాక ఇతరదేశాల్లోని అనేక జాతీయ పరిశ్రమలలోకూడా పెట్టుబడి పెడతాడు. వివిధ దేశాలకు చెందిన అధినేతలు అతనికి ఆప్తమిత్రులుకూడా. ధనికులలో సర్వసాధారణమైన రక్తపోటు, డయాబెటిస్‌లాంటి జబ్బులు అద్నాన్‌కి లేకపోవటం ఓ విశేషం. అతను ఆహార పానీయాదుల విషయంలో చాలా జాగ్రత్తగా ఉంటాడు. తనకోసం నియమించుకున్న డాక్టర్‌ని తనతోపాటే విదేశీ పర్యటనలన్నింటికీ తీసుకెళతాడు. ఆ డాక్టరు తినవచ్చని చెప్పాకే ఏదైనా తింటాడు.

అద్నాన్ ఇటీవల మనదేశం వచ్చినపుడు మద్రాసులోని అపోలో ఆస్పత్రి పరిశోధనా విభాగానికి 30 లక్షలు, బాల మందిర్‌కు 20 లక్షల రూపాయలు విరాళంగా ఇచ్చాడు.

## పలుక నేర్చిన చిలక

పన్నెండేళ్ళక్రితం మైసూరులో మంజు అనే బాలుడు కొబ్బరితోటలో దొరికిన రెండు రామచిలక పిల్లల్ని ఇంటికిపట్టుకెళ్ళాడు. కుటుంబంలోనివారంతా వాటిని చూసి ముచ్చటపడి రూప, రేఖ అనే పేర్లుపెట్టి





ఇంట్లోనే పెంచసాగారు. రేఖ ఎంతోకాలం బతకలేదు. రూప మాత్రం పెరిగి పెద్దదై ఇప్పుడు ఆ ఇంట్లో సభ్యులు చెప్పిన మాటల్ని తిరిగి వల్లిస్తూ వారిని ఎంతో ఆనందపరుస్తోంది.

రూప మాట్లాడగలదనే సంగతి కొన్నేళ్ళక్రితం విచిత్రంగా బయట పడింది. ఓసారి రూప హఠాత్తుగా "గీతా! రూపను ఎత్తుకోమ్మా" అని అరిచి ఇంట్లో అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసింది. అది మంజు తల్లి శ్రీమతి పద్మనాభన్, మంజు చెల్లెలు గీతతో రోజూ చెబుతుండేమాట.

రూప ఆ మాటను వల్లించడంతో గీతకు ఆసక్తికలిగి, రోజూ దానికి మాటలు నేర్పడం ప్రారంభించింది. గీత చెప్పిన మాటలను వెంటనే వల్లిస్తూ రూప పలుక నేర్చిన చిలక అయింది. గీతతో పాటు ఆమె చెల్లెళ్ళు నళిని, మాలిని కూడా ఉత్సాహంగా రూపకు మాటలునేర్పటం మొదలు పెట్టారు. ఫలితంగా ఇప్పుడా చిలక 60 పదాలు మాట్లాడటం నేర్చింది.

రూప తన పేరు, పద్మనాభన్ కుటుంబ సభ్యుల పేర్లతోపాటు తెలుగు, కన్నడ భాషల్లోని కొన్ని పదాలను కూడా వల్లిస్తుంది. వాటితోపాటు రెండు కన్నడ సినిమా పాటల్లోని ఒకటి రెండు పంక్తులను కూడా కూనిరాగాలు తీస్తుంది. మధ్యాహ్నం పన్నెండున్నర ప్రాంతంలో రూపకి తిండి పెడతారు. ఎప్పుడైనా వేళ మించితే అది, "బువ్వా గివ్వా పెట్టకపోతే ఆకలి తీరేదెలా?" అని అరిచి తన తిండి సంగతి గుర్తుచేస్తుంది.

'న' అక్షరంతో ప్రారంభమయ్యే పదాలను పలికేందుకు రూప ప్రయాస పడుతుంది. అందుకని దానికి 'న' అక్షరం ముందున్న పదాలను నేర్పటం మానేసి నళిని పేరును రూపాదేవిగా దానికి పరిచయంచేశారు. రూపకి వీలైనన్ని ఎక్కువ పదాలు నేర్పి ఆవిధంగా దాని పేరు గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్సులోకి ఎక్కితే చూడాలని మంజు ఆశ.

*






# కళ్ళు తెరిచిచూస్తే మనకి కనిపించే
# చాలా టెలివిజన్ల టెక్నాలజీ వెనక

దానిదేముంది యీ రోజుల్లో ఎవ్వరైనా తయారు చేసి యీ టెలివిజన్ మార్కెట్‌లోకి దిగచ్చు. ఇదీ కిటుకు — దూర ప్రాచ్య దేశాలకి వెళ్ళడం, టీవీ కిట్ చేసే వాళ్ళతో ఒప్పందం కుదుర్చుకోవడం, హుటాహుటిగా వ్యాపారం లోకి దిగటం.

ఆ పార్టులూ యీ పార్టులూ తీసుకోవడం, ఒక స్క్రూడ్రయివర్ పుచ్చుకుని ఒక చోట చేర్చి వాటిని చకచకా బిగించెయ్యడం. అసలు ఏ పార్టుల్ని ఎందుకు ఎలా చేర్చి బిగిస్తున్నారో వాళ్ళకి తెలుస్తేగదా ? ఇదేనండి స్క్రూడ్రయివర్ టెక్నాలజీ అంటే ! చూస్తూచూస్తూ మీ డబ్బుని అటువంటి వాళ్ళు చేసిన టీ. వీ. పైన పెడతారా ?

ఆలోచించండి ఒక్కసారి మీరే. అలాకాకుండా ఇటుచూసి, మన దేశ పరిస్థితుల్ని దృష్టిలో వుంచుకుని, ప్రత్యేకంగా అచ్చంగా మీ కోసం భారత దేశంలో డిజైను చేసిన టీవీ ని నమ్మి మీ డబ్బు దీన్లో పెడతారా ? అందుకే గదా యిప్పుడిదాకా మన దేశంలో మూడు లక్షల కుటుంబాలు ఈ.సి.టీవీ సెట్టును కొనుక్కుని కులాసాగా వాడుతున్నది ? టీ.వీ. సెట్టంటే ఈ.సి.టీవీ కొట్టిపారెయ్యలేరిక.

ఎందుకంటారా, గత పది హేనేళ్ళుగా ఈసిఐఎల్ వాళ్ళేగదా భారతదేశంలో అసలు టీ.వీ. టెక్నాలజీని ప్రవేశపెట్టి, ముందంజ వేసినవారు ? కలర్‌లోనూ, బ్లేక్ అండ్ వైట్ టీవీ ల శ్రేణిలోనూ ఒక ఉత్కృష్టమైన స్థాయీ, స్థానాన్ని తెచ్చింది వీళేగదా ? పేచీపెట్టని తీరులో ఏళ్ళ కేళ్ళుగా మీ టీవీ పనిచేస్తున్నది అందుకేగదా ?

దీన్లో ప్రతి పార్టుకీ, ప్రతి సర్క్యూట్‌కి, ప్రతి ఏడి భాగానికీ సరియైన మేళవింపు వుంది— దాంతో ఎలక్ట్రానిక్ టెక్నాలజీలో విస్మయమైన సంపూర్ణ సమగ్ర చిత్రం రూపొందుతుంది. దాంతో అత్యంత స్పష్టమైన సొంపైన చిత్రాలు కనిపిస్తాయి. అత్యంత శ్రావ్యమైన, యింపైన ధ్వని. మీకు ఎప్పుడూ యిబ్బంది పెట్టకుండా పనిచెయ్యడం.

అంతేకాదు, ప్రతి ఈ.సి.టీవీ సెట్టు వెనకా దేశ మంతటా విస్తరించివున్న అత్యంత సమర్థవంతమైన సేవా సౌకర్యాలున్నాయి. ప్రత్యేకమైన **30** ఈ.సి.టీవీ కేంద్రాలు. **400** మంది నమ్మకమైన డీలర్లు. మరంటే మీరొక్క ఫోన్ కాల్ కొడితే చాలు–అంతే.




# ది. బజార్లో దొరికే
# న్న అసలు సంగతియిది.

మీకింకా ఏమేం యిస్తామో తెలుసుకోవాలని వుంది కదూ, మీ ఈ.సి.టీవీ డీలర్‌ని కలుసుకోండి. తెలుస్తుందప్పుడు మీకిక యీ చెప్పిందంతా పొల్లుబోదనీ, మేం, అంటే ఈ.సి.టీవీ మాట నిలబెట్టుకుంటుందనీను.



**ECtv**

దీనిని అనుకరించడం ప్రతి టీవీ ప్రయత్నం.

Karishma EC 1 1722 TI

అంతవరకూ కురుస్తున్న వర్షం అప్పుడే కొంచెం తెరిపిచ్చింది. పున్నమి వెన్నెలలో ప్రకృతి మేలిముసుగు వేసుకొన్న అంద గత్తెలా వుంది. మసగ్గా కనిపిస్తున్న కొండలపై మబ్బులు గుంపులుగా ఎక్క డికో ఆత్రంగా పరుగులెడ్తున్నాయి. తడిసిన ఆకులపై పడినవెన్నెల తళతళ మెరుస్తూ, పసిడి కాంతులీనుతోంది. కొమ్మలు గాలికి వూగుతున్నప్పుడల్లా చెమ్కీ జలతారు దుస్తుల్లోని నాట్యగత్తె భంగిమల్లాఆహ్లాదకరంగాఅగుపిస్తున్నాయి. టేప్‌రికార్డర్‌లో పాప్ మ్యూజిక్ శ్రావ్యంగా వినిపిస్తోంది.కొండలపై నుండి వీస్తున్న చల్లగాలి వంటికి తగులుతున్నప్పుడల్లా హాయనిపిస్తోంది. ఎదురుగా సౌందర్యా న్నంతటినీ వొళ్ళో నింపుకున్న ప్రకృతి. ఆ అందాన్ని వీక్షిస్తూ, విస్కీసిప్ చేస్తూ 'రిలేక్స్' అవుతున్నాడు రజనీకాంత్!

ఆ ప్రదేశం ఆ వాతావరణం అంటే అతనికెంతో ఇష్టం. అందుకే ఊరికి దూరంగా,లోయలోవున్న ఆ గెస్ట్‌హౌస్‌నే అతను ఎప్పుడూ ఎన్నుకుంటూంటాడు.

చేతిలో గ్లాసుఖాళీ అయింది. వళ్ళంతా మత్తుగా వుంది. ఇది చాలదు. మనసు నిండా వున్న వెల్తినిదూరం చేసుకోటానికి ఇంకా మత్తు కావాలి అనుకుంటూనే ఈ అలవాటుకు బానిస అయిపోయాడు. అయినా ఆ వెల్తి అలాగే వుండిపోయింది. గ్లాసులో విస్కీ పోసి, సోడా కలుపు కున్నాడు. మరో రౌండు ప్రారంభం అయింది.

సిగరెట్ పొగ రింగులు రింగులుగా గాల్లో తిరుగుతూ విచిత్ర విన్యాసాలు చేస్తోంది. కిటికిగుండా వుండివుండివీస్తున్న గాలి ఆ రింగుల్ని కలగాపులగం చేసేసి తనలో కలిపేసుకుంటోంది.

కొంతమంది విధి ఆడించే ఆటలో,గాలి ఎటు వీస్తుంటే అటు మళ్ళిపోయే ఈ సిగ రెట్ పొగలాగే, పరిస్థితులకు లొంగిపోయి అగాల్లోనే కలిసి పోతుంటారు. ఈ సిగరెట్ పొగకు తన జీవితానికి బాగా దగ్గర పోలికవుంది అనుకున్నాడు రజని.

రజని ఆప్రాంతాల్లో పేరున్నడాక్టర్. అతని 'హస్తవాసి' మంచిదని జనం అంటుంటారు. అతని కేసుల్లో ఫెయిలయి నవి చాలా తక్కువ. అవి కూడా ఆఖరు క్షణం వరకూ నిర్లక్ష్యం చేసేసి లేదా ప్రాణాల మీదకు వచ్చేసరికి తీసుకొచ్చిన కేసులే. 'ఇంత ఇవ్వాలి' అని అతను ఎవర్నీ ఎప్పుడూ అడగలేదు. పైగా ఉచి తంగా మందులు ఇంజక్షన్లు ఇచ్చి, ఆదు కున్న సందర్భాలు వున్నాయి. మనసు లోని కృతజ్ఞత కళ్ళ ద్వారా వ్యక్తమవు తుండగా, తృప్తిగా, ఆనందంగా పేషెంట్లు ఇళ్ళకు వెళ్తుంటే, అతనికెంతో ఆనందం!

పేరుప్రఖ్యాతులతోపాటు, డబ్బూ సంపాదించాడు రజనీ. ఒకప్పుడు అవస రాలకు డబ్బులేక ఎన్నెన్నో ఇబ్బందులు పడ్తూండేవాడు. ఆత్మాభిమానాన్ని దెబ్బ తీస్తూ పేదరికం, తనకు సుఖాల్ని, ఆనం దాన్ని దూరం చేసి, జీవితాన్నే కబళిం చాలని చూసింది. అలాంటిది ఇప్పుడు దేనికీ లోటులేదు. కానీ, జీవిత గమనంలో ఉల్లాసంతో ఎగిసిపడే కెరటాలలాంటి అనుభవాలు, ఉరుకులు పరుగులు లేవు. ఎటుపల్లంగా వుంటే అటు నిశ్శబ్దంగా సాగిపోవడమే జీవితం అన్నట్లుగా వుంది.

అందుకే గత జీవితంలోని బాధామయ జ్ఞాపకాల గుర్తుల్ని చెరిపేసుకోవటానికి, మైకాన్నీ, మగువల్నీ ఆశ్రయించాడు. వాళ్ళెవరిపైనా మమతలు పెంచుకోలేదు.




కేవలం భౌతికావసరాలకోసం మాత్రమే వాళ్ళతో పరిచయాలు పెంచుకున్నాడు.

రజని పరిస్థితి గమనించిన ఫ్రెండ్స్ అతన్ని హెచ్చరించేరు. వారించటానికి ప్రయత్నించారు.

డాక్టర్ జైరాజ్ ఓసారి సున్నితంగా మందలించాడు. "అంత మంది ఆడ వాళ్ళతో సంబంధం పెట్టుకోవడంమంచిది కాదు! నీ ఆరోగ్యం గురించి కూడా కొంచెం చూసుకుంటూ వుండాలి. ఈ తాగుడు, తిరుగుడు నీ జీవితాన్ని ఎంతలా నాశనం చేస్తున్నాయో? ఎప్పుడైనా ఆలోచించావా? డాక్టరువు నీకు చెప్పవలసిన వాణ్ని కాను. నీలాంటి ఎక్స్‌పర్ట్స్ దేశానికెంతో అవసరం. నర్సింగ్‌హోమ్‌ని నిర్లక్ష్యంచేసి,మందుకొడుతూ, బిచ్చెస్‌తో నీ విలువైన టైమ్‌వేస్ట్ చేస్తూ గడిపేస్తున్నావు. సుదీర్ఘ కృషితో ఉన్నతస్థాయి నందుకున్న నీజీవితం మూడుపువ్వులుఆరు కాయలుగా వికసించాల్సిన సమయంలోనే నువ్వీ వ్యసనాలకు బానిస కావడం, మా అందరికీ ఎంతో బాధాకరం."

ఆ మాటలకు నవ్వాడు రజని. "ఎంత గొప్పవాడినయినా, ఎంత ఎక్స్‌పర్ట్ డాక్టర్నయినా నేనూ ఓ మనిషినే. అందరిలోలాగే నాలోనూ కొన్ని బలహీనతలున్నాయి. ఆశించిన జీవితం ఎండమావి అయిపోయింది. నేను ఎవర్నయితే ఎంతగానో ప్రేమించి, కావాలనుకున్నానో వాళ్ళే ఈనాడు నాకు దూరం అయ్యారు. నామనసుకు దగ్గరయిన, 'నా అన్న' వాళ్ళెవరు లేరు. వుండరు....వుండలేరు. అందుకే ఇప్పుడు నేనెవరిపైనా మనసు పడటం లేదు. ఇవన్నీ గమ్యంచేరేలోపల త్రోవలోచేసే మజిలీలే" అన్నాడు. కానీ తన సమాధానం తనకే అసంతృప్తిగా అనిపించింది.

'అనామిక' గుర్తొచ్చింది రజనికి. ఆమెపేరు తనెప్పుడూ అడగలేదు. ఆమె కూడా ఎప్పుడూ చెప్పలేదు. అందుకే 'అనామిక' అని అంటుండేవాడు. ఆ డర్టీరోగ్ నాటకీయంగా తన జీవితంలో ప్రవేశించి, దోచుకోవాల్సినంతగా దోచుకుని చెప్పా చెయ్యకుండా పారిపోయింది.

ఆలోచనలన్నీ గతంలోకి పరుగెత్తాయి.

ఆ రోజు పన్నెండుదాటింతర్వాత ఇంటికి తిరిగొస్తున్నాడు తను. కారు లైట్ల కాంతిలో త్రోవలో రోడ్డుపక్కగా అర్ధనగ్నంగా పడివున్న ఓ స్త్రీ కనిపించింది. స్పృహతప్పిన పరిస్థితిలో వుంది. చుట్టూ అంతా అంధకారం. 'ఎవరో ఏంటో?' దిగిచూసి, హాస్పిటల్లో చేర్చడం తానున్న పరిస్థితిలో కష్టసాధ్యమే... ఫుల్‌లోడ్‌లో వున్నాడు తను. పరిస్థితుల దృష్ట్యా ఆలోచిస్తే, ఏమాత్రం జ్ఞానం వున్నవాడయినా అలాంటి పరిస్థితిలో లేనిపోని తద్దినాన్ని తెచ్చుకుని నెత్తిన వేసుకోడు. కాని మానవత్వంవున్న మనిషిగా డాక్టరుగా కారు వెనక్కి తీసుకొచ్చాడు. కారు లైట్లకాంతిలో కనిపించిన ఆ దృశ్యం భయంకరంగా వుంది. ఆ స్త్రీ దారుణంగా రేప్ చెయ్యబడింది. కొనవూపిరితో... ఆయాసపడుతూ వుంది. అలాంటి పరిస్థితిలో న్యాయంగా ఆమెను అలాగేవుంచి, పోలీసులకు రిపోర్టు చెయ్యాలి. పోలీసులు వచ్చి పరిశోధన ప్రారంభిస్తారు. వాళ్లు వచ్చి ఇవన్నీ చూసుకునేంతవరకూ ఆమెను కదల్చకుండా వుంచాలి, ఆ తతంగం అంతా జరిగే లోపునే ఆమె ప్రాణాలు అనంతవిశ్వంలోకలసిపోవచ్చు. అందుకే రిస్క్ తీసుకుని ఆమెను కార్లో ఎక్కించుకొని డిస్పెన్సరీకి తీసుకెళ్లాడు.

క్షణాలమీద ట్రీట్‌మెంటు జరిగింది. ఏ మాత్రం ఆలస్యం జరిగినా ఆమె ప్రాణాలు నిలబెట్టటం కష్టం అయివుండేది. తెల్లార్లూ ఆమెను కనిపెట్టుకునుండి ప్రాణం కాపాడగలిగాడు తను.

ఓ నాలుగయిదు రోజుల్లో ఆమె మామూలు మనిషయి మానసికంగా బలాన్ని పుంజుకొంది.

భర్త చనిపోయాడుట. ఒంటరిగా వుంటోందిట! అయిన వాళ్ళెవరూ ఆదుకోకపోతే ఏదో చిన్న ఉద్యోగం చేసుకుని బతుకుతోంది. బస్సు దొరక్క రిక్షాలో ఇంటికి బయలుదేరిన ఆమెను ఎవరో ముగ్గురు వ్యక్తులు అటకాయించి రిక్షావాణ్ని తన్ని తగలేసేరు. రేప్‌చేసి అలా వదలిపారిపోయారు.

ఆమె తన ఆశ్రయంలో కొన్ని రోజులు వుంది. తన డబ్బు ఆమెను ప్రలోభపెట్టింది. ఆకర్షించి లోబరచుకోవటానికి ప్రయత్నించి సఫలురాలయింది. పెళ్ళిచేసుకోటానికి తను ఒప్పుకోలేదు. ఈ లోపుగా కొంత డబ్బు, సామాను బయటికి చేరవేసింది. మరి కొంత డబ్బు ముట్టచెబితే తాను వెళ్ళిపోతానంది. తను ఇవ్వలేదు. "అల్లరిచేస్తాను నలుగుర్లోనూ పరువు తీస్తాను" అని బెదిరించింది.

ఈ బెదిరింపులు ఫాల్స్‌ప్రిస్టేజీల స్టేజి నుండి తను ఎప్పుడో ముందుకు వెళ్ళిపోయాడు. "నీకు చిల్లిగవ్వ ఇచ్చేదిలేదు నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో... పో..." అన్నాడు తను. ఇదోరకం బ్లాక్‌మెయిలింగ్. ఇమేజ్ దెబ్బతినకుండా నలుగురిలోనూ అల్లరిపాలు కాకుండా వుండాలని కొంతమంది బెదిరిపోతుంటారు.

ఆమె అనామికగానే తన జీవితంలోంచి వెళ్ళిపోయింది.

ఆమె గుర్తుకు రావడంతో మనసంతా చికాగ్గా అయిపోయింది. మంచితనం మెతకతనం ఒక్కోసారి ఎలాంటి పరిణామాలు తీసుకొస్తాయో? రుచిచూపించి "అందరితోనూ ఒకేలా మంచిగా వుంటే లాభం లేదు. ఎదుటి మనుషులనుబట్టి మన ప్రవర్తనకూడా మార్చుకోవాలి" అన్న పాఠంనేర్పి మరీ వెళ్ళిపోయింది.

గ్లాసు ఖాళీ అయిపోయింది. బాటిల్లో కూడా ఏం మిగలలేదు.

"తాతా!" మత్తుగా పిలిచాడు రజనీ.

గెస్ట్‌హౌస్ వెనుకవైపున్న పాకముందు మంచం వాల్చుకుని చుట్టకాల్చుకుంటూ కూర్చున్న తాత వంటిమీద కప్పుకొన్న చిరుగులరగ్గు సర్దుకుంటూ పడుగులాంటి నడకతో వచ్చాడు.

సిగరెట్ వెలిగించి, "తాతా! ఓ బాటిల్ కావాలి. ఇక్కడవైన్‌షాప్స్ ఏవైనా తెరిచి ఉంటాయా?" అడిగాడు రజని.

"పదకొండు అయి వుంటుంది కదా? షాపులన్నీ కట్టేస్తారు బాబూ! జంక్షన్ దగ్గరకెళ్ళి రావాలి. అక్కడయినా వుంటే వుంటాయి... వెళ్ళి రమ్మంటారా?"

పర్స్ తీసి డబ్బు ఇవ్వబోతూ, "ఆ.. తాతా! ఇక్కడెవరన్నా దొరుకుతారా?" అడిగాడు.

"అంత క్లాసు సరుకుండదు బాబూ! టవున్లోకి ఎల్లిరావాల" అన్నాడు తాత. "పద... కార్లోవెళ్ళి వచ్చేద్దాం" బయలుదేరాడు రజని డ్రెస్ సరిచేసుకుంటూ.

వాచ్‌మన్‌కు చెప్పి బయలుదేరాడు. నాలుగైదు చోట్ల ఆపించి లోపలకు వెళ్ళి అడిగొచ్చాడు తాత.

"అన్ని చోట్లా క్లాసు సరుకంతా బుక్కయిపోయింది బాబూ! మంచోల్లెవరూ అక్కడ లేరు" అన్నాడు.

"అనుకున్నదానికి భిన్నంగా జరిగితే రజనీకాంత్‌కు నిద్ర పట్టదు. మనసంతా చికాకుతో నిండిపోయి అశాంతిగా వుంటుంది. కాలుస్తున్న సిగరెట్‌ను కసిగా నలిపి పారేశాడు.

"ఇంత రాత్రప్పుడు మంచోళ్లెవరు ఖాళీగా వుంటారు? కొంచెం ముందుగా నాకు చెప్పివుండాల్సింది. ఓ చోటుందిగాని అక్కడంత క్లాసు సరుకుండదు. మరీ నాసిరకం కాదనుకోండి" అన్నాడు తాత నసుగుతూ.

"ఫర్వాలేదు... చూద్దాం పద'' అన్నాడు రజని.

తాత చెప్పిన ప్రకారం ఓ డాబా ఇంటిముందు కారాపాడు. తాత లోపలకు వెళ్ళి, ఎవరితోనో మాట్లాడి వచ్చాడు.

ఓ ముసలి బ్రోకరు ఆత్రంగావచ్చి "రండి బాబూ!" అని లోపలకు తీసుకెళ్ళి సోఫా చూపించి కూర్చోమన్నాడు.

ఓ లావుపాటి మధ్య వయస్కురాలు వయ్యారంగా నడుచుకుంటూ వచ్చి... "ఇక్కడే వుంటారా లేక ఎక్కడికన్నా తీసుకెళ్తారా?" అడిగింది ఎంతో అభిమానంగా.

తాత ఆమెతో ఏదో చెప్పాడు.

"ఏయ్... మిమ్మల్నే రండి'' లోపలున్న వాళ్ళను పిలిచిందామె.

అమ్మాయిలు సీతాకోకచిలుకల్లా రంగు రంగుల బట్టల్లో అలంకరించుకొనున్నారు. లోపల ఎన్ని బాధలున్నా పైకి మాత్రం కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, సరదాగా వేళాకోళాలు ఆడుకుంటూ విటుల కోసం ఎదురు చూస్తూ వున్నవాళ్ళల్లా, ఒక్కొక్కరుగా వచ్చి వరుసలో నిలబడ్డారు ఎవరికి వారే తామే ఎంపిక కావాలని, రజని తమ వైపు చూడగానే ఆశగా వయ్యారంగా హొయలు వొలికిస్తూ కులుకుతూ నిలబడ్డారు. వాళ్ళల్లో కొందరు లేత వయసువాళ్ళయితే, మరి కొందరు ముదురు వయసువాళ్ళు. కొందరు పెదవి పంట నొక్కి, క్రీగంట చూపులు చూస్తుంటే, మరి కొందరు వయసు పొంగుల్ని చూపించి ఆకర్షించటానికి పైట జారుస్తున్నారు.

వాళ్ళను చూస్తోంటే రజనికి చిన్నప్పుడెప్పుడో, అమ్మవారి జాతరలో కోవెల దగ్గర చూసిన బలి పశువులు గుర్తొచ్చాయి. బలిసిన పొట్టేళ్ళను నుదుట పసుపు కుంకుమలతో, మెడలో దండలతో అలంకరించి అమ్మవారికి బలి ఇవ్వటానికి సిద్ధం చేస్తారు. మరుక్షణం తమ మెడపై కత్తిపడ్తుందని వాటికి తెలియదు. అమాయకంగా చూస్తూ నిలబడ్తాయి... పీరూ అంతే! అవి ఒక్కసారే బలవుతాయి, కాని వీళ్ళు మాత్రం ప్రతి రాత్రీ బలి పశువులుగా మారుతూనే వుంటారు. విటుని వయసుతోగాని, రూపంతోగాని సంబంధం లేకుండా, వాడు ఎలాంటి వాడైనా సరే సహించాల్సిందే. ఎంత మొరటుగా, అసహ్యంగా, సేడిస్టిక్‌గా ప్రవర్తించినా సరే డబ్బిచ్చినంత మాత్రాన వాడు ఎంచుకున్న ఆడది వాడితో గడపాల్సిందే ఇష్టం, కోరిక, ఓపిక లేకపోయినా సరే వాణ్ని సుఖ పెట్టాల్సిందే.

వీరికి కోరిక, మనసు చచ్చిపోతాయి. అయినా జీవచ్ఛవాల్లా, వయసునూ, శరీరాన్నీ మదుపు పెట్టుకొని బతుకుతారు. మనసులో లేని సంతోషాన్ని, ఆనందాన్ని, ఉత్సాహాన్ని నటిస్తూ చలాకీగా, ఆకర్షణీయంగా అగుపించటానికి ప్రయత్నిస్తారు అనుకున్నాడు రజని.

వాళ్ళ పరిస్థితికి జాలేసింది.

ఒక్కొక్కరు ఒక్కోరకంగా అలంక రించుకొని వున్నారు వాళ్ళు. అందరికీ చివరగా, అందరికీ భిన్నంగా కను రెప్పలు వాల్చుకొని, తల దించుకొని సిగ్గుతో చచ్చిపోయి, అభిమానంతో భూమిలోకి కుంగిపోతున్నట్లుగా ఉందో కామె. ఆమెను చూడగానే రజనీ కాంత్ కు నెత్తిమీద పిడుగు పడ్డట్టయింది. దిక్కు తోచని వాడిలా నిశ్చేష్టుడై అలా ఉండి పోయాడు.

తను 'భ్రమ' పడుతున్నాడా? ఆమె ఆమేనా? కాదు కాదు ... ఆమె అయి వుండదు. తను మత్తులో ఎవర్నో చూసి మరెవరో అనుకుంటున్నాడు.

మత్తు పొరల్ని తొలగించుకోడాని కన్నట్లు కళ్ళు నులుముకొని మరింత దగ్గ రగావెళ్ళి చూశాడు. గుండె ఆగినంత పనయింది. ఆమెను తను పోల్చాడు. సగం మత్తు దిగిపోయింది. అయినా నమ్మకం చాలడంలేదు.

ఇంకా దగ్గరగా వెళ్లాడు. అప్పటి కళ, కాంతి, రంగు పోగొట్టుకుని శుష్కించిపోయిన శరీరంతో, వాడిన పువ్వులావుందామె. వృత్తిరీత్యా అలంక రించుకున్నా ఆమెలో ఏ ఆకర్షణాలేదు.

ఆ జ్ఞాపకాలన్నీ ఒక్కసారిగా మస్తి ష్కంలో మెదిలాయి. మనసు బాధగా మూలిగింది. ద్వేషం రగులుకుని వికలం అయిపోయింది. కొన్ని క్షణాలపాటు స్తబ్దంగా నిలబడిపోయాడు. తరువాత తేరుకుని ఆమె కావాలన్నట్టుగా బ్రోకరుకు సైగచేసి బయటికొచ్చి కార్లో కూర్చు న్నాడు.

"చాలా గొప్పోడిలాగున్నాడు. ఈ బాబుతమలాంటివాళ్ళదగ్గర కెందుకొచ్చాడో ఇలాంటి ఛాన్సుగాని దొరికితే అదృష్టమే" అని ఆశ పడ్డవాళ్ళందరూ తెల్లబోయారు. శుభ్రంగావున్న ఇంతమందినీ వదిలేసి డొక్కులావున్న దాన్ని ఎంచుకున్నా డేమిటా అనుకుని, ఛాన్సు మిస్సయి నందుకు బాధపడ్డారు.

పర్సులోంచి మూడు వందరూపాయల నోట్లు తీసి వినయంగా నిలబడిన బ్రోకర్ చేతికిచ్చాడు రజని.

చెప్పాలనుకున్నదానికి నాలుగైదు రెట్లెక్కువ డబ్బు చేతిలో పడగానే ఆమెతోపాటు బ్రోకర్ కూడా విస్మ యంగా చూశాడు.

తాత వెంట ఆమె యాంత్రికంగావచ్చి కార్లో కూర్చుంది. బ్రోకరు, లావుపాటామె మరో ఇద్దరు వచ్చి వంగి వంగి సలాములు చేశారు.

తోవలో ఓ వైన్ షాపు ముందు కారాపి ఓ మూడు పెద్ద రాగితాలు తీసి తాత చేతికిచ్చాడు రజని.

తాత బాటిల్స్ తోవచ్చి కూర్చోగానే కారు రయ్యిన దూసుకుపోయి గెస్ట్ హౌస్ ముందు ఆగింది. రజని కారు దిగాడు. తాత దిగి బేక్ డోర్ తెరిచాడు. ఆమె దిగి రజనీ వెంట నిద్రలో నడుస్తున్న మని షిలా లోపలకు నడిచింది.

తాత బాటిల్ ఓపెన్ చేసి ప్లేట్లలో మసాలా జీడిపప్పు, ఉప్పు సర్దిపెట్టి వెళ్ళి పోయాడు.

గదిలోని ట్యూబ్ లైట్ వెన్నెల కాంతిని వెదజల్లుతోంది. మూలగావున్న డబుల్ కాట్ కు ఆనుకుని నిల్చుందామె. బోనులో పడ్డ అపరాధిలా తల దించుకుని బితుకు బితుకుమంటూ నేలచూపులు చూస్తూ నిల బడింది.

గ్లాసులో విస్కీ పోసుకుని గడగడా

తాగేశాడు రజని. గొంతులో రేగిన మంట నతడు లెక్కచెయ్యలేదు. "ఇంతకంటే మండించేదైనా ఫరవాలేదు. కాని అది మాత్రం తన గుండె మంటనార్పగల గాలి. అదే తనకు కావాల్సింది"

మనసు బాధగా మూల్గింది.

ఆమెకు దగ్గరగావెళ్ళి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగాడు – "ఇదేనా నీ జీవితం"

ఆమాట ఆమె చెవుల్లో మళ్ళీ మళ్ళీ ప్రతిధ్వనించింది. పదే పదే ఆ మాటను ఎందరో వేనవేల గొంతులతో అరుస్తున్నట్లుగా అనిపించిందామెకు.

ఆ గోల భరించలేక రెండు చెవులూ గట్టిగా మూసుకుంది. అయినాసరే ఆ ఘోష అలా గోలగా చెవుల్లో గింగురు మంటూ వినిపిస్తూనే వుంది.

ఎర్రగామండుతున్న గోళాల్లా వున్న అతని కళ్ళల్లోని తీక్షణత, ఆమె హృదయంలో భీతిని రగిలిస్తోంది. మనసంతటినీ ఎవరో పిడికిట పట్టి బిగిస్తున్నట్లుగా అనిపించిందామెకు.

ఆ సంఘర్షణకు తట్టుకోలేక హృదయం విలవిల్లాడిపోగా ఎన్నో యోజనాలు నడచివచ్చిన మనిషిలా నీరసించిపోయింది.

"అప్పట్నుంచీ ఇదేరకంగా బతుకుతున్నావా?" ఆ ప్రశ్న ఆకాశపుటంచుల్లోంచి భీకరంగా ఉరిమినట్లు అనిపించిందామెకు.

రాతిబొమ్మలా గోడకు చేరబడి నిలబడిపోయింది. ఆ ప్రశ్నలకు చెవులు దిబ్బడేసిపోయాయి. హృదయం బండబారిపోగా, మానావమానాలకు అతీతురాలినన్నట్లుగా వుండిపోయిందామె.

సమాధానం రాకపోగా ఆమె భుజాలు పట్టి కుదుపుతూ, "ఆరోజు...అక్కడ ఎందుకలా కనిపించావు?" అడిగాడు రజనీ.

ఆమె కళ్ళనుండి అగ్నివర్షం కురుస్తోంది.

"ఊ..! చెప్పు! ఇంకాఅలాగే ఎందుకు బతుకుతున్నావు? ఇంతకంటే మంచిగా బతకలేవా?" పిచ్చిగా అరుస్తున్న అతని కేకలు ఆ గదిలో ప్రతిధ్వనిస్తున్నాయి.

ఆమెలో చలనం కనిపించింది పెదవులు వణుకుతుండగా అంది. "పరిస్థితుల ప్రభావం... అప్పటి పరిస్థితులు నన్ను అక్కడ అలా కట్టిపడేశాయి. అలా జరుగుతుందని వూహించలేదు. జీవితం కుక్క ముట్టిన విస్తరి అయిపోగా నైవేద్యానికి పనికిరాని నేను నా దైవానికి దూరంగా పారిపోయాను. ఆ తరువాత ఆ చీకటి నీడలు నన్ను వదలకుండా అనుక్షణం వేటాడుతూ... పిశాచాల్లా పట్టుకు పీడించాయి. ఇంకా పీడిస్తూనే వున్నాయి. అందుకే-" ఏడ్పుతో ఆమె స్వరం గద్గదమైంది.

"కల్లబొల్లి కబుర్లతో ఇంకా నన్నెందుకు వంచించాలనుకుంటున్నావు? నీ అందంతో నన్ను లోబరచుకున్నావు. నీ నాటకం పూర్తిగాకముందే దొరికిపోయి, ముఖం చూపెంచలేక పారిపోయావు"

"మిమ్మల్ని నేను మోసం చేశాననే భావన మీ మనసులో నాటుకుపోయింది. ఇప్పుడు మీరు ఆవేశంలో వున్నారు. ఇప్పుడేం చెప్పినా అర్థం చేసుకునే స్థితిలో లేరు మీరు. నెమ్మదిమీద మీకు అన్నీ విషయాలూ తెలియజేస్తాను. రోజూ నేను రాత్రి నిద్రపోయేముందు ఆ భగవంతుణ్ని ఏమని ప్రార్థిస్తానో తెలుసా? 'నేను శాశ్వతంగా కళ్లు మూసేలోగా...





ఆ నిజాన్ని రజనికి తెలియజేసే అవకాశం ఒక్కటి ప్రసాదించమని. ఇన్నాళ్ళకు ఆ భగవంతుడికి నాపై దయకలిగి ఆ అవకాశాన్ని ప్రసాదించాడు. ఇప్పుడు నేను రెక్కలు విరిగిన అనాధ పక్షిని. నా జీవితం చుట్టూ బలవంతంగా గీయబడిన ఈ పరిధిని దాటి బైటపడలేను. ఒకవేళ బైటపడినా, నీటినుండి బయట పడ్డ చేపలా గిలగిల కొట్టుకు చావడం తప్ప, మరో మార్గం లేదు" అంది దుఃఖాన్ని ఆపుకోవటానికి విఫల ప్రయత్నం చేస్తూ.

"జీవన సర్వస్వంగా భావించినందుకు ప్రతిఫలంగా నా హృదయాన్ని పగుల గొట్టావు. చిత్రవధకు గురిచేశావు" రజనీ గొంతులో బాధ దొర్లింది.

"జీవన చదరంగంలో ఓడిపోయాను. ఆశల శిఖరాల్నించి జారిపోయి, ఈ జీవితానికింతే రాసిపెట్టుంది' అని సరి పెట్టుకుని, భారమైన ఈ జీవితాన్ని



ఈదుస్తున్నాను. నేను నాశనం అయిపోయాను. సరే! మీరెందుకిలా దిగజారి పోవాలి? నా గురించి మీ జీవితాన్నెందుకు నాశనం చేసుకోవాలి? మిమ్మల్ని నమ్ముకున్న భార్య, పిల్లలకు మీరెందుకు ద్రోహం చెయ్యాలి?" అడిగింది.

రజనీ ఏమీ మాట్లాడలేదు. మౌనంగా విషాదం కురిపిస్తున్న చిన్న నవ్వు నవ్వి బాధగా కళ్లు మూసుకున్నాడు.

"'ఏం చెప్పాలా?' అని ఆలోచిస్తున్నారా?" అడిగిందామె.

"నాకుగా నేనెవరికీ ద్రోహం చేయలేదు సునీతా! కావాలని కోరి ఎవర్నీ బాధించలేదు. ఇది నిజం" అన్నాడు.

"మీరు కోరకపోయినా ఆ ఎదుటి వాళ్ళకు ద్రోహం జరగడం మాత్రం నిజం... కాదంటారా?"

"మూర్ఖంగా, అజ్ఞానంతో వాళ్ళు తమకు తామే ద్రోహం చేసుకుంటే దానికి నేనేం చేయలేను. వాళ్ళకి సంగతి తెలుసో, తెలియదోగానీ నా జీవితం ఇలా కావటానికి, కారణం వాళ్ళే... వాళ్ళే నా జీవితంతో ఆటలాడుకొన్నారు. నా మంచితనాన్ని, అమాయకత్వాన్ని చేతకానితనంగా భావించారు. వారివల్లే నాకు ద్రోహం జరిగింది. నా జీవితం నాశనం అయింది. ఆ బాధను, అవమానాన్ని ఎవరికీ చెప్పుకోలేక దిగమింగుకొని గుండెలో దాచుకోలేక సతమతం అయ్యేవాడిని'' బాధగా అన్నాడు రజనీ.

"ఒకప్పటి సంగతి వదిలెయ్యండి. ఎవరో మీకు ద్రోహం చేయడం కాదు. ఇప్పుడు మీకు మీరే ద్రోహం చేసుకుంటున్నారు. చేజేతులా మీ బంగారు భవిష్యత్తును గంగలో కలుపుకుంటున్నారు. ఈ తాగుడు, తిరుగుడు మీ జీవితం మీద ఎంతగా దెబ్బతీస్తున్నాయో? ఎప్పుడైనా ఆలోచించారా? డాక్టరై వుండి కూడా ఇంత ముఖ్యమైన విషయాన్నెందుకు నిర్లక్ష్యం చేస్తున్నారు?"

"జీవితంపై అతిగా ఆశలు పెంచుకోవడం రేపటి జీవితం గురించి ఆలోచిస్తూ కుమిలిపోవడం తెలివితక్కువ పనుల్లా అనిపించాయి సునీతా! అందుకే ఇప్పుడు మనసుకు తోచిందల్లా చేయడం, మనసు కోరిందల్లా అందుకోవడం చేస్తున్నాను. మనసును కలచివేసే పీడకలల్లాంటి ఆ సంఘటనలేవీ గుర్తుకురాకుండా వుంచుకోవడం కోసం ప్రయత్నం చేస్తున్నాను. అందుకే తాగుతున్నాను. తిరుగుతున్నాను. ఎంత తొందరగా వీలయితే అంత తొందరగా ఈ ప్రపంచానికి దూరంగా మరో లోకానికి పారిపోవాలని చూస్తున్నాను" అన్నాడు రజనీ. బాధతో అతని ముఖం కందగడ్డలా తయారైంది.

"అలాగే ఎందుకు చేయాలి? మరో మార్గం ఏదీ లేదా?"

"ఎదురు దెబ్బల్ని తట్టుకోగలిగేశక్తి అందరిలోనూ ఒకేలా వుండదు"

"అది చాలా తప్పుడు అభిప్రాయం. మీరు ఎంచుకొన్న ఆ మార్గం ఆ బాధను, జ్ఞాపకాల్ని మరింత ప్రజ్వలింపజేస్తుందే తప్ప ఉపశమనం ఏమాత్రం కలిగించదు" అంది సునీత.

రజనీ మరేం మాట్లాడలేదు. కొంచెం విస్కీ గ్లాసులో పోసుకుని ఒకే ఒక్క గుక్కలో మింగేశాడు.

"ఆనాటి ఆ సంఘటన మీ జీవితంపై ఇంతగా దెబ్బతీస్తుందని అప్పట్నుంచే మీ జీవితం ఇలా మలుపుతిరిగిందనీ అనుకోలేదు. దానికి కారణం నేనేఅన్న నిజాన్ని నేను భరించలేకపోతున్నాను" దుఃఖంతో

కంపించిపోతూ అంది సునీత.

రజనీ మౌనంగా వుండిపోయాడు.

"మీ జీవితం ఇలా కావటానికి కారణం నేనే! మీ జీవితాన్ని నేనే నాశనం చేశాను. నావల్లనే మీకింత ద్రోహం జరిగింది" పదే పదే పలవరిస్తూ ఏడుస్తోందామె సీర సంతో వేలాడిపోతూ. ఒక్కసారిగా నిలువునా మైకం కమ్ముకోగా నిలబడలేక అటూ ఇటూ వూగిపోతూ జోగిపోతోంది.

కిందపడబోతున్న ఆమెను పొదివి పట్టుకొన్నాడు రజని. "సునీతా సునీతా! ఏం జరిగింది?" ఆదుర్దాగా అడిగాడు.

నీళ్లునిండిన కళ్ళతో నిస్త్రాణగా అతని వేపు చూస్తూ ప్రశ్నించింది సునీత. "నిజం చెప్పండి. నావల్లనే మీరు ఇలా అయిపోయారు కదూ!"

రజని తల దించుకొన్నాడు.

"ఆ సమయంలో నేను మరేం ఆలోచించలేదండీ! ఇలాంటి పరిస్థితులు వస్తాయనినేను కలలోకూడా వూహించలేదు. మీకు దగ్గరవుతున్నానన్న భ్రమలో వుండిపోయానేతప్ప, మీకు శాశ్వతంగా దూరం అయిపోతున్నానని అనుకోలేదు. దయచేసి నాకొంచెం విషం తెచ్చి ఇవ్వండి...మీ జీవితాన్ని నాశనంచేసిన ద్రోహి పీకనులిమి చంపెయ్యండి. మీ పగంతా తీర్చుకోండి. ఈ బాధ నేను భరించలేను ... చచ్చిపోతాను" క్షణ క్షణానికీ ఆమె దుఃఖం ఎక్కువవడంతో వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"సునీతా...సునీతా! ఎందుకలా అయి పోతున్నావు? ప్లీజ్! ఎక్సయిట్ కావద్దు"

కాని సునీత హిస్టీరిక్‌గా వూగిపోతూ ఏదో అంటోంది. ఆయాసంతో రొప్పు తోంది. కళ్ళు తేలవేస్తోంది.

"తాతా...తాతా!"గాభరాగా పిల్చాడు రజనీకాంత్.

తాత ఆత్రుతగా పరుగెత్తుకొచ్చాడు, "ఏం బాబూ! ఏం జరిగింది" అంటూ.

"ఈమెను కాస్త ఇలా పట్టుకో. నేను వెళ్ళి డాక్టరుకు ఫోన్ చేస్తాను." అంటూ పరుగెత్తాడు.

ఫోన్ చేసి, డాక్టర్ రమేష్‌ను వెంటనే బయలుదేరి రమ్మన్నాడు. పేషంట్ కండిషన్ అంతా చెప్పాడు.

ఓ పదినిముషాల్లో గెస్ట్‌హౌస్ ముందు కారాగింది.

డాక్టర్ రమేష్ మెడికల్ కేస్‌పట్టుకొని ఆత్రంగా పరుగెత్తుకుని లోపలకు వచ్చాడు.

మంచంమీద నిస్త్రాణగా పడివున్న సునీతను పరీక్షచేశాడు. ఓ రెండు ఇంజక్షన్లు ఇచ్చి, ఓ పావుగంటవరకూ దగ్గరే వుండి, ఇక ఫర్వాలేదని, "డాక్టర్! నౌ షి ఈజ్ ఆల్ రైట్! అవసరం అయిన ఇంజక్షన్స్, మెడిసిన్స్ అన్నీ తీసు కొచ్చాను. నేవెళ్తున్నాను. అవసరం అను కుంటే వుంటాను... నాకేం అభ్యంతరం లేదు" అన్నాడు డాక్టర్ రమేష్.

"థాంక్స్! అవసరంలేదు. నేను చూసు కోగలను" అన్నాడు రజనీకాంత్.

"వుంటానికి నాకేం అభ్యంతరంలేదు" అన్నాడు రమేష్ ... టీపాయ్‌మీదున్న బాటిల్ వేపు చూస్తూ, రజనీకాంత్ వేపు చూస్తూ.

"ఇట్సాల్ రైట్! మీ డౌట్ నాకర్థం అయింది. ఫరవాలేదు. నా మత్తు అంతా ఎప్పుడో దిగిపోయింది. ఇక తీసుకోను కూడా. నౌ అయామ్ ఆల్ రైట్! ఐ కెన్ మేనేజ్...థాంక్యూ" అన్నాడు నవ్వుగా నవ్వుతూ.

డాక్టర్ రమేష్ వెళ్ళబోతున్న వాడల్లా

ఆగి, "డాక్టర్! ఈ బిచ్ కోసం ఎందుకంత వర్రీ అవుతున్నారు? హాస్పిటల్లో చేర్పిస్తే పోయేదిగా" అన్నాడు.

రజనీకాంత్ ముఖం కోపంతో ఎర్ర బడటం గమనించి—"సారీ!" అంటూ ఆ సంభాషణ అక్కడితో ఆపి, "నే వెళ్ళొస్తాను డాక్టర్! అంతగా అవసరం అయితే ఫోన్ చెయ్యండి" అని వెళ్ళి పోయాడు.

రమేష్ కారు వెళ్ళిపోయింది.

కొన్ని క్షణాలపాటు అతను వెళ్ళిన వేపు చూస్తూండిపోయాడు రజనీ.

సునీతను, రమేష్ 'బిచ్' అని అనడం తనకెంతో బాధ కలిగించింది. ఆమెకోసం తనకెందుకంత వర్రీయో రమేష్‌కెలా తెలుస్తుంది? అయినా అతను అన్నమాటలో నిజం వుందికదా! ఆమె అలా మారటానికి కారణం ఎవరు? తనా...? తనెలా అవుతాడు?'

సిగరెట్ వెలిగించి సునీతవేపు నడిచాడు.

మంచంమీద నిస్త్రాణగా పడుకొని వుంది సునీత. ఆమెకు దగ్గరగా కుర్చీ లాక్కొని కూర్చున్నాడు. మత్తంతా దిగి పోయి, వికారంగా నీరసంగా వున్నట్టు అనిపిస్తోంది.

సునీతవైపు చూశాడు. మంచం మీద పడుకోబెట్టిన ఆమె పాలరాతి శిల్పంలా లేదు కాని తన హృదయాన్ని దోచు కున్న ఆనాటి ఆమెరూపు కళ్ళ ఎదుట కదలాడింది. లేతగా, అప్పుడే వికసిస్తున్న గులాబిరేకుల లావణ్యం, తాజా ఏపిల్ లోని ఎర్రదనం, గుండ్రంగా నిండు దనాన్ని సంతరించుకుంటున్న వొంపుల సొంపుదనం, లేడిపిల్లలా గంతులేస్తూ కదలాడే చలాకీతనం, వికసించిన ముద్ద మందారాల అందంఅన్నీ ఆమె స్వంతం అనిపించిన ఆ రోజులన్నీ గుర్తుకొస్తు న్నాయి...



సునీతను తను మొదటిసారిగా వాళ్ళ కాలేజి యానివర్సరీ ఫంక్షన్‌లో స్టేజిపై నాట్యం చేస్తూంటగా చూశాడు. మెడికల్ కాలేజి పక్కనే వున్న ఆ డిగ్రీకళాశాల లోని ఫంక్షనుకు ఫ్రెండ్సుతోపాటు తనూ వెళ్ళాడు. నాట్యప్రదర్శనకు ముందుగా లలితసంగీతం, సినిమా పాటలపోటీ కార్య క్రమాలు జరిగాయి.

ప్రేక్షకులలోంచి కేకలువేస్తూ, పాడే వాళ్ళను పాడనియ్యకుండా కొంతమంది విద్యార్థులు అల్లరి చేస్తున్నారు.వాళ్ళంతగా అల్లరి చేస్తున్నా కొంతమంది తమ గానాన్ని కొనసాగిస్తూంటే, మరి కొంత మందిఆఅల్లర్ని తట్టుకోలేక మరింత అల్లరి పాలవుతున్నారు. మొత్తానికి ఆ కార్య క్రమం అంతా కేకలు, చప్పట్లు అల్లరి తోనే పూర్తయింది.

"తరువాత కార్యక్రమం, నాట్య ప్రదర్శన... కుమారి సునీత, ఫైనలియర్ ఆర్ట్స్" అని అనౌన్సు చేసి, తెర తీశారు.

భరతనాట్య భంగిమలో అరవిరిసిన గులాబీలా, స్టేజీపైన నిలుచుని వున్న ఆమెను చూడగానే అంతవరకూ అల్లరి చేసిన విద్యార్థులుకూడా మంత్రముగ్ధులై

నట్టు వుండిపోయారు. తనయితే మరీను. పారవశ్యంలాంటిది ఏదో కలిగింది. ఆమె అందం, నాట్యం తన మనసులో చెరగని ముద్రవేశాయి. ప్రదర్శన అయిన వెంటనే హాలంతా చప్పట్లతో మార్మోగింది. ఫ్రెండ్సందరినీ వదలి తను గ్రీన్ రూము వైపు పరుగెత్తాడు.

"కంగ్రాచ్యులేషన్స్...మీ నాట్యం ఎంతో బాగుంది. నాకెంతగానో నచ్చింది. ఈ డ్రెస్ మీకెంతో బాగుంది" అంటూ పొగిడాడు.

థాంక్సంటూ అందంగా నవ్విందామె.

"నా పేరు రజనీకాంత్! మెడిసిన్ చదువుతున్నాను" అన్నాడతను.

"అలాగా..నమస్కారం" అందామె.

ఆమెకు కంగ్రాట్స్ చెప్పడానికి చాలా మంది స్టూడెంట్సు గ్రీన్‌రూములో చేరబడిపోయారు. అందరి అభినందనలూ అందుకుంటూ థాంక్స్ చెప్తోందామె.

దగ్గర్నుంచి చూడ్డానికి మరింత అందంగా అగుపిస్తోంది. నమ్రతగా, పొగడ్తలకు సిగ్గుపడ్తున్న ఆమె బుగ్గలపై చిన్నసొట్ట ఆమె అందాన్ని రెట్టింపు చేస్తోంది. ఆమె కళ్ళు వింతగా మెరుస్తున్నాయి. కలువరేకుల్లాంటి విశాలమైన విస్ఫారితనేత్రాలు, తుమ్మెద రెక్కల్లాంటి కనురెప్పలు, అర్ధచంద్రాకారంలో సన్నగా తీర్చిదిద్దినట్లున్న కనుబొమ్మలు, విశాలమైన నుదుటిపై పున్నమిచంద్రునిలా అగుపిస్తున్న బొట్టు,ముత్యాలహారంలా మెరిసే తెల్లటి పలువరుసతో అప్సరసలా వుందామె. ఆమె అందాన్నలా చూస్తూ రోజుల తరబడి ఆరాధిస్తూ వుండిపోవాలనిపిస్తుంది.

వాలంటీర్స్ వచ్చి లోపలున్న వాళ్ళందర్నీ బైటకు పంపించేశారు.

ఆ రాత్రంతా తనకు నిద్ర పట్టలేదు. కళ్ళుతెరిచినా మూసినా ఆమె రూపే కనిపించేది. తెలతెలవారుతుండగా కాస్తంత నిద్రపట్టినా, ఆ నిద్రలోనూ ఓ కల... ఆ కలలో నాట్యం చేస్తున్న సునీత కనిపించింది.

ఆ తర్వాత నాలుగైదుసార్లు రోడ్డుమీద వెళ్తూ కనిపించింది.ఆమె దృష్టిలో పడాలని తను చాలా ప్రయత్నం చేసాడు. కొంత దూరంపాలో ఆయ్యేడు కూడా. తనవైపు చూసినా చూడనట్లే వెళ్ళిపోయింది.

ఓసారి ఆమె ఎదురుగా వస్తున్నప్పుడు ఆమెవైపే అలాచూసుకుంటూ వెళ్తున్న తనను ఓ రిక్షా గుద్దేసింది. 'బెల్ కొడ్తున్నా తప్పుకోవు' అని రిక్షావాడు ఓ కామెంట్ పారేసిపోయాడు. మోచేతికి దెబ్బ తగిలి రక్తం వచ్చింది. ఆమె దగ్గరగా వచ్చి 'రోడ్డుమీద జాగ్రత్తగా నడవాలి' అంది జాలిగా చూస్తూ.

"సారీ! జాగ్రత్తగానే నడుస్తుంటాను. ఎందుకో మీరు కనిపిస్తే మనసుస్వాధీనం తప్పుతోంది. ఆరోజు మీ నాట్యప్రదర్శన చూసినప్పటి నుండీ ఇదే అవస్థ"

"థేంక్స్! ఏదో అలా చేసేశాను. ఇంకా నేర్చుకోవలసింది చాలా వుంది" అంది చిరునవ్వుతో ఆమె.

"ఇంకా బాగా ప్రాక్టీస్ చెయ్యండి" అన్నాడు తను.

"థేంక్సండీ!వస్తాను..నమస్కారం!" అని వెళ్ళిపోయింది.

'ఆమె ఇంకా కాస్సేపు వుండే బావుణ్ణు' అనిపించింది. ఆమెతో ఆ మాత్రం మాట్లాడినందుకే మనస్సంతా ఏదో పిచ్చి ఆనందంతో నిండిపోయింది. ఆమెకు తను నచ్చే వుంటాడు. అయినా తనకేంలోటు? పచ్చని శరీర ఛాయ,




వుంగరాల జుత్తు, ఒడ్డూ, పొడుగూ, చక్కనైన రూపంతో నిండుగాకన్పిస్తాడు. మంచి బట్టలు వేసుకుని, ట్రిమ్‌గా తయారైతే తను మరింత అందంగా అగుపిస్తాడు.

ఆ తరువాత ఓసారి ఆమె కనిపించింది కళ్ళతోనే పలుకరించాడు. ఆమె కూడా కళ్ళతోనే సమాధానం చెప్పి, చిరునవ్వు నవ్వింది. ఓ రెండ్రోజులవరకూ మనస్సంతా ఎంతో ఉల్లాసంగా వుంది. ఆమె కనిపిస్తే ఆనందం...కనిపించని రోజున ఏదో దిగులు.

రోజులు గడుస్తూన్నాయి... కాలేజి నుండి తిన్నగా వాళ్ళ కాలేజి గేటు దగ్గరున్న బస్టాపు దగ్గరకు వెళ్ళి నిలబడేవాడు. గేటులోంచి వస్తూన్న ఆమెను చూడగానే మనస్సు ఆనందంతో ఎగిరి గంతేసేది. ఆమె చిరునవ్వు మనసులోని చీకట్లను, దిగులు, గుబుళ్ళను దూరంచేసి వెన్నెల వెలుగును నిండా నింపేది.

ఓరోజు కాలేజి నుండి రూముకొస్తున్న తనకు సునీత కనిపించింది. వాళ్ళింటి ముందున్న మందార చెట్టు దగ్గర పైగా అందకుండా వున్న పూలను ఎగిరెగిరి తెంపటానికి ప్రయత్నం చేస్తోంది. ఆమెను చూడగానే మనసులో ఏదో గిలిగింత. ఆమెతో మాట్లాడాలనిపించింది. 'ఎలా వీలవుతుంది? ఇదే వాళ్ల ఇల్లన్నమాట...పలకరిస్తే ఆమె పలుకుతుందా?' అలా అనుకుంటూనే వాళ్ళ ఇల్లు దాటిపోయాడు తను. వెనక్కు తిరిగి వాళ్ళ ఇంటివైపు నడుస్తూంటే గుండె చిత్రమైన వేగంతో కొట్టుకోవడం ప్రారంభించింది. ఓ రెండు మూడుసార్లు అప్రయత్నంగానే వాళ్ళింటి ముందు అటు ఇటు తిరిగాడు.

పూలను తెంపే ప్రయత్నంలోనే వున్న ఆమె, జారిపోయిన పైటను గు ర్తించలేదు. ఆవైపునుండి దృష్టి మరల్చుకోలేకపోయిన తన నోటినుండి అప్రయత్నంగానే "ఏవండీ!" అన్న పిలుపు వెలువడింది. ఫెన్సింగ్‌కు ఇవతల రోడ్డుమీద నిలబడ్డ తనను చూసిందామె. అలవాటుగా పైట సర్దుకోవటానికి ప్రయత్నించి, అది స్థానభ్రంశం చెందిన విషయం గమనించి, సిగ్గుపడి సర్దుకుని లోపలకు పారిపోయింది.

సిగ్గుపడ్డ ఆమెలో మరిన్ని అందాలు, ఆకర్షణ అగుపించాయి. ఓ రెండుసార్లు వెనక్కు తిరిగి చూశాడు. సునీత కనిపించలేదు.

* * *

రూముకొచ్చి ఆమె రూపాన్ని మననం చేసుకున్నాడు. కళ్ళముందు లీలగా సునీత రూపం. రోడ్డుమీద ఎక్కడో ఓచోట ఆమె కనిపించేది. తనను చూసినా తల దించుకొని వెళ్ళిపోయేది.

ఇద్దరి కాలేజీలు పక్కపక్కనే వుండటం అదో అదృష్టం. కొన్ని రోజుల తర్వాత ఆమెలో కొంత మార్పు వచ్చింది. తనంటే ఇష్టం పెరుగుతున్నట్టు అనిపించింది. చూసిన వెంటనే తలదించుకొని పోయేదల్లా... ఓరచూపుల్తో గిలిగింతలు పెడ్తోంది. కొద్ది రోజుల తర్వాత చూపులు అన్నీ పూసుల్లోకి దిగాయి. క్రమంగా ఎన్నెన్నో కబుర్లు ... ఎన్నో రకాల విషయాలపై చర్చలవరకూ వెళ్ళింది.

'ప్రేమ' అనేది ఏక్షణాన ఎప్పుడు, ఎలా, ఎందుకు పుడ్తుందో ఎవరికీ తెలీదు. 'ఆమెనే ఎందుకు ప్రేమించావు?' అని ఎవరైనా నిలదీసి అడిగితే తనేం సమాధానం చెప్పలేడు. తనకు నచ్చిన, మనసు మెచ్చిన విషయాలు

ఏవేవో వుంటాయి. తానైతే ఆమె సౌందర్యాన్ని, నాట్య కౌశలాన్ని ప్రేమించాడు.

ఓరోజు పార్కులో ఆమెతో ఆ మాటే అన్నాడు.

విని, నవ్వి వూరుకుందామె.

"మరి నువ్వు నాలో ఏం చూసి ప్రేమించావు?" అడిగాడు.

ఆమె ఈసారి బాగా నవ్వింది. పడి పడి నవ్వింది "నా సంగతి ఏమని చెప్పమంటారు? ఏమో బాబూ! నాకేం తెలీదు...తెల్సినా చెప్పలేను. ఒక ఆడపిల్లను పట్టుకొని ఇలా ఎవరైనా అడుగుతారా?" అంది సిగ్గుపడుతూ.

"నువ్వు కాబట్టి ఇలా అడిగాను. పరొకర్నెవర్నైనా అడుగుతానా? ఏంటి"

"పోనీ! ఎవర్నైనా అడిగి చూడక పోయారా? వాళ్ళేం చెబుతారో?" అంది కొంటెగా చూసి సన్నగా నవ్వుతూ.

"ఏం... ఎవరితోనైనా నేను చివాట్లు తింటే నీకు చూడాలనుందా? అలాంటి సలహా ఇస్తున్నావు? నేను ఈ జీవితంలో ఒక్కర్నే ఆ ప్రశ్న అడగాలనుకున్నాను. అడిగేశాను. మరెవర్నీ అడిగే ప్రసక్తి లేదు. చెప్పు... నాలో ఏం చూసి నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు?"

"అందమైన మొద్దబ్బాయివని! అంతే" కిలకిల నవ్వింది.

"అయితే! నిజంగా నేను అందంగా వుంటానా?"

"అద్దంలో ఎప్పుడూ చూసుకోలేదా?" కొంటెగా అంది.

"లేదు..ఆ విషయానికెప్పుడూ అంత ప్రాధాన్యత ఇవ్వలేదు. ..ఇక మీద నుంచే లైన్లో పడతాను"

"మీరు అందంగానే వుంటారు..చాలా? ఇప్పుడన్నా నమ్మకం కుదిరిందా?"

కళ్ళు గుండ్రంగా, చిత్రంగా తిప్పుతూ అంది సునీత.

"లేదు! నాకు కన్ఫర్మేషన్ కావాలి" బుంగమూతిపెట్టి అన్నాడు తను.

"అందుకు నేనేం చెయ్యాలి? ఇంకా గట్టిగా అరచి చెప్పేదా?"

"అబ్బే! అంత శ్రమపడాల్సిన అవసరం ఏం లేదు. సింపుల్ ... వెరీ సింపుల్. ఈ బుగ్గమీద ఓ చిన్న ముద్దు ఇచ్చెయ్...చాలు అంతే!"

"ఛీ ... ఫో" సరసంగా కసిరింది.

"అరే! పొమ్మంటున్నావా? ఎక్కడికి? అన్నిపన్లు మానుకొని ఈ పార్కు దగ్గర నీకోసం ఎదురుతెన్నులు చూసేలా చేశావు. వస్తే తీరా పొమ్మంటున్నావు. ఇదేం న్యాయంగా లేదు" కొంచెం దగ్గరగా జరిగాడు తను. "ఫరవాలేదు ఇచ్చెయ్!" అన్నాడు గుసగుసగా.

"మీరు అడిగిన వెంటనే ఇచ్చేస్తే న్యాయంగా వుంటుందా?" కొంటెగా చూస్తున్న ఆమె కవ్విస్తున్నట్లుగా వుంది.

"యువరానర్! నా కామాత్రం న్యాయం చెయ్యరా?" అంటూ ఆమె తలను రెండు చేతులతోనూ దగ్గరగా తీసుకొని ఓ వెచ్చటి ముద్దు ఇచ్చాడు.

అనుకోని ఈ సంఘటనకు సునీత బిత్తరపోయింది. "ఛీ! అందుకే రాను. ఎందుకలా చేశారు?" అంటూ విసురుగా కోపంతో లేచింది.

ఈసారి బిత్తరపోవడం తనవంతయింది. "సారీ! పొరపాటయింది. ఈ మాత్రానికే మీకంత కోపం వస్తుందనుకోలేదు" అన్నాడు తను.

బతిమాలగా చాలాసేపటికి శాంతించింది. "ఈసారిగాని ఇలాంటి వేషాలువేస్తే





మాత్రం మీతో మాట్లాడను. జాగ్రత్తగా వుండండి" అంది.

చిరుకోపంతో మూతిముడుచుకొని కూర్చున్న ఆమె భంగిమలో వింత సోయగాలు కనిపిస్తున్నాయి. వత్తుగా పెరిగిన పచ్చగడ్డిలో, గులాబిరంగు పరికిణీ, లేత ఎరుపురంగు జాకెట్టుపై తెల్లటి వోణీ వేసుకుని కూర్చున్న ఆమె అప్పుడే వికసిస్తున్న రోజా పువ్వులా వుంది. చక్కగా అమరిన ఆ రంగుల కంపోజిషన్‌ను చూస్తూ అలాగే కొన్ని నిముషాలపాటు వుండిపోయాడు తను.



తమ ప్రణయం అలా రోజు రోజుకీ కొత్త అందాల్ని సంతరించుకుంటూ దిన దినాభివృద్ధి చెందింది.

* * *

మంచంమీద పడుకొనిఉన్న సునీత కదలుతోంది. ఓసారి బాధగా మూలిగి పక్కకు తిరిగి పడుకొంది. జ్ఞాపకాలన్నీ చెదిరిపోయాయి.

లేచి టెంపరేచర్ చూశాడు రజనీకాంత్. ఓ ఇంజక్షన్ చేసి, కేప్స్యూలు నోట్లో వేసి నీళ్ళు తాగించాడు.

మనసు బాటిల్ వైపు లాగింది. ధ్యాసను బలవంతాన మళ్ళించుకొని ఓ గ్లాసుడు మంచినీళ్లు తాగి ఆమె వైపు చూస్తూ పక్కనే కూర్చున్నాడు. 'బాటిల్‌ను ముట్టుకుంటే మళ్లీ నిలదొక్కుకోవడం అసాధ్యం...'

సిగరెట్ ముట్టించాడు. పొగ రింగులు రింగులుగా గాల్లో తేల్తూంది.

మనసు మళ్లీ గతంవైపు పరుగెడుతోంది. గతాన్ని తవ్వుకుంటున్నకొద్దీ బయటపడుతున్న శిథిలాలు, చీకటి కోణాలు, హఠాత్తుగా పైనపడి తనను సజీవంగా సమాధిచేయబోయిన మట్టిపెళ్ళలు వీటన్నిటి బారినుండి తప్పించుకొని తానెలా బయటపడగలిగాడో? ఏమో... ఈ ప్రపంచాన్నంతటినీ కనిపించకుండానే ఆడేస్తూ పాలిస్తున్నట్లు చెప్పబడే అదృశ్య శక్తి ఆ దైవం ఇచ్చిన బలంతోనే, ఆత్మస్థైర్యంతోనే తానీ పరిస్థితులన్నింటినీ ఎదుర్కొని నిలదొక్కుకోగలిగాడా? లేక తన జన్మసంస్కారం, కార్యదీక్ష, కృషి, పట్టుదలా ఇవా? వీటిలో ఏదైనా కావచ్చు. ఏదియేమైనా తాను ఓ ఉన్నతస్థానాన్ని అందుకోగలిగాడు. లేకపోతే తెగిన గాలిపటంలా గాలివాటుకు కొట్టుకుపోయి ఏ ముళ్ళ డొంకల్లోనో చిక్కుకుపోయి ఛిన్నాభిన్నం అయిపోయి వుండేవాడు. గతం అంతా సినిమా రీలులా కళ్ళముందు కదలాడింది.

* * *

మిత్రుడు సుసీల్ ఏవేవో కబుర్లు చెబుతుంటే ఆలకిస్తూ నడుస్తున్న రజనీకి కొంచెందూరంలో ఎవరో వయసు మళ్ళినాయనతో కబుర్లు చెప్తూ వస్తున్న వ్యక్తిని చూడగానే గుండె ఝల్లుమన్నట్టుఅయింది. పచ్చటి శరీర ఛాయ, ముఖానికి అదో రకమైన వ్యక్తిత్వాన్ని, అందాన్ని, గౌరవాన్ని ఆపాదిస్తున్న పండు జుత్తుతో, తెల్లని మల్లెపూలలాంటి బట్టల్లోవున్న ఆ వ్యక్తి దగ్గరవుతున్నకొద్దీ మనసులో ఏదో తెలియని ఉద్విగ్నత ఆనందం చెలరేగాయి. పరుగెత్తుకుంటూ వెళ్ళి ఆయన్ను ఆప్యాయంగా కౌగలించుకొని బావురుమని ఏడవాలనిపించింది. కాని ఏదో అశక్తత, ఏదో బలహీనత, వెనక్కులాగుతోంది. అందుకే అలా చేయలేకపోయాడు.

వాళ్ళిద్దరూ దగ్గరకు రాగానే "నమస్కారం...బావున్నారా?" అభిమానంగా అడిగాడు రజనీ.

ఏదో టాపిక్‌పై సీరియస్‌గా ఓ చిన్నసైజు ఉపన్యాసంలాంటిది ఇస్తున్న అనంతరావు ఆగి 'ఎవరా?' అని చూశాడు.

ఎదురుగా పచ్చగా, బొద్దుగా, ఎత్తుగా పంకీలు తిరిగిన జుత్తుతో, మిలమిల్లాడుతున్న కళ్ళతో, మిసమిసలాడుతున్న వయసులో అందంగావున్న యువకుణ్ని చూడగానే అతని ముఖం వికసించింది. ఆనందం, ఆప్యాయత పొంగుకొచ్చింది. "బాబూ... బాగున్నావురా? ఎన్నాళ్ళకు కనిపించావురా?" పలకరించాడు ఆత్రంగా భుజంమీద చేయివేసి.

"బాగానే వున్నాను" అన్నాడు రజనీ. అతనికెంతో సంతోషంగావుంది. ఆస్పర్శ, ఆ కౌగిలింత అతని మనసు, శరీరం కోరుకుంటున్నవే. ఆ ఆప్యాయతకోసం తన మనసులో నిద్రాణంగాఉన్న తపన మేల్కొని వెలికివచ్చింది.

మనసు నిండిన అభిమానం, వాత్సల్యాలతో ఆనందరావుకు నోటమ్మట కొన్ని నిమిషాలవరకూ మాట రాలేదు. కొన్ని నిమిషాల తర్వాత అడిగాడు– "అప్పట్నించీ ఇక్కడే వుంటున్నావా?"

అవునన్నట్లు తలూపి "మీరెప్పుడొచ్చారు?" అడిగాడు రజనీకాంత్.

"రిటైర్ అయిపోయానుకదా! అందరం వచ్చేశాం. వచ్చి నెలరోజులవుతోంది. ద్వారకానగర్‌లో వుంటున్నాం. నువ్వెక్కడుంటున్నావు? ఏం చేస్తున్నావిప్పుడు?" అడిగాడు ఆనందరావు. అతని మనసు బాధగామూలిగింది. మనసు మూలల్లో ఏదో పశ్చాత్తాపం మెదిలింది.

"అల్లిపురంలో బజారుకు దగ్గర్లో ఉంటున్నాను. అవును! మీరేంటి అలా చిక్కిపోయారు? తలంతా బాగా పండిపోయింది. ఆరోగ్యం బావుంటోందా? ఇంట్లో అందరూ కులాసాయేనా?" అడిగాడు రజనీ.

"అందరూ కులాసాయే అది తప్ప. దానికెప్పుడూ ఏదో ఓ రోగం వుండనే ఉంటుంది. మనసు బాగా ఉంచుకుంటే శరీరం కూడా ఆరోగ్యంగా ఉంటుంది. ఎప్పుడూ గొణుక్కుంటూ,విసుక్కుంటూ, కేకలేసుకుంటూ ఇంటిని నరకం చేస్తుండే దానికి ఆరోగ్యం ఎలా బావుంటుంది? పిల్లలా అంటే ఎవరూ చెప్పినమాట వినిపించుకునే రకాలుకాదు. ఏదో అలా జరిగిపోతున్నాయి రోజులు. ఇప్పుడెక్కడికని బయలుదేరావు? పద... మన ఇంటికెళదాం" అన్నాడు ఆనందరావు.

"మన ఇంటికా?" అప్రయత్నంగా అన్నాడు రజనీకాంత్. అవునని తలూపాడు ఆనందరావు.

"మన ఇంటికి ఇప్పుడు రావటానికి వీలవదండి. ఇప్పుడో ఫ్రెండ్ ఇంటికి వెళ్తున్నాను. వీలుచూసుకొని ఎప్పుడైనా ఓ ఆదివారం పూట వస్తాను. నేను ఇంటికి రావచ్చోలేదో ఆవిణ్ని ముందుగా అడగడం మంచిది. లేకపోతే అనవసరంగా మీ ఇద్దరిమధ్య గొడవలు... మీకు మనశ్శాంతి లేకుండా పోతుంది. మిగతా రోజుల్లో నాకెప్పుడూ తీరికుండదు. ట్యూషన్సు, పార్ట్‌టైమ్ జాబ్ ఆపీ వుంటాయి" అన్నాడు రజనీ.

ఖంగు తిన్నట్టు అయిపోయాడు ఆనందరావు. ఎదురుగా తలదించుకొని నిలబడ్డ కొడుకు ముఖంలో గాయపడిన అతని మనసు కనిపించింది. 'రజని అన్నదీ నిజమే! ముందుగా దానికి చెప్పా చెయ్యకుండా అతన్ని తీసుకెళ్తే...అది గొడవపెట్టినా పెట్టొచ్చు' అనిపించింది.

"సరే...అలాగే చెయ్యి. నీకు వీలయినప్పుడు, ఆదివారమే రా! తీరిగ్గాకూర్చొని మాట్లాడుకోవచ్చు. అక్కడే భోజనం చేద్దువుగాని" అన్నాడు ఆనందరావు.

కొడుకు చదువు సంగతి తెలుసుకుందామని ఆత్రంగావుంది ఆనందరావుకు. చదువుతున్నాడో లేక ఆపేశాడో తెలీదు. సంశయిస్తూనే అడిగాడు. "చదువు...ఎలా సాగుతోంది?"

"ఫరవాలేదు. బాగానే సాగుతోంది. నాన్నమ్మ కోరిక ప్రకారం మెడిసినే చదువుతున్నాను" అన్నాడు రజనీకాంత్.

"ఆ మెడిసిన్!...ఎం.బి.బి.యస్!... డాక్టర్ కోర్స్!..నిజంగానా? ఇప్పుడు నాకెంతో సంతోషంగా వుందిరా. డాక్టరు కాబోతున్నావన్నమాట. నా మనసులోని కోరికా అదే బాబూ! ఆ సర్వేశ్వరుడు దయామయుడు. మేమందరం నిన్ను చిన్నచూపు చూసినా, ఆ దేవుడుమాత్రం చల్లగా చూశాడు. మంచిని వాడెప్పుడూ కాపాడుతూనే వుంటాడు. మనసుకింపైన చల్లటిమాట చెప్పి నాకు పునర్జన్మ ప్రసాదించావు. నాచేజేతులా నీ భవిష్యత్తును నాశనం చేశాననే అపరాధభావనతో

ఇన్నాళ్ళూ బాధపడేవాడ్ని. ఇక నాకా బాధ వుండదు. నా మనసు తేలికపడింది" ఆనందంతో ఉక్కిరి బిక్కిరవుతూ రజనీకాంత్‌ను దగ్గరగా హత్తుకుని, ఎత్తుకున్నంత పనిచేశాడు ఆనందరావు.

ఆప్యాయంగా తనను చుట్టుకున్న తండ్రి రెండు చేతులమధ్య నిర్లిప్తంగా వుండిపోయాడు రజనీకాంత్. మనసులో ఓ మూల ఏదో తెలియని బాధ, మరో మూల తీయటి మమతానురాగం మెదలుతున్నాయి. కళ్ళు మాటిమాటికి ఆర్ద్రతతో చెమర్చుతున్నాయి.

"అల్లిపురంలో బజారుదగ్గరా?" అడిగాడు ఆనందరావు.

"బజారుకు దగ్గర్లో 'ట్యూషన్స్ చెప్పే కుర్రాడు' అని ఎవర్నడిగినా చెప్తారు" అన్నాడు రజనీ.

"ట్యూషన్స్ చెప్పే కుర్రాడనా?" బాధగా మూలిగింది ఆనందరావు హృదయం. మనసులో ఎవరో చేయిపెట్టి పెలికినట్లు అయింది. "ఫలానా ఆఫీసర్ కొడుకు" అని అనిపించుకోవలసినవాడు 'ట్యూషన్స్‌చెప్పేకుర్రాడుగా' చలామణీ అవుతున్నాడు. నీరసంవళ్ళంతా ఆవరించినట్లు అయింది. కొన్ని క్షణాలుపాటు నిస్తేజంగా నిలబడిపోయాడు. తరువాత తేరుకుని "పద అలా హోటల్‌కెళ్ళి కాఫీ తాగొద్దాం" అన్నాడు.

"కాఫీ పెద్దగా అలవాటు లేదండీ! ఇంటికెలాగూ వస్తానుగా. అప్పుడు తీసుకుంటాను. ఓ ఫ్రెండ్ వెయిట్ చేస్తున్నాడు...వెళ్ళొస్తాను" అన్నాడు.

"సరే" అంటూ అప్రయత్నంగా తలాడించాడు ఆనందరావు.

భారంగా ముందుకు నడిచాడు రజనీ మరి కాస్సేపక్కడ ఆగితే, మనసులో సుళ్ళుతిరుగుతోన్న దుఃఖం అంతా వెలికి వచ్చి, ఉప్పెనలా ముంచెత్తుతుంది. అందుకే ఆగకుండా తొందర తొందరగా నడిచాడు.

రజనీ అలా మాట్లాడుతున్నప్పుడు నెమ్మదిగా నాలుగడుగులు ముందుకువేసి అక్కడ ఆగాడు సునీల్. త్రోవంట పోతున్న జనంవేపు చూసుకుంటూ ఓ పదినిముషాలపాటు గడిపాడు. రజనీ రాగానే ఇద్దరూ బయలుదేరారు.

వెళ్ళిపోతున్న రజనీవైపు చూస్తూ అలాగే వుండిపోయాడు ఆనందరావు. అతని కళ్ళనుండి ఆనందభాష్పాలు దుఃఖాశ్రువులూ కలగలుపుకొని బుగ్గల మీదుగా జారుతున్నాయి. ప్రయోజకుడివైనందుకు నిన్నుచూసి గర్వపడుతున్నాను బాబూ! ఇప్పుడు నాకెంతో ఆనందంగా వుంది. కాని మరోపక్క నీ పట్ల నా ప్రవర్తనకు సిగ్గుపడుతున్నాను. నాలాంటి అప్రయోజకుడైన తండ్రి ఎక్కడా వుండడు ... వుండకూడదు కూడ' గొణుక్కున్నాడు.

అంతవరకు ప్రక్కనే వున్న కిళ్లీబడ్డీ దగ్గర నిలబడి చుట్టకాల్చుకుంటోన్న రాజారావు ఆనందరావు దగ్గర కొచ్చాడు.

"ఏం జరిగిందయ్యా...బాబూ! అలా వుండిపోయావు? ఆ అబ్బాయెవరు?" అడిగాడు.

"మా అబ్బాయేనయ్యా" అన్నాడు ఆనందరావు నీరసంగా కళ్ళుతుడుచుకుంటూ.

"నీ కొడుకా? పోవయ్యా! నీకు కొడుకున్నాడని నాతో ఎప్పుడూ మాటవరసకన్నా అనలేదు"

"నా కొడుకేనయ్యా బాబూ!"

"పోలికలు కలుస్తున్నాయనుకో! కాని





చకోరం స్వచ్ఛమైన వాన చినుకుని
మాత్రమే గ్రోలుతుంది! స్వాతి చినుకు
మాత్రమే స్వచ్ఛమైన ముత్యమౌతుంది!
పక్షులలో కోయిల మాత్రమే మనోహరంగా
పాడగలుగుతుంది! యద్దనపూడి సులో-
చనారాణి మాత్రమే ఇలాంటి నవల
వ్రాయగలుగుతుంది!
వ్యర్థ సంభాషణలకి తావివ్వని
హృద్యమైన ప్రేమకథ

# యద్దనపూడి సులోచనారాణి

తాజా నవలా సుమం

## మౌనపోరాటం

వెల. రూ. 20/-

చదవండి!

పోస్టులో కావాలంటే రూ. 10/- ఎమ్.వో
చేయండి. మిగతా రూ. 10/- లకి వి.పి.
పెట్టి పంపిస్తాము.

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**
3237, రాష్ట్రపతిరోడ్,
సికింద్రాబాద్-500003.

ఈ అబ్బాయి మీ ఇంటిలో ఎప్పుడూ కనబడినట్లులేదు. గొడవలు అవీ ఏమైనా పడ్డారా?" సందేహం వ్యక్తం చేశాడు రాజారావు.

"వాడు నా మొదటి భార్య సంతానం. వాళ్ళ పిన్నికి, వాడికి పడదు. వీణ్ణిక్కడికి చదువు కోసమని మా అమ్మతో పంపేశాను. మెడిసిన్ చదువుతున్నాడు" చివరి మాట వొత్తి పలుకుతూ గర్వంగా అన్నాడు.

"భేష్! బావుంది. మెడిసిన్ చదువంటే మాటలా? కుర్రాడు చురుగ్గావున్నాడు. తెలివైనవాడే లక్షలకొద్దీ కట్నం తీసుకొస్తాడు. రెండు చేతులా సంపాదించి నీ చేతిలో పోస్తాడు" సరదాగా నవ్వుతూ అన్నాడు రాజారావు.

"వాడు నాకు సంపాదించి పెట్టెయ్యాల్సిన అవసరం ఏంలేదు. వాడి బతుకేదో వాడు సుఖంగా బతికితే అదేచాలు. ఇంత వరకూ వచ్చాక నీకు చెప్పకపోవడం ఎందుగ్గాని...వాడి బాధ్యత నేనేం తీసుకోలేదయ్యా! కాలేజి చదువు వరకు నేనేదో చూశాననుకో...ఆ తరువాత మా అమ్మే వాడి బాధ్యత తీసుకొంది. ఆ తరువాత వాడి బతుకు వాడే. అందుకే వాడి మాటల్లో దగ్గరతనం, మమత లోపించాయి" అన్నాడు ఆనందరావు. అతని మనసు మూగగా బాధగా రోదిస్తోంది.

"అనవసరంగాబాధపడకు.ఏదియేమైనా వాడు నీకొడుకే కదా! నీ రక్తంలో రక్తం. క్షణికమైన కోపతాపాలు మధ్యలో వచ్చి మధ్యలో పోయేవే. అలాచూస్తుండు.. మరికొన్ని రోజుల్లోనే మీవాడిలో ఎంతో మార్పొచ్చితీరుతుంది" అన్నాడు ఓదార్పుగా రాజారావు.

"ఈవేళ అంతదూరం నడవలేనయ్యా! ఇవ్వాళ్టికి పార్కులో కాస్సేపు కూర్చుని పోదాం" అన్నాడు ఆనందరావు.

ఇద్దరూ పార్కులో కూర్చున్నారు. మనసులోని బాధ కొన్ని నిముషాల తర్వాత తగ్గినట్లయింది. కొంచెం శాంతిగా వుంది. కాని, మనసునిండా ఆలోచనలు ముసురుకొంటున్నాయి ... రజనీకాంత్ మనసులోని ఆవేదన అంతా అతని ముఖంలో చదివాడు తను. దర్జాగా బతుకుతూ హాయిగా చదువుకోవలసినవాడు ఎన్నో ఇబ్బందులు పడుతూ, పడరాని పాట్లు పడాల్సొస్తున్నది. వీడి తల్లి అన్నపూర్ణ బతికున్న రోజుల్లో తన జీవితం అంతా ఎంతో హాయిగా, సాఫీగా ఏచీకూ చింతా లేకుండ గడచిపోయింది. ఆమెను పొందటం తనఅదృష్టంగా భావించేవాడు. కాని...విధి అన్నపూర్ణను తనకు దూరం చేసింది. ఆ షాక్ నుండి తను చాలాకాలం వరకూ తేరుకోలేకపోయాడు. బంధువులు, స్నేహితులు అందరూ మళ్ళీ పెళ్ళి చేసుకొమ్మన్నారు. కానితను అంగీకరించలేదు.

భాగ్యవంతుల బిడ్డ అయిన అన్నపూర్ణ తనను ప్రేమించి పెళ్ళి చేసుకొంది తమ వివాహానికి అంగీకరించని తండ్రితో పాటు కుటుంబ సభ్యులందర్నీ కాదని ఎదిరించింది. రిజిష్ట్రార్ ఆఫీసులో తమ వివాహం జరిగింది. పెళ్ళయిన రెండు సంవత్సరాలకు రజనీకి జన్మనిచ్చి, పురిట్లోనే ధనుర్వాతంతో చనిపోయింది. ఆమె చనిపోవడంతో దాదాపుగా తాను పిచ్చివాడయిపోయాడు.

'తన సుఖమయమైన జీవితం వీడి పుట్టుకతోనే నాశనం అయిపోయింది' అన్న భావన తన మనసు పొరల్లో పాతుకుపోయింది. అందుకనే తన ప్రేమను రజనికి పూర్తిగా పంచి ఇవ్వలేక

పోయాడు. అది తను పైకి చెప్పకపోయినా కలలో కూడా కాదనలేని నిజం.

తర్వాత సుందరి తన జీవితంలో ప్రవేశించడం అన్నది బలవంతంగా, సుడిగాలిలా అంచేనేసరి అవుతుందేమో? ఆమె తన ఫ్రెండ్ నారాయణరావుకు పెద్దనాన్న కూతురు.

నారాయణరావింటికి వెళ్ళినప్పుడామెతో పరిచయం అయింది. అతనితో కలిసి రెండు మూడుసార్లు తమ ఇంటికొచ్చింది. ఎంతగా "వద్దని" అంటున్నా వినకుండా పనులన్నింట్లోనూ చురుకుగా, అమ్మకు సాయంచేసేది.

సుందరి కళ్ళల్లో ఏదో ఆకర్షణ. ఆమె మాటల్లోనూ, చేతల్లోనూ చాకచక్యం, నేర్పరితనం-ఇవన్నీ తననేకాక అమ్మను కూడ ఆకర్షించాయి.

"అన్నపూర్ణలాగే కలుపుగోలయిన మనిషి. ఆ తల్లి లేని లోటు తీరుస్తుందేమో?" అనేది అమ్మ.

సుందరిలోని చొరవ, తామిద్దరి పరిచయాన్ని అనుకోని మలుపులు తిప్పింది. సినిమాలు, షికార్లు, ఆ తరువాత ఓ బలహీనమైన క్షణంలో తామిద్దరూ ఏకం కావడం జరిగింది. ఆ విషయాన్ని ఆమె చాలా తేలిగ్గా తీసుకొంది. "ఎలాగూ జరగాల్సిందంతా జరిగిపోయిందికదా? తొందర్లోనే ఆ మూడుముళ్ళు వేసేస్తే బావుంటుంది" అంది. అందుకు తాను నిరాకరించిన పక్షంలో తనకు ఆత్మహత్యే శరణ్యం అంది. తప్పనిసరి పరిస్థితిలో సుందరిని తాను పెళ్ళిచేసుకోవడం జరిగింది. పెళ్ళికాకముందు సుందరిలో వున్న అణకువ, కలుపుగోలుతనం, నెమ్మదితనం... అన్నీ ఆ మూడు ముళ్ళు పడ్డ మర్నాటి నుండీ కనిపించకపోవడంతో ఆశ్చర్యపోవడం అమ్మ వంతయింది.

తనూ ఆ విషయాన్ని గ్రహించాడు.

ఆ తరువాత తన జీవితంలో ఎన్నో మార్పులు జరిగాయి. ఆమెకు తోడుగా వాళ్ళ మేనత్త ఒకర్తి వచ్చిచేరింది. వాళ్ళిద్దరి నోటికి అడ్డూఅపూలేక పోవడంతో.... వాళ్ళ ధాటికి తట్టుకోలేక, వాళ్ళని ఎదిరించి బతకడం చేతకాక తను వాళ్ళ చేతిలో కీలుబొమ్మగా మారిపోయాడు. తన తల్లీ, కొడుకు ఇద్దరూ పట్నంలో వేరేగా వుండసాగారు. భార్య మూలంగా తనను కన్నతల్లిని, తను కన్నకొడుకును ఇద్దర్నీ సుఖపెట్టాల్సింది పోయి కష్టాలపాలు చేయవలసి వచ్చింది.

కళ్ళ వెంబడి జారుతున్న వెచ్చటి కన్నీటిని రాజారావుకు అగుపించనీయకుండా తుడిచేసుకున్నాడు ఆనందరావు.

ఇద్దరూ రిటైర్ అయిన వాళ్ళే అవడం, ఇద్దరి ఇల్లూ దగ్గరే అవడం, ఈవెనింగ్ వాక్ అలవాటున్న వాళ్ళవడంతో, ఇద్దరూ స్నేహితులు అవడం జరిగింది. ప్రతి రోజూ సాయంత్రం వేళల్లో అలా నడిచెళ్ళి, హోటల్లో కాఫీ తాగి కబుర్లు చెప్పుకుంటూ వెనక్కు తిరుగుతారు.

* * *

రజనీ సీరియస్‌గా తొందరతొందరగా నడుస్తున్నాడు. పక్కనే నడుస్తున్న సునీల్ ఆ నడక వేగాన్ని అందుకోలేక పోతున్నాడు. ఆ వేగం రజనీ మనసులో చెలరేగుతున్న సంఘర్షణను తెలుపకనే తెలుపుతోంది. అంతకు ముందు ఎంతో సరదాగా కబుర్లు చెప్తూ వచ్చిన రజనీ ఒక్కసారిగా అలా అంత సీరియస్‌గా మారిపోయినందుకు "కారణం" ఏమిటో సునీల్‌కు తెలియలేదు.

"ఎవరాయన?" కొంత దూరం వెళ్ళాక అడిగాడు సుశీల్.

"కావలసినవారే!"

"ఎవరైనా బంధువా? ఆముఖం... పోలికలు... రంగు... ఎత్తు... అన్నీ నీలాగే వున్నాయి"

"బంధువా? నీకు తెలీని బంధువు లెవరున్నారు నాకు" అన్నాడు రజనీ సన్నగా నవ్వుతూ.

"ఇద్దరికీ బాగా దగ్గరిపోలికలున్నాయి. తండ్రీ కొడుకులు అన్నా నమ్మవచ్చు" అన్నాడు సుశీల్.

రజనీ జవాబేం ఇవ్వలేదు. ఇద్దరూ సుశీల్ ఇంటికి చేరుకున్నారు.

సుశీల్ తమ్ముడు, చెల్లెలు ఇద్దరికీ రజని ట్యూషన్ చెప్తున్నాడు. రజనీకి మిగిలిన ట్యూషన్లతోనే టైమ్ చాలడం లేదు. అయినా ఫ్రెండ్ రిక్వెస్టును కాదన లేకపోయాడు. దానికి తోడు డబ్బు అవసరం. ఎలాగో ఎన్ని కష్టాలు పడి అయినా ఈ చదువు పూర్తిచెయ్యాలి- అది తన ధ్యేయం.

సుశీల్ తల్లి అమృతవల్లి ఇద్దరికీ కాఫీ, టిఫిన్ తీసుకొచ్చింది. ఎన్నిసార్లు వద్దని చెప్పినా ఆమె వినదు. వాటిని ముగించి చదువు చెప్పడం ప్రారంభించాడు. మనసు లగ్నంచేసి చెప్పడం సాధ్యంకావడం లేదు. కొంతసేపు అలా నిర్లిప్తంగా వుండిపోయాడు. మనసుపై దాడి చేస్తున్న ఆలోచనలు, జ్ఞాపకాలు ఎంత ప్రయత్నించినా దూరం కావడం లేదు. చాలాకాలం తర్వాత కనిపించిన తండ్రి ముఖం ఇంకా కళ్ళముందు మెదుల్తూనే వుంది. "ఇవ్వాటికి ఆపేద్దాం" అని పిల్లలతో చెప్పి బయలుదేరాడు.

"ఈ పూట ఇక్కడ భోజనం చేసెయ్యరా!" అన్నాడు సుశీల్. అమృతవల్లి కూడా అలాగే అంది.

"మీకు అనవసరంగా శ్రమ" అన్నాడు రజనీ మొహమాటంగా.

"ఇందులో శ్రమేం వుంది బాబూ! ఇద్దరూ కాస్సేపు డాబామీద కబుర్లు చెప్పుకుంటూ కూర్చోండి. వడ్డించేసి పిలుస్తాను" అంది.

డాబామీద చల్లటి గాలి మనసుకు హాయిని కలిగిస్తోంది. రజనీకాంత్ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగాడు సుశీల్

"అబద్ధాలు చెప్పడం ఎప్పట్నుంచీ నేర్చావు? నా దగ్గర కూడానా? కన్న తండ్రినే... పరాయి వాడని చెప్పడానికి సిద్ధం అయావంటే... ఆయన పట్ల నీ మనసులో వున్న ద్వేషం వ్యక్తం అవుతోంది. ఆయన మీ నాన్నగారే! నా కళ్ళు నన్నెప్పుడూ... మోసం చెయ్యవు"

మనసులో చెలరేగుతున్న బాధను అణచుకోవటానికి విఫల ప్రయత్నం చేస్తున్నాడు రజనీ.

"ఆయన మా నాన్నగారే! కాని మా ఇద్దరిమధ్య ఆ అనుబంధంతెగిపోయి చాలా కాలం అయింది. కన్నకొడుకు అనేవాడు ఒకడున్నాడు అని మరచిపోయినమనిషిని తండ్రి అని ఎలా చెప్పుకోమంటావు? కాని చాలాకాలం తరవాత చూడ్డంతో కరిగిపోయాను"

"ఎంతైనా రక్తసంబంధం కదా. ఎంతకాదు కూడదు అనుకున్నా ఆ సంబంధం అలాకట్టి పడేస్తుంది" అన్నాడు సుశీల్.

కొన్ని నిమిషాలు భారంగా గడిచాయి భోజనం రడీ అయిందని కబురు రావటంతో ఇద్దరూ క్రిందకు దిగారు.

మధ్యమధ్య అడిగి వడ్డిస్తూ ఇద్దరూ




భోజనాలు చేస్తూంటే తృప్తిగా చూస్తూ కూర్చుంది అమృతవల్లి.

చక్కటి కుర్రవాడు. తెలివైనవాడు బుద్ధిమంతుడు అనుకుంది. అతని పట్ల ఎందుకో ఆప్యాయత పెరుగుతోంది అమృతవల్లికి.

'అమ్మ బతికి వుంటే! ఇలాగే ప్రేమగా చూసేది. ఇంత ఆప్యాయంగానే దగ్గర కూర్చొని, కొసరి కొసరి వడ్డించి తినిపించేది. నిండైన విగ్రహం. ఆప్యాయత, అభిమానం నిండిన చూపు. ఎంత ఐశ్వర్యమున్నా అహంలేని ఆప్యాయత నిండిన తీయటి స్వరం. ఈ మెను చూస్తుంటే పూజ్యభావం ఏర్పడుతూ వుంటుంది' అనుకున్నాడు రజనీ. అతని కాక్షణంలో అమ్మే వడ్డిస్తూవుంటే తను తింటున్నట్టు అనిపించింది. అప్రయత్నంగా కళ్ళు చెమర్చాయి.

'అమ్మ లేకపోవడం అంత దురదృష్టం. ఈ ప్రపంచంలో మరేదీవుండదు.



ఆ లాలన, ముద్దు మురిపెం, ఆప్యాయత, ప్రేమ, త్యాగం, మరే వ్యక్తుల్లోనూ కనిపించదు. పిల్లల కోసం బాధలు, బరువులు, అవమానాలు అన్నీ సహిస్తుంది తల్లి. పిల్లల వికారం, వైకల్యం, దుర్గుణాలు, రోగాలు, ఇవేమీ ఆమె ప్రేమకు అడ్డం కాలేవు. ఫొటోలోని అమ్మరూపం లీలగా కళ్ళ ముందు మెదలింది రజనీకి.

"ఏం బాబూ! ఏం కళ్ళెందుకలా ఉన్నాయి?" అడిగింది అమృతవల్లి.

"ఇది కన్నీరు కాదమ్మా! ఆనంద బాష్పాలు. అమ్మ ప్రేమకు నోచుకోని నాకుఆ ప్రేమను రుచి చూపిస్తున్నారు. ఇప్పుడు మా అమ్మే నాకు వడ్డించినట్లు అనిపించింది'' అన్నాడు.

అమృతవల్లికి మనసు ద్రవించింది. "మరింకేం? నన్నే మీ అమ్మ అనుకో! అమ్మా అని పిలు" అంది ఆప్యాయంగా.

"ఇన్నాళ్ళూ మనసులోనే అనుకుంటుండేవాణ్ని ఇప్పుడు 'అమ్మా'అని పైకి పిలుస్తాను. మీరు పర్మిషనిచ్చారుగా"

"ఆప్యాయతకు మరో పేరు అమ్మ. ఇకమీదట అమ్మలేదనే దిగులు నన్ను బాధించదు! అన్నాడు ఆనందంతో రజని

భోజనం అయ్యాక ఇద్దరికీ చెప్పి బయలుదేరాడు.

రూంలో- పుస్తకం తీసుకుని చదువుదామని ప్రయత్నించాడు రజని. కళ్ళ ముందు అక్షరాలు కనిపిస్తూనేవున్నాయి. కాని అవేవీ బుర్రలోకి ఎక్కడం లేదు. ఆలోచనలు,జ్ఞాపకాలు జోరీగల్లా ముసురుకొంటున్నాయి. బాల్యంలో జరిగిన సంఘటనలన్నీ గుర్తుకొస్తున్నాయి.





తన తల్లిస్థానంలో ఇంట్లో అడుగుపెట్టింది పిన్ని. పిన్ని అందంగానే వుంటుంది కాని, తన తల్లి ముఖంలోవున్న కళ ఆమెలో లేదు. ఫొటోలో వున్న అమ్మ ముఖంలో దివ్యమైన తేజస్సు.పిన్ని ఎప్పుడూ చిరాకు, విసుగు, కోపంతో చిర్రుబుర్రులాడుతూ వుంటుంది.

పిన్ని ఇంట్లోని ఏపనీ ముట్టుకునేది కాదు. ఎప్పుడూ రేడియో దగ్గర కూర్చుని పాటలు ఆలకించడమో లేక పత్రికలు, నవలలు చదువుకుంటూ కాలక్షేపం చేయడమో చేసేది. ఆ తరువాత నిద్ర. నాన్నమ్మ వంటింట్లోకిందా మీదాపడుతూ వంట చేస్తూందే సహాయం చేస్తానని మాట వరుసకన్నా అనేదికాదు. కాగా వేళకు కాఫీలు అవీ చేసి మంచం దగ్గరకు అందించాలి.

పిన్ని తనను ఎప్పుడూ ఆప్యాయంగా పిలిచిన పాపాన పోలేదు. ఏ పనివాణ్నో పిలిచినట్లు 'ఒరే! గిరే' అంటూ పిలిచేది.

ఓసారి నాన్నమ్మ అది ఆలకించి దెబ్బలాడటంతో అలా పిలవడం తగ్గించింది.

పిన్ని తాలూకు బంధువులు ఎవరో ఒకరు అలా వస్తూనే వుండేవారు. "అత్తయ్యా టిఫిన్, కాఫీ చేసి పంపండి" అని పురమాయించేసి, వెళ్ళి వాళ్ళ మధ్య కూర్చునేది. వాళ్ళందరికీ టిఫిన్లు, కాఫీ అందించేసరికి నాన్నమ్మకు తలప్రాణం

తోకకు వచ్చినంత పనయ్యేది. ఒకరికి కాఫీ, మరొకరికి టీ, ఇంకొకరికి పాలు. అదే నాన్న తరపు బంధువులెవరైనా వస్తే పిన్ని వాళ్ళతో మాట్లాడేది కాదు. గది లోకి వెళ్ళిపోయి కూర్చునేది.

"నిన్ను చూట్టానికొచ్చారు. ఓసారి వచ్చి పలకరించి వెళ్ళు''అని నాన్నమ్మ అంటే "పోనిద్దురూ! అడ్డమైన వాళ్ళం దర్నీ పలకరించడమేనా ఏంటి నాపని" అనేది గీరగా.

పిన్నివాళ్ళత్త దుర్గమ్మ మేనకోడలి కొత్త కాపురం చూడ్డానికి వచ్చి తిష్ట వేసింది. వస్తూనే "అదేమే...అలా చిక్కి పోయావు? ఇంతమందికి వండిపడ్డించే సరికి ఎలాంటివాళ్ళయినా నీలాగే తయా రవుతార్లే. మీ ఆయన కొస్తున్న జీతంలో ఏమన్నా మిగలేసుకుంటున్నారా? అయినా ఏం మిగుల్తుందిలే... కరువు రోజుల్లో. ఈ మందకంతా పెట్టిపోషించే సరికే అంతా అయిపోతుంది. ఇంకేం మిగుల్తుంది. ఇదిగో ఆ ముసల్దాని చేతికి దుక్కల్లాంటి గాజులున్నాయి. నెమ్మదిగా అడిగితీసుకో. ఏదైనా వస్తువు చేయించుకొని మెళ్ళో వడేసుకోవచ్చు" అని సలహాలు, ఉపదే శాలు గుప్పించేసింది.

దుర్గమ్మ పిప్పళ్ల బస్తాలా లావైన శరీరంతో కదలటానికే ఎంతో అవస్థ పడేది. పొట్టిగా, నల్లగా, తుమ్మమొద్దులా వుంటుంది. ప్రతీ మాటకు చేతులు తిప్పు కుంటూ, పెడనోరుచేసుకుని లేస్తుంటుంది. నాన్న ఇంట్లో వున్నంత వరకు హడా వుడిగా అటూ ఇటూ తిరిగి, ఆయన వెళ్ళి పోగానే పేపరు చదువుతూ, వరండాలోని మడత మంచంపై కాళ్ళు బార్లా చాపుకుని నిద్రపోయేది.

ఇంట్లో చాకిరితో పాటు నాన్నకు కారియర్ కట్టడంకూడా నాన్నమ్మ పనే. ఒంట్లో ఎలావున్నా సరే చాకిరీ అంతా తప్పేదికాదు. ఓసారి నాన్నమ్మకు జ్వరం వచ్చి నాలుగురోజులయినా తగ్గిందికాదు. ఆ నాలుగురోజులూ ఇంటి పని చేసుకోవ టానికి పిన్ని, దుర్గమ్మ ఎన్నిసార్లో విసు క్కుని తిట్టుకుంటూ, మూలుగుతూ కూర్చున్నారు.

నాన్నకు కారియర్ పంపడం మానే శారు.

నాన్నమ్మకు ఎంతకూ తగ్గకపోతే హాస్పిటల్లో చేర్చవలసి వచ్చింది. ఊళ్లో ఏదో పనుందంటూ దుర్గమ్మ వెళ్ళి పోయింది.

ఒంట్లో బాగోలేదని పిన్ని కూడా మంచం ఎక్కేసింది. అన్నింటికీనాన్న తనే అయి పోయారువంటచేసి, కేరేజీలుఅవీకట్టి హాస్పిటల్ కు తీసుకెళ్ళేవారు. హాస్పిటల్ నుండి డిస్చార్జి అయి ఇంటికొచ్చింది నాన్నమ్మ. ఓ రెణ్నెళ్ళు విశ్రాంతి వుండా లన్నారు డాక్టర్లు. రెండ్రోజులన్నా కాలేదు.... పిన్ని మంచం దిగకుండా దొంగ ఏడుపులు ఏడవడంతో నాన్నమ్మకు ఇంటిచాకిరీ తప్పలేదు. ఇంత చేసినా పిన్నితో మాటలు పడటం తప్పేదికాదు. దుర్గమ్మ ఊరునుండి తిరిగి వచ్చేసింది.

ఓరోజు తను స్కూలు నుంచి ఇంటి కొచ్చేసరికి నాన్నమ్మ పెట్టెసర్దుకుంటోంది. "ఎక్కడికి నాన్నమ్మా?" అడిగాడు తను.

"మీ పిన్నికి నేను చేదైపోయాక... ఎక్కడికైనా పోవడం తప్ప మరో గత్యం తరం లేదురా! మీ నాన్నకూడా దద్దమ్మ అయిపోయాడు. వంట్లో బాగులేక పోయినాసరే ఏదో ఆ వంటా అదీ చేసి పడేస్తున్నానా? అయినా ఆవిడకి సంతృప్తి



లేదు 'అదిచెయ్యలేదు...ఇది చెయ్యలేదు' అని పనిమనిషితో చెప్పి చేయించు కుంటున్నట్లు చేయించుకుంటూ కూడ 'నుండ ఇంటిమీద పడి తింటున్నా'రంటూ నోటికొచ్చినట్లల్లా తిడ్తోంది. నా పెన్షన్ డబ్బుల్లో నేను తింటున్నాను. అంతేగాని ఆవిడ వాళ్ళమ్మగారింటి దగ్గర్నుంచి తెచ్చుకున్నదేమైనా తింటున్నానా? లేక ఆవిడ మొగుడు సంపాదన ఏమన్నా తినే స్తున్నానా...అంత బాధ పడిపోతోంది! పట్నంలో మా చెల్లెలి కొడుకు కృష్ణ దగ్గరకెళ్ళిపోతున్నాను" అని బయల్దేరి వెళ్ళిపోయింది. ఆ రాత్రి తను చీకటి గదిలో వంటరిగాఏడుస్తూ పడుకున్నాడు. ఆ మరుసట్రోజు నాన్న వచ్చిలేపితే తెలి వొచ్చింది. గదిలో నాన్నమ్మ కనిపించక పోగానే గుండె గుభేలుమంది. మనసంతా వెల్తిగా, గుబులుగా వుంది.

"లేరా! బాబూ...లే! స్కూలుకు తయారవ్వు! టైమయింది" అన్నారు నాన్న.

"నేనువెళ్ళను...స్కూలు మానేస్తాను. ఈ ఇంట్లో కూడా వుండను. నానమ్మ దగ్గరకు వెళ్ళిపోతాను" అన్నాడు తను.

"తప్పు నాన్నా! అలా అనకూడదు. నాన్నమ్మ నిన్ను బాగా చదువుకొమ్మంది కదా! డాక్టరు చదువు చదవాలంది. మరి ఆమె కోరిక తీర్చవా?" అన్నారు నాన్న.

"నాన్నమ్మను ఇక్కడ వుండమని మీరు అడగలేదేం? వెళ్ళిపోతూంటే చూస్తూ వూరుకున్నారు?" బాధగా అడి గాడు తను.

"ఇక్కడ వుండి నాన్నమ్మ ఏం సుఖపడ్తోందిరా? ఇంటి చాకిరీ అంతా నాన్నమ్మే చేస్తుందికదా! వాళ్ళతో ఎన్నిసార్లు చెప్పినా వినడంలేదు. 'నాన్నమ్మ వుందికదా... అవిడే చూసు కుంటుంది' అని వూరుకుంటున్నారు తప్ప ఏ పనీ చెయ్యడంలేదు. కొద్దిరోజులు నాన్నమ్మ ఇక్కడ లేకపోతే అప్పుడు వాళ్ళకు తెలిసొస్తుంది. నాన్నమ్మ వెళ్ళి పోయింది. మరి నువ్వుకూడా వెళ్ళిపోతే నేనొక్కణ్నే అయిపోతాన్రా" అని ఎంతో దీనంగా అంటున్న నాన్నను చూడగానే దుఃఖం పొంగుకొచ్చింది.

"వెళ్ళను నాన్నా! మిమ్మల్నొదిలి నేను వెళ్ళను. ఎన్ని బాధలైనా పడుతూ ఇక్కడే వుంటాను" అన్నాడు తను నాన్న కౌగిలిలో చేరి.

ఆప్యాయంగా వళ్ళంతా తడుముతూ, "శలవుల్లో నాన్నమ్మ దగ్గరకు తీసుకె ళ్తానులే! పద... స్కూలుకు టైమవు తోంది" అన్నారు నాన్న. నాన్నగారు చాలారోజుల తర్వాత తనతో అంత ఆప్యాయంగా మాట్లాడారు. నాన్న కళ్ళు రెండూ ఎర్రగా వాచిపోయి రాత్రంతా ఏడ్చినట్లుగా ఉన్నాయి.

* * *

నాన్నమ్మ వెళ్ళిపోయిన తర్వాత ఓ రెండురోజులు వంటంతా పిన్ని, దుర్గమ్మలే చేశారు. "నీరసం అంటూ ముసిల్ది మంచం ఎక్కేయగలదు. వూరుకోకు ఇక అదే అలవాటు అయిపోతుంది. మనిద్దరం ఆ వంటింట్లో పడి ఏడవాల్సొస్తుంది" అని మేనకోడలికి సలహా ఇచ్చింది దుర్గమ్మ. దాన్ని మేనకోడలు తూచ తప్పకుండా ఆచరించడంలో ఈ విపత్తు వచ్చి పడింది. ముసిల్ది ఏదో ముక్కుకుంటూ మూలుక్కుంటూ చేసుకుపోతుందని అను కున్నారేగాని ఇలా ఇల్లు విడిచిపోతుందని వూహించలేదు వాళ్ళు. ఆ రెండ్రోజులు గుండా పిండి అయిపోయారు ఇద్దరూ.




శ్రీమతి చెరుకూరి లక్ష్మీ భారతి సమర్పించు

విజయభాస్కర్ ఫిలిం ప్రొడక్షన్స్

# దేశోద్ధారకుడు

నిర్మాత:
ధనేకుల మురళీమోహనరావు

దర్శకత్వం:
యస్. యస్. రవిచంద్ర

శివశంకర్

పైటిం: శ్రీసాయికృష్ణ; ప్రెడిడ్: వీరబ్రహ్మేంద్ర కంబైన్స్;



మూడోరోజు దుర్గమ్మ నాన్నగార్ని నిల దీసి అడిగింది- "ఏంటి బాబూ? నీ ఉద్దేశం ఏంటి? పసిపిల్ల ఇంటిపనితో సత మతం అయిపోతూవుంటే చూస్తూ వూరు కుంటావేం! పుట్టింట్లో ఎంతో గారాబంగా పెరిగింది. దానికి వంటా పెంటా అవీ ఏం తెలుస్తాయి. ఇక్కడుంటే పనంతా చేయా ల్సొస్తుందని మీ అమ్మ కావాలని గొడవ పెట్టుకు వెళ్ళిపోయింది. కోడలు ఏదో చనువుగాఅందని సరిపెట్టుకోవాలేగాని కోపంతెచ్చుకుని వెళ్ళిపోతే ఎలా? ఓవంట మనిషిని, ఓ పనిమనిషిని కుదుర్చుకు రండి"

ఓ వారం రోజులతర్వాత నాన్న ఓ వంటమనిషిని కుదుర్చుకుని వచ్చారు.

వంటమనిషి పెదమ్మకు భోజనం, కాఫీ, టిఫిన్ పెట్టి నెలకు ఎనభై రూపా యలు జీతం. సంవత్సరానికోసారి పండక్కి చీర జాకెట్టుకు వప్పందం అయింది. 'ఇంటిపనికూడా చేసేస్తాను నూటఇరవై ఇచ్చేయండి' అంది. మొత్తా నికి నూరు రూపాయల జీతం వప్పందం అయింది.

వంటమనిషిని పెట్టినా కారియర్ ఆలస్యం అయిపోయేది. నాన్న అంత ఎండలోనూ సైకిల్ తొక్కుకుని భోజ నానికి వచ్చేవాడు.

పైడమ్మ పనికి ఆలస్యంగావచ్చేది. పొద్దున్నే గిన్నెలవీ తోముకుని టీ చేసు కోవటానికి వాళ్ళకు బద్ధకం. పైడమ్మ వచ్చి టీపెట్టి ఇచ్చేవరకూ కాసుకూర్చు చ్చునేవారు. నాన్నమ్మలా కాఫీ టిఫిన్లు వాళ్ల కూర్చున్నచోటుకు పంపడంలేదు పైడమ్మ. వాళ్ళే వంటింట్లోకివచ్చి తిని వెళ్ళటమో లేక పట్టుకెళ్ళి తినడమో

జరుగుతోంది. వంట పూర్తయినవెంటనే పైడమ్మ ముందుగా తనకే భోజనం పడ్డించి కూరలవీచూసి జాగ్రత్తగా పక్కం చేది. నాన్నమ్మ వుండేటప్పుడయితే వాళ్ళి ద్దరూ తినగా మిగిలినవిఉంటే నాన్నమ్మ, తను తినేవాడు. "పసిపిల్లాడు ఆకలికి ఆగలేడు" అని పైడమ్మ ముందుగా తనకు పెట్టడంలో మాతృత్వ భావన కనిపించేది. తనకు పైడమ్మ పనిమనిషిలా కాకుండా ఎవరో ఆప్తురాలిగా అనిపించేది.

ప్రతిరోజూ తను రాత్రి పదయ్యే వరకూ చదివి, తెల్లవారుఝామున అయిదు గంటలకు లేచి చదివేవాడు. ఒక్కోసారి చదువుకుంటున్న సమ యాల్లోపిన్ని వచ్చి లైటార్పేసేది. "బోలె డంత కరెంటు అవుతుంది. దండుగ ఖర్చు...లైటార్పు" అని కోప్పడేది.

నాన్న చూస్తూ వూర్కునేవాడు తప్ప ఆమెను వారించేవాడుకాదు. ఆమె మాటకు ఎదురుచెబితే ఏం జరుగుతుందో ఆయనకు చాలాసార్లు అనుభవమే. ఓ రెండు మూడు రోజులవరకు ఇంట్లో రుస రుసలు ... బుసబుసలు. వంటింట్లోని పళ్ళాలు, సాసర్లు, ఫ్రైయింగ్ సాసర్లుగా మారి లొత్తలుపడటం, కూరల్లోనూ, చారులోనూ ఉప్పుకారాలు హెచ్చుకావడం లేదా అసలు పడకపోవడమో జరగడం లాంటివి వచ్చుకు కొన్నిమాత్రమే.

నెలలు, సంవత్సరాలు అతి తొందరగా దొర్లిపోతున్నాయి. ప్రతి శలవులకు తనను నాన్నమ్మ దగ్గరకు తీసుకెళ్ళేవాడునాన్న. పిన్నికి ఇద్దరు ఆడపిల్లలు కలిగారు. నాన్నమ్మ తన చల్లటి చేతితో ఆ రెండు పురుళ్ళు పోసింది. దుర్గమ్మ ఇలాంటి పురుళ్ళు, పుణ్యాలూ నాకు తెలీవంటూ తప్పుకు తిరిగింది.

దుర్గమ్మ నోటికి జడిసో, లేక ఆమెను

మేపడానికి వున్న ఆస్తంతా ఊడ్చుకుపోగా, ఊరినిండా అప్పులు పెరిగిపోవడం వల్లనో లేక ఆమె చేతిలో కీలుబొమ్మగా ఆమె ఆధీనంలో బతకడం దుర్భరం కావడంవల్లనో లేక ఈ అన్ని కారణాల వల్లనో ఆమె భర్త బైరాగిరావు ఏనాడో సన్యాసుల్లో కలిసిపోయాడు. దాంతో మేనకోడలి ఇల్లే దుర్గమ్మకు పర్మినెంటుస్థావరం అయిపోయింది ఇన్నాళ్ళూ. ఎలా వచ్చాడో గాని బైరాగిరావు పెళ్లాన్ని వెతుక్కుంటూ వచ్చి అక్కడే తిష్టవేశాడు.

చెల్లాయిలిద్దర్నీ పిన్ని ఇంగ్లీష్ మీడియమ్ కాన్వెంటులో చేర్పించింది. ముద్దుముద్దుగా వుండే చెల్లాయిలు ఇద్దరూ మల్లెపూలలాంటి తెల్లటిజట్టల్లో, పాలిష్‌తో నిగనిగలాడే బూట్లతో చలాకీగా హుషారుగా రిక్షాలోవెళ్ళి రిక్షాలో తిరిగొచ్చేవారు.

వారికోసం ఖరీదయిన బిస్కట్లు, పళ్ళూ కొనిపించేది పిన్ని. వాళ్లుతింటున్నప్పుడు పక్కనే వున్నాసరే ... తనకు ఇచ్చేదికాదు.

తనకున్న మూడుజతల బట్టల్ని తనే ఉతుక్కుని, చిరుగులు కుట్టుకుని వేసుకునేవాడు తను.

స్కూల్ ఫైనల్ పరీక్షలో తను ఫస్ట్ క్లాసులో పాసయ్యాడు. పిన్నితో, దుర్గమ్మతో ఆ సంగతి చెప్తే ముఖం మాడ్చుకున్నారు. నాన్న అభినందించారు.

కాలేజీలో ఎడ్మిషన్స్ ప్రారంభం అవుతున్నాయి. "పిణ్ని కాలేజీలో చేర్పిస్తాను" అని నాన్న పిన్నితో అన్నారు. దుర్గమ్మ ఏదో ప్రబోధం చేసింది.

"ఉన్నదంతా ఊడ్చి వాడి చదువులకి పెట్టెయ్యండి. నేనూ, పిల్లలూ చిప్పచేత పట్టుకు తిరుగుతాం" అంది పిన్ని రుసరుసలాడుతూ.

"ఆడపిల్లలున్నారు బాబూ! ఇలాంటప్పుడే నాలుగు డబ్బులు / పోగుచేసుకోవాలి. కాలేజీ చదువులంటే మాటలా... మనలాంటి వాళ్ళం అంతంత ఖర్చులు భరించగలమా?" అన్నాడు దుర్గమ్మ భర్త బైరాగిరావు.

నాన్నగారేం మాట్లాడలేదు. వాళ్ళను కాదని ఆ పనికి పూనుకుంటే, ఆ తరువాత ఎదురయ్యే పరిణామాలను తట్టుకోగలిగే శక్తివంతుడు కాదు ఆయన. అందుకే ముఖం తప్పించుకొని తిరగసాగారు.

హెడ్‌మాష్టారు సన్యాసిరావు మాష్టారి దయవలన తన సమస్య పరిష్కారం అయింది. ఆయన ఋణం తను ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేడు. అంతకుముందే ఆయన అంటే తనకెంతో భయం, భక్తీను దాంతోపాటే ఆరాధన.

సన్యాసిరావు మాష్టరుగారంటే పిల్లలందరికీ ఎంతో హడల్.

శాంతంగా వున్నప్పుడు నిండయిన పర్సనాలిటీతో ఎంతో అందంగా కనిపించే ఆయన, కోపం వచ్చినప్పుడు మాత్రం ఎంతో భీకరంగా అగుపించేవారు. ఆయనశిష్యులు చాలామంది ఎన్నోరంగాల్లో ప్రముఖ స్థానాల్ని నిర్వహిస్తున్నారు. సినిమాలు, షికార్లకోసం క్లాసులు ఎగ్గొట్టడం, ఆడపిల్లల వెంటపడి ఏడిపించడం, స్లిప్పులు రాయడం, కాపీలు కొట్టడం లాంటివి ఆ హైస్కూలు విద్యార్థులకు చాలా దూరంలో వుంటాయి. ఎంత రౌడీ, పెంకి కుర్రాడయినా సరే ఆయనముందు పిల్లి అయిపోవలసిందే.

"క్రమశిక్షణ అన్నది విద్యార్థులలో మొదట్నుంచీ ప్రారంభం కావాలి. ఇంట్లో తల్లిదండ్రులు, స్కూల్లో ఉపాధ్యాయులు

విద్యార్థి మానసిక వికాసానికి, పురోభివృద్ధికి ముఖ్యకారకులు. పునాదిస్థాయి నుండీ ఆ క్రమశిక్షణ వారిలో చోటుచేసుకోవాలి. ఆ తరువాత కొంతకాలానికి అది వారి రక్తంలో జీర్ణించుకుపోతుంది" అంటుండేవారు.

పేదవిద్యార్థులు పెద్దచదువులు చదువుకోగలగడంలో ఆయన అదృశ్యహస్తం ఎంతయినా వుంది.

"రజనీని పెద్ద చదువులు చదివించడానికి నాదగ్గర అంత డబ్బు లేదండీ" అన్నారు నాన్న.

నాన్న కళ్ళల్లోకి ఆయన చూసిన చూపు తను ఏనాటికీ మరువలేదు. "ఏంటి అన్నావు? నీ కొడుకును పెద్ద చదువులు చదివించటానికి నీదగ్గర డబ్బు లేదా?" అన్నారు. అంతే! నాన్న తికమకపడిపోయి ఏం జవాబు చెప్పాలో తోచక అలా వుండిపోయారు.

"నేనిస్తానయ్యా! నీ కొడుకు ఓ ఉత్తమ విద్యార్థి. నువ్వు ఆమాత్రంకూడా నీ కొడుకు చదువుకు ఖర్చు పెట్టలేకపోతే నేను ఖర్చుచేస్తాను'' అన్నారు.

కొన్ని నిముషాల వరకూ నాన్న దిక్కుతోచని వాడిలా బిక్కపోయి చూస్తూ వుండిపోయారు. "మాష్టారూ! నన్ను క్షమించండి. మూర్ఖంగాఆలోచించిన నా కళ్ళు తెరిపించారు. నేను వాణ్ని చదివిస్తాను. ఎంత ఖర్చు అయినా సరే భరిస్తాను" అంటూ కరిగిపోయారు.

తను మాష్టారి పాదాలకు నమస్కరించాడు. ఆప్యాయంగా భుజాలు పట్టి లేవదీశారు. "అనవసరమైన విషయాలను పట్టించుకోకు. శ్రద్ధగా చదువు. జయం అవుతుంది" అని దీవించారు.

నాన్న, తను హెడ్‌మాష్టారి దగ్గర శలవు తీసుకొని బయలుదేరారు.

నాన్న కళ్ళల్లోని దృఢనిశ్చయానికి పిన్ని, దుర్గమ్మ ఎదురు చెప్పలేకపోయారు.

* * *

తామిద్దర్నీ చూసి నాన్నమ్మ ఎంతో సంతోషించింది. "పరీక్షలు అవీ ఫస్టున పాసయినట్లు రాశావు. కాలేజీలో చేరి, ఇక్కడ వుండ కూడదురా? నా వంట్లో శక్తున్నంత వరకూ వండి పెడ్తుంటాను" అంది నాన్నమ్మ.

తను అడగాలని అనుకున్న మాట నాన్నమ్మ నోటనే విన్న నాన్న ఒక్కసారిగా విచలితులైపోయారు. ఆయన కళ్లు చెమర్చాయి.

"నేను వచ్చింది అదే వుద్దేశంతోనే అమ్మా! అక్కడ వీడి చదువు సరిగ్గా సాగడంలేదు. ఈ వయసులోనే వీడి నెత్తిన బోలెడన్ని బాధ్యతలు, బరువులు. బజారు, ఇంటి పనులు, రేషన్ షాపుల్లో క్యూలలోనూ వీడి టైమంతా వేస్టయిపోతోంది. ఖర్చులకు ఈ డబ్బు వుంచు" అన్నారు నాన్న.

''ఆ మహరాజు ఎవరి దగ్గరా ఆఖరికి కొడుకు దగ్గర కూడా చేయి చాపకుండా ఆధారం కల్పించి వెళ్ళిపోయారు. నాకొస్తున్న పెన్షన్‌లో కొంత మిగిలిపోతూవుంది. ఈ డబ్బుతో వాడికేవైనా బట్టలు కుట్టించు. వంటరిగా నాఅన్న వాళ్ళు లేకుండా ఇక్కడ పడున్నాను. వీడిక్కడ వుంటే నాకెంతో నిబ్బరంగావున్నట్టు వుంటుంది. అప్పుడప్పుడూ వస్తుండు. కోడలు, పిల్లల్ని తీసుకొస్తుంటే నేను వేగా... దిక్కూ మొక్కూ లేకుండా పడివున్నానన్న బాధ లేకుండా వుంటుంది'' అంది.

ఎడ్మిషన్ ఏర్పాట్లు అవీ చూసి వెళ్ళి




పోయారు నాన్న.

* * *

కాలేజీ వాతావరణం అంతా ఎంతో కొత్తగా వుంది. కొత్త కొత్త ముఖాలు పరిచయం అవుతున్నాయి. నాన్న అప్పుడప్పుడు వచ్చి చూసి వెళ్తున్నారు. వచ్చినప్పుడల్లా, ''కోడలు, పిల్లల్ని తీసుకు రావటం లేదేంరా?'' అని అడుగుతున్న తల్లికి ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలిసిరాక, ''ఈసారి వీలు చూసుకుని తీసుకు వస్తాన్లే అమ్మా!'' అని సర్ది చెప్పేసేవాడు.

కానీ ఓసారి ''ఎన్నిసార్లడిగినా ఏదో ఒకటి చెప్పేస్తున్నావు. ఏంటి ఆవిడ రానందా?'' అని అడిగింది నాన్నమ్మ.

''పోన్లే అమ్మా! అది వచ్చేదేంటి? నేను వస్తున్నాను కదా!'' అన్నాడు నాన్న.

నాన్నమ్మ ఎంతో బాధపడింది. ''నేనేం చేశానురా నామీద అంత కోపం



ఆమెకు. నా ముఖం చూడ్డం ఇష్టం లేదన్నమాట. పోనీ పిల్లలు... పసి వాళ్ళు..వాళ్ళేం చేశారని! వాళ్ళనికూడా పంపడం లేదు" అంది.

ఆ విషయమై నాన్నమ్మ ఆరోజు రాత్రి భోజనం చేయలేకపోయింది. రాత్రంతా ఏడుస్తూ కూర్చుంది. నాన్న ఎంతో నచ్చ చెబితే "అంతా నా ఖర్మ ఆ తల్లి... అన్నపూర్ణమ్మ పోవడం వల్ల నాకిన్ని పాట్లొచ్చాయి'' అని సరిపెట్టుకుంది.

రోజులు గడుస్తున్నాయి. నాన్న దగ్గర్నుంచి ఉత్తరాలు రావడం తగ్గి పోయింది. నాన్నగారు కూడా రావడం తగ్గించేశారు. నాన్నకు రాసిన ఉత్తరా లకు కూడా జవాబులు రావడం లేదు.

"అక్కడ వాళ్ళిద్దరూ ఏవో గొడ వలుగాని పడుతున్నారేమో? లేక వాడికి వంట్లోగాని బాగోలేదా? ఏదో జరిగుం టుంది... మనం ఓసారి వెళ్దాం" అంది నాన్నమ్మ.

"నేను ముందు వెళ్ళి చూసొస్తాను. నువ్వు రాలేవు... నీ ఆరోగ్యం బాగోలేదు కదా" అన్నా సరే. వినకుండా బయలు దేరింది.

"కళ్లారా ఓసారి వాడ్ని చూస్తే చాలురా! ముసిల్దాన్ని నా ఆరోగ్యానికేం వుంది? దానికదే కుదుటపడ్తుంది'' అంది.

రిక్షా దిగి గుమ్మంలో అడుగు పెట్ట గానే గుడ్లురుముకుంటూ ఎదురుగా ప్రత్యక్షం అయింది దుర్గమ్మ. ఆ వెనకగా బైరాగిరావు.

''ఏంతల్లీ వచ్చావా? నీ కొడుకు సంపాదనంతా మిగిలిపోతోందనివచ్చావా? అందుకుంటున్న మనిఆర్డర్లు ఆగి పోగానే పరుగెత్తుకుంటూ వచ్చావు" అంది.

నాన్నమ్మకు ఇదేం అర్థంకాలేదు.

"ఊరిముండనంతా మేపుతానంటాడు ఇతగాడు. ఇంట్లో పెళ్ళాన్ని పస్తులు పెట్టి, మనీఆర్డర్లు పంపిస్తున్నాడు..." శివమెత్తి నట్టు అంటోంది దుర్గమ్మ.

నాన్నమ్మకు కొంచెం కొంచెంగా అర్థం అవుతోంది.

"ఊరి ముండ ఎవరొచ్చి పడి తింటున్నారో కనిపిస్తూనే వుంది. నా కొడుకు ఇంటికి నేనొస్తే మధ్య నీకెందుకే?... అసలు నువ్వెవర్తివే నన్ను అడగటానికి? ఎన్ని ఉత్తరాలు రాసినా ఒక్కదానికీ జవాబు రాకపోతే వచ్చాం తప్ప పడి తింటానికి రాలేదు. వాడి కెలా వుందీ ఉత్తరం ముక్కన్నా రాలేదు...'' అంది నాన్నమ్మ ఉద్రేకంగా కోపాన్ని ఆపుకుంటూ.

"ఆయనకేం బాగానే వున్నాడు గుండ్రాయిలా! సుబ్బరంగా వున్న మనిషిని పట్టుకొని ఎలావున్నాడో ఏమైపోయాడో అనటానికి నీకు నోరెలా వచ్చింది''

"అదే నాకు కావలసింది. వాడు బాగానే వున్నాడన్న సంగతి చెప్పి పుణ్యం మూటగట్టుకున్నావు. చాలా సంతోషం. 'వాడికెలా వుందో' అని హడలి చచ్చాను. ఆఫీసునుండి ఇంకా ఇంటికి రాలేదా?'' అడిగింది నాన్నమ్మ.

"వూళ్ళో లేడు. వూరికెళ్ళేడు. ఎప్పుడు వస్తాడో ఏమిటో" అంది దుర్గమ్మ.

"ఎప్పుడొస్తాడో తెలీదా? ఏవూరు వెళ్ళాడో'' గొణుక్కుంటున్నట్లుగా అంది నానమ్మ. "ఓసారన్నా కనిపిస్తే బావుణ్ణు. అంతదూరంనుండి ఎంతోఆశపడివచ్చాను. కోడల్ని, పిల్లల్ని చూసిపోతాను. ఈ పళ్లు, సున్నుండలు పట్టుకొచ్చాను వాళ్ళ

తింటారని" అంది నాన్నమ్మ లోపలికి నడుస్తూ.

"ఇంట్లో ఎవరూ లేరు. ఆవిడ పేరంటానికి వెళ్ళింది. పిల్లలు స్కూలు నుండి ఇంకా రాలేదు. అవి ఇలా ఇయ్యి. మీ నాన్నమ్మ ప్రేమతో తెచ్చిందిరా పిల్లలూ అని చెప్పి ఇచ్చేస్తాను'' అంది గుమ్మానికడ్డంగా నిలబడ్తూ దుర్గమ్మ.

"లోపల ఎవరూలేరా! అయ్యో... అంత శ్రమపడి వస్తే ఇంట్లో ఎవరూ లేకుండా అయిందే" నీరసపడిపోతూ అంది నాన్నమ్మ.

"వాళ్ళు రావటానికి ఆలస్యం అవుతుంది. స్కూలునుండి అటాప్రయివేటుకు వెళ్ళి ఏ రాత్రికో తిరిగొస్తారు.ఆవిడ కూడా రాత్రి అయాకే వస్తుంది" అంది దుర్గమ్మ, ఇక దయచెయ్యండి అన్నట్టు సూచిస్తూ, వెటకారంగా.

"ఏం చేద్దాం?" అన్నట్టుగా చూసింది నాన్నమ్మ తన వైపు.

ఇదంతా వాళ్ళు ఆడ్తున్న నాటకం అని తనకు తెలిసిపోయింది. ఇకకాస్సేపు ఆగినా ఫలితం వుండదు. రాత్రయ్యాక ఇక వెళ్ళటానికి బస్సులు వుండవు. రాత్రి పూట ఏసమయానికైనా నాన్నమ్మకేదైనా సీరియస్ అయితేచికాకు. అసలే పేషంట్‌ను తీసుకొని అంతదూరం ప్రయాణం చేసి రావడం పొరపాటు-అందుకే నాన్నమ్మను బయలుదేరదీసాడు తను.

మొదట వాళ్ళను చూస్తేనేగాని తిరిగి రానని మొండిపట్టుపట్టింది. ఆ తరువాత తప్పనిసరయి బయలుదేరింది. ఇంటికి వచ్చిందేగాని ఎప్పుడూ నాన్న గురించే కలవరిస్తూవుండేది. "లేదు. వాడే పూరా వెళ్ళలేదు! ఊళ్ళోనే వుండుంటాడుకోడలు, పిల్లలుకూడా లోపలేవుండి వుంటారు. అది అబద్ధంచెప్పింది" అని బాధపడ్తుండేది ఒక్కోసారి రాత్రిపూట నిద్రపోకుండా ఏడుస్తూ కూర్చునేది. ఆరోజునుండి ఆమె ఆరోగ్యం మరింతగా పాడయిపోయింది. చేతిలోనూ, బేంకులోనూ వున్నదంతా మందులు, ట్రీట్‌మెంటుకోసమని ఖర్చయిపోయింది. నాన్నమ్మ చేతిగాజులు తీసి ఇచ్చింది అమ్మేయ్యమని.

"వాటిని అమ్మి అప్పులు తీర్చెయ్యి. మిగిలింది నీ దగ్గరుంచు'' అంది.

"వద్దునాన్నమ్మా! నాన్నని డబ్బు పంపమని అడుగుతాను" అన్నాడు తను.

"వద్దురా! నేను చెప్పినట్లుచెయ్యి.నాకు ఇంక ఎక్కువ కాలం బ్రతుకుతానని నమ్మకం పోయింది వాడు కోరిచేసుకున్న పెళ్ళాంతో సుఖపడుతున్నాడని అనుకున్నాను. నరకం అనుభవిస్తున్నాడు... అంతా ఖర్మ. మిగిలిన డబ్బు నీపేర బేంకులో వేసుకో" అంది.

మరోవారంకూడాకాలేదు.నాన్నమ్మకు అకస్మాత్తుగా వెన్నులో నొప్పి వచ్చింది. సాయంత్రం నాలుగు గంటలకొచ్చిన నొప్పి క్రమంగా ఛాతీవైపు ప్రాకింది. వెంటనే డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళాడు తను. ఆయన పరీక్షచేసి వెంటనే కార్డియాలజీకి తీసుకువెళ్ళమన్నారు. నాన్నకు టెలిగ్రాం ఇచ్చాడు.

కార్డియాలజీలో నిముషాలమీదఅడ్మిట్ చేసుకున్నారు. వెంటనే ట్రీట్‌మెంటు ప్రారంభించారు. నాన్నమ్మకు మత్తుకోసం ఇంజక్షన్ ఇచ్చారు.

నాన్న రాకపోవడంతో తీసుకు రావటానికి మనిషి వెళ్ళాడు. ఈసంగతి విన్న వెంటనే షాక్ తిన్నట్టు అయిపోయారట నాన్న.

కొంతసేపటికి తేరుకుని డబ్బైనా

వుంటే ఇమ్మని పిన్నిని అడిగారుట.

''ఏం డబ్బు? ఆ డబ్బుతో బంగారం కొనేశాను. ఇంకెక్కడుంది?" అందిట.

''మీరు పదండి ఆయన బయల్దేరుతున్నారు'' అని మనిషిని పంపేశారట.

అతను వచ్చేశాడు. నాన్నమ్మ అడిగింది అంత బాధలోనూ. ''ఏడీ... ఇంకా రాలేదా?" అని.

''బయల్దేరుతున్నారు... వచ్చేస్తారు'' అన్నాడు అతను.

గంట... రెండు... మూడు ... గంటలు గడుస్తున్నాయి అయినా నాన్న జాడ కనిపించలేదు. నాన్నమ్మ అలా అడుగుతూనే వుంది. మగతలోకి జారిపోతూ మళ్ళీ తెలివొస్తే మళ్ళీ అడుగుతూ వుంది. ''నాబాబునునువ్వుచూశావా?వాడు ఆరోగ్యంగా బాగా వున్నాడా? అబ్బ నొప్పి! చచ్చిపోతాన్రా! నా కొడుకును ఓసారి కళ్ళారా చూసుకుని చచ్చిపోతాను' ఏడుస్తూ బాధతో కేకలు వేస్తూ వుంది నాన్నమ్మ.

''అలాకేకలు వేస్తే బాధ మరింత ఎక్కువౌతుంది. ఇప్పుడే ఫోనొచ్చింది. మీ అబ్బాయి బయల్దేరారట''అంది సిస్టర్ పూరికినే. "వొస్తున్నాడా?" నాన్నమ్మ ముఖం వికసించింది.

తెల్లార్లూ అలా బాధపడ్తూనే నాన్న గురించి అడుగుతూనేవుంది నాన్నమ్మ. ఎన్ని సెడెటివ్ ఇంజక్షనిచ్చినా ఆమెకు నిద్ర పట్టడంలేదు.

తెల్లవారుతుండగా వచ్చారు నాన్న నాన్నకోసం కళ్ళు కాయలుకాసేలా ఎదురుచూసిన నాన్నమ్మ, తనివితీరా ఆయన్ను చూడకుండానేకన్నుమూసింది. ఆమె కళ్ళు ద్వారంవైపు తిప్పి చూస్తుండగానే ఆమె కనుగుడ్లు తిరగబడిపోయాయి. నాన్నమ్మ శ్వాస ఆగిపోయింది.

నాన్నమ్మ శవాన్ని ఇంటికి తీసుకొచ్చేశారు.

నాన్న ఏడుస్తున్నారు. చంటిపిల్లాడిలా వెక్కివెక్కి ఏడుస్తున్నారు. కొంతసేపటివరకూ అదంతా వట్టి నాటకంలా అనిపించింది తనకు. 'బతికున్నంత కాలం నాన్నమ్మను పట్టించుకోని నాన్న, ఆమె చనిపోయాక ఇంతలా ఏడుస్తున్నాడంటే ఎవర్ని మెప్పించాలని? ఇప్పుడు ఇంత ప్రేమ వొలకబొస్తే మాత్రం ప్రయోజనం వుంటుందా?' అనిపించింది. కాని తరువాత నాన్నమీద విపరీతమైన జాలి కలిగింది.నాన్న నిజంగా చాలా అమాయకుడు. పశ్చాత్తాపం ఆయనలో అంత దుఃఖాన్ని కలిగిస్తోంది. పెళ్లాం చేతిలో కీలుబొమ్మగా మారిన ఆ మనిషి, ఇన్నాళ్ళకు నిజం తెలుసుకున్నారు. ఎంతో అమాయకంగా, సున్నితంగా కనిపించే పిన్నిలో ఇంత క్రూరత్వంవుందా? తన స్వార్థంకోసం...అత్తవారింట్లో అడుగు పెట్టిన దగ్గర్నుంచీ అత్త, మావగార్లను మానసికంగా హింసిస్తూ నిర్దాక్షిణ్యంగా వారి దగ్గర్నుంచి భర్తను వేరుగాచేసుకొని పోవడం కోసం...ఎన్నో గొడవలు సృష్టిస్తూ వుండేటంతటి సేడిజాన్ని ఆమెకు ఎందుకిచ్చావు భగవంతుడా?' అనుకున్నాడు తను.

తాము నాన్నను చూడ్డానికి వెళ్ళినప్పుడు దుర్గమ్మ ప్రవర్తన నాన్నకు తర్వాత తెలిసింది. "నేను ఏ వూరూ వెళ్ళలేదు. అది అబద్ధాలు చెప్పింది మీరు రాసిన ఉత్తరాలేవీ నాకు అందలేదు. వాళ్ళిద్దరే వాటిని చింపేసివుంటారు లేదా ఆ నిద్రముఖంవాడు బైరాగిరావు




# కలియుగ పాండవులు

దర్శకత్వం
కె. రాఘవేంద్రరావు B.A.

నిర్మాత
డి. రామానాయుడు

పోస్టు అందుకుని చింపేసి వుంటాడు"

కొద్దిరోజులుగా తనకూ వంట్లో బాగు లేక పోవడంతో తను నాన్నమ్మను చూడటానికి రాలేకపోయాడట. ఆ తరువాత బయల్దేరదామంటే ప్రతీ ఆదివారం పిన్ని "వంట్లో బాగులేదు....నన్నొదిలి మీరు వెళ్ళవద్దు" అని మంచందిగేదికాదు.

ఆఖరికి కబురు తెలిసిన తర్వాత అంతకుముందు తన కొచ్చిన ఎరియర్స్ డబ్బు ఇమ్మని అడిగితే, దాంతో బంగారం కొనేశానని ఇంట్లో దమ్మిడీ కూడా లేదని అబద్ధం ఆడిందట. వూళ్ళో ఎక్కడా అప్పు దొరకలేదట... 'పోనీ పసువులు అమ్మేస్తాను, ఆ తరువాత చేయిస్తాను, అక్కడ ఇప్పుడు డబ్బు అవసరం వుంటుంది' అంటే 'ఇవ్వను పొమ్మన్నదట' ఇదంతా నాన్న చెప్తోంటే ఎంతో బాధని పించింది.

చిన్నదినం, పెద్దదినాలకు పిన్ని, పిల్లల్ని, బైరాగిరావు దుర్గమ్మలను తీసు కొచ్చింది. కార్యక్రమాలు అన్నీ అయి ఇంటికి వెళ్ళేముందు తమతో వచ్చెయ్య మన్నారు నాన్న.

"పరీక్షలు దగ్గర పడ్డాయి...ఇప్పుడు రాలేను" అన్నాడు తను.

"నాన్నమ్మగారి చేతులకి దుక్క లాంటి గాజులుండాలే...అవి నాన్న గారికిఇవ్వు..దాస్తారు".. అంది దుర్గమ్మ ఆప్యాయత వొలకబోస్తూ.

"అవి అవసరం వచ్చి అమ్మేశాం" అనంటే లబోదిబోమని గోలెట్టారు. పిన్ని, దుర్గమ్మ "ఆడపిల్లలకు ఏం ఇవ్వ కుండా పోయింది ముసిల్ది" అని గొణు క్కుంటూ తిట్టుకుంటూ మూలుక్కుంటూ కూర్చున్నారు "పోనీ డబ్బన్నా వుంటే ఇవ్వు ఎంతో కొంత మిగిలివుంటుందికదా? అడిగాడు బైరాగిరావు. లేదంటే పూప కున్నారు.

శారీరకంగా, మానసికంగా దిగులు పడి దుఃఖంతో చిక్కిపోయారు నాన్న. ఆరోజే అందరూ వెళ్ళిపోయారు.

* * *

ఆ తర్వాత నాన్న అప్పుడప్పుడు వచ్చి వెళ్తుండేవారు. ఆ తర్వాత ఉత్తరాలు రావడం తగ్గింది. పరీక్షల గొడవలో పడిపోయాడు తను. కృష్ణ చిన్నాన్న ట్రాన్స్‌ఫర్ మీద వెళ్ళిపోయారు. వాళ్ళెవరూ లేకపోవడంతో తను వేరే రూమ్ అల్లిపురంలో తీసుకుని మారిపోయాడు.

నాన్నను చూద్దామని చాలాకాలంగా అనుకుంటున్నాడు తను. అక్కడికి వెళ్తే పిన్ని పెళుసుమాటల్తో 'హింస' పెడుతుంది. అయినా సరే... నాన్నను చూసి వచ్చేద్దాం అని బయలుదేరాడు తను.

నాన్నావాళ్ళు ట్రాన్స్‌ఫర్ మీద ఇల్లు ఖాళీచేసేసి హైదరాబాద్ వెళ్ళిపోయారట. వాళ్ళ అడ్రస్ ఎవరికీ తెలీదన్నారు. మనసును కత్తితో కోసేసినంతగా బాధ కలిగింది. ఈ సంగతి తనకు తెలియనీయ లేదు. వెళ్ళేముందన్నా నాన్న రాలేదు. కనీసం 'ఇలా వెళ్తున్నాం' అన్న సంగ తన్నా ఉత్తరం రాయొచ్చు. అలా చేయ లేదు. తనను అంతలా కాదన్న వారి గురించి తను ఎందుకంతగా బాధపడాలి? అందుకే ఇక వాళ్ళ అడ్రసు గూర్చి ఏ ప్రయత్నమూ చేయకుండా తిరిగి వచ్చే శాడు. తను చాలా దురదృష్టవంతుడు. బతికున్న నాన్న అనురాగాన్ని, ఆప్యా యతనూ కూడా అందుకోలేకపోయాడు.

అమ్మ గుర్తొచ్చింది. "నన్ను వదిలి ఎందుకు వెళ్ళిపోయావమ్మా? నీవు నన్ను వదిలెయ్యగానే నా అదృష్టరేఖ కూడా





నన్ను వదిలివెళ్ళిపోయింది. ఎవరికీ పట్టకుండా ఇలా మిగిలిపోయాను" అని ఏడ్చాడు తను.

నాన్నమ్మ చనిపోయిన తర్వాత చదువు కొనసాగించటానికి తను ఎన్నో అవస్థలు పడాల్సొచ్చింది.

కొంతమంది స్టూడెంట్సును కూడదీసుకుని ట్యూషన్సు చెప్పడం ప్రారంభించాడు. నెలనెలా తన దగ్గరకొచ్చే స్టూడెంట్సు సంఖ్య బాగా పెరిగింది. షాపుల్లో ఎకౌంట్సు చూడటంవల్లకూడా కొంత ఆదాయం వస్తూనే వుంది. ఒక పక్క సంపాదన, మరోపక్క చదువు చాలా శ్రమ పడాల్సొచ్చేది.

మాధవరావునాయుడనే లాయరుగారు, తెలివైన పేద విద్యార్థులకు చదువుకోవటానికి ఆర్థిక సహాయం చేస్తున్నారని తెలిసింది. వెళ్ళి ఆయననుకలుసుకొన్నాడు తను.

తన మార్కులు చూసి ఆయన, "ఏదైనా ప్రొఫెషనల్ కోర్సులో చేరితే బాగుంటుంది. కాని చాలా డబ్బు ఖర్చు అవుతుంది. నీలాంటి తెలివైన విద్యార్థులు ఎంతోమంది చదువుకోటానికి అవకాశాలు లేక మరుగునపడిపోతున్నారు. నువ్వు మెడిసిన్‌కే అప్లయిచెయ్యి... నాకు చేతనయినంత సహాయం చేస్తాను" అన్నారు జంతట్టి.

ఆయనకు లాయర్‌గా మంచి ప్రాక్టీస్ వుంది. టేకప్ చేసిన కేసులన్నీ సక్సెస్ అవుతుండటంతో బాగా డబ్బుసంపాదించారు. ఆస్తి, అంతస్తు వుంది. తనకున్నదాంట్లో కొంత నలుగురికీ ఉపయోగపడేలా చేస్తే మంచిదన్న అభిప్రాయం వుండటంతో, తెలివైన పేద విద్యార్థులకు ఆర్థిక సహాయం అందిస్తుండేవారు.

ఆయన ఇచ్చిన భరోసాతోనే తను మెడిసిన్ చదవటానికి ధైర్యం చేసి ముందడుగు వేయగలిగాడు. అలాంటి మహానుభావులు కొంతమందైనా వుండబట్టి ఈ సమాజంలో మంచికి, మానవత్వానికి ఇంకా విలువ పెరుగుతూవుంది అనిపించింది.

ఇన్ని రకాలుగా పసితనం నుండీ బాధ్యతలు మోయవలసి వస్తున్న బరువైన తన జీవితంలో సునీత ఓ రిలీఫ్. ఈ జీవన సాగరంలో ఈది ఈది అలసిపోతున్న తనకు అనుకోకుండా దొరికిన తీరం. తను కాలేజీనుండి వస్తున్నప్పుడు తోవలో ఎక్కడో ఓ చోట కనిపించేది. కాస్సేపు ఏవేవో కబుర్లు చెప్పుకునేవాడు తాము. అలా తమ ప్రణయం రోజు రోజుకు కొత్త చిగుళ్లు వేసుకుంటూ వృద్ధి చెందుతోంది.



ఓ ఆదివారం బజార్లో పళ్ళు, స్వీట్స్ కొని, నాన్న దగ్గరకు బయలుదేరాడు తను. తనను చూసి సంబరపడిపోతూ గుమ్మంలోనే ఎదురొచ్చారు నాన్న.

"రారా! నీ కోసమే ఎదురుచూస్తున్నాను" ఆప్యాయంగా లోపలకు తీసుకెళ్ళారు.

మొక్కలకు గొప్పు తవ్వుతున్న బైరాగిరావు తనను చూసి ముఖం తిప్పేసుకున్నాడు.

"ఏమేవ్! అబ్బాయొచ్చాడు" పిలిచిన పది నిముషాలకు వంటింట్లోంచి బయటి కొచ్చింది పిన్ని.

పిన్నిని పోల్చుకోలేకపోయాడు తను. బాబ్డ్ హెయిర్ కటింగ్, స్లీవ్‌లెస్ జాకెట్, కళ్ళకు గోల్డ్ ఫ్రేమ్ గ్లాసెస్‌తో ఫాషన బుల్‌గా, దర్జాగా అగుపించింది. తనను చూసినా పలకరించనైనా లేదు. పరాయి వ్యక్తి నెవరినో చూసినట్లుగా, "వీడెందు కొచ్చాడా?' అన్నట్టు చూసిముఖం మాడ్చు కుని వెళ్ళిపోయింది.

తనే లేచి వెళ్ళి, పలుకరించాడు, "పిన్నీ బాగున్నారా?" అని.

"పోల్చుకోలేకపోయాను. ఎవరో అనుకున్నాను" అంది పిన్ని వెటకా రంగా.

"చెల్లాయిలు బాగున్నారా?" అడిగాడు తను.

"ఆ...ఏం బాగులే! ఇదిగో ఇలా వున్నాం. మీనాన్న రిటైర్ అయిపోయారు. బోలెడంత సంసారం...ఖర్చులు.రోజులు గడవటానికే ఎంతో ఇబ్బందిగా వుంది. ధరలా పెరిగిపోయాయి. ఇద్దరికిద్దరూ ఆడపిల్లలే" అంది ఎంతో బాధపడి పోతున్నదాన్లా ముఖం పెట్టుకొని.

ఇంటినిండా వున్న ఖరీదైన ఫర్నీచర్ ఫ్రిజ్, కలర్ టెలివిజన్ సెట్, పిన్ని, దుర్గమ్మల మెడల్లోని బంగారు నగలు- ఇవన్నీ పిన్ని మాటల్లోని అసత్యాన్ని వెలికి చూపిస్తున్నాయి.

వాళ్ళు భాగ్యంతో గొప్పగా బతుకు తున్నారని తనకు తెలిస్తే అప్పుగా ఏమైనా అడుగుతాడేమోనని పిన్ని భయ పడుతున్నట్లుగా వుంది. అందుకే అలా పేద అరుపులు అరుస్తోంది.

ఈ విషయంలో ఆమె తప్పేంలేదు. తప్పంతా తన పేదరికానిదే.

"కూర్చో..కాఫీ తీసుకొస్తాను" పిన్ని మాటతో తన ఆలోచనలకంతరాయం కలిగింది.

లోపల్నుంచి చెల్లాయిలు వచ్చారు. సిట్‌గా, ఆరోగ్యంగా రబ్బరు బొమ్మల్లా వున్నారు. తను పలకరించి, పిలిస్తే అందంగా నవ్వి వూరుకున్నారు.

"అన్నయ్యమ్మా!" అన్నారు నాన్న.

"ఓ...ఐసి!" అన్నారు. స్వీట్స్, ఫ్రూట్స్ వాళ్ళ చేతికిస్తే అందుకుని లోపలకు వెళ్ళిపోయారు.

దుర్గమ్మ వంటింట్లో వున్నట్టుంది. "ఆవచ్చిందెవరూ?" అనడిగింది.

"ఇంకెవడు వున్నాడుగా, ఆ జిడ్డు ముఖం వాడు-రజనిగాడు ఎంత వదిలించు కుందామన్నా వదిలేలాలేదు" అంది పిన్ని.

"పీడాపోయిందనుకుంటే మళ్ళీ తయారయ్యాడన్నమాట. ఇక్కడగాని తిష్టవేస్తాడేమో? అడ్రసెలా తెల్సింది. ఆయన భోజనానిగ్గాని వుండమంటాడేమో? కుదరదని చెప్పేయ్..." అంది దుర్గమ్మ. ఆమాటలన్నీ స్పష్టంగా తనకు వినిపించాయి.

"వస్తానని"నాన్నకు చెప్పి లేచాడు తను.

నాన్న తనను ఆపారు. ఆక్షణంలో నాన్న తనవైపు చూసిన చూపులో అర్థింపు... అభ్యర్థనను తను తోసి వేయలేకపోయాడు.

ఓ రెండు కప్పులతో టీ తీసుకొచ్చి ఇచ్చింది పిన్ని. కప్పులలో సగానికున్న ఆ టీ తాగటానికే యమయాతనయింది. మర్యాదకోసం, నాన్న సంతృప్తికోసం




నోటిదగ్గర పెట్టుకొని తీసేశాడు తను. నాన్న ఆ టీ సిప్ చేసి పిన్నివైపు కోపంగా చూశారు.

"కొంపతీసి ఈ ఇల్లు కొన్నట్టుగాని మీ నాన్న చెప్పారేంటి? నాకు నా పుట్టింటి వాళ్ళిచ్చిన డబ్బుతో కొనుక్కున్నాను నా పేర" అంది.

"మీ నాన్నగారికేదైనా పార్ట్‌టైమ్ జాబ్ చూసిపెడుదూ. ఓ రెండువందలైనా సరే చాలు. ఆ పెన్షన్ డబ్బులు ఎందుకూ చాలడం లేదు" అంది పిన్ని. దుర్గమ్మ లోపల్నుంచి తొంగిచూసి, తిరిగి లోపలికి వెళ్ళిపోయింది.

''వస్తానని" చెప్పి బయలుదేరాడు తను.

"అలా బజారుకెళ్ళి కూరగాయలు పట్టుకొస్తానని" చెప్పి తన వెంట బయలుదేరాడు నాన్న. బస్టాపువరకూ వచ్చారు. "ఇవేవీ మనసులో వుంచుకోకు. అప్పుడప్పుడూ వస్తూండు" అన్నారు.



'కనీసం భోజనం చేసి వెళ్ళు అని ఎవరూ అన్నారుకాదు. ఎవడో త్రోవంట పోయేవాడితో మాట్లాడినట్లు మాట్లాడారు' అనుకున్నాడు తను.

హోటల్లో భోజనం చేసివచ్చి రూములో పడుకున్నాడు. గాయపడిన హృదయం రెండురోజులవరకూ కుదుట పడలేదు.

* * *

సునీల్ తమ్ముడు, చెల్లాయిలూ ప్రతి పరీక్షలోనూ మంచి మార్కులు తెచ్చు కుంటున్నారు. వాళ్ళ అమ్మగారు, నాన్న గారు ఎంతగానో సంతోషించారు.

"అల్లరి చిల్లరగా తిరిగే ఆకతాయి పిల్లల్ని అదుపులోపెట్టి తీర్చిదిద్దావు. జీరో మార్కులు తెచ్చుకునేవాళ్ళకు ఇప్పుడు ఫస్టు మార్కులు వస్తున్నాయి. ఆ చేత్తోనే మా సునీల్ని ప్రయోజకుడిగా చెయ్యి బాబూ!" అడిగింది అమృతవల్లి.

"ఒకపక్క ట్యూషన్సు, మరోపక్క పార్ట్‌టైమ్ జాబ్, నా చదువు... వీటివల్ల ఏమాత్రం ఖాళీ వుండటం లేదమ్మా! ఆరోగ్యం పాడవుతోంది. వీటన్నిటికీ తోడు ఇంకా మరో గంట సునీల్ కోసం స్పేర్ చెయ్యడంవల్ల నా చదువు సాగడం కష్టం అవుతుంది. మీరు నాతల్లి 'లాంటివారుకాదు కూడదు' అంటే నేను చెప్పక తప్పదు" అన్నాడు తను.

"వీటన్నిటికంటే నీ చదువు ముఖ్యం బాబూ! అక్కడ ఎక్కడో వుండి పిల్లలకు చదువు చెప్పడం కోసం అంత దూరం నుండి శ్రమపడి రావటానికి బదులు, ఇక్కడే మా మేడమీద గదిలోనే వుండిపోవచ్చుకదా! బోలెడంత టైమ్ కలిసొస్తుంది. ఆ టైములో నువ్వు చదువు కోవచ్చు. వాడు కూడా నీతోపాటే రూములో వుండి చదువుకుంటూవుంటాడు. నీకేమాత్రం టైమ్‌దొరికినా చెబుదువిగాని" అంది.

"అంత అద్దె నేను ఇచ్చుకోలేనమ్మా!"

"అద్దా? ఇంకా నయం మా ఇంట్లో పిల్లాడిలా వుంటున్నావు. నీ దగ్గర అద్దె తీసుకొంటామా?ఇక్కణ్ణుంచినీకుకాలేజీకి కూడా దగ్గరే. వాడు ఫ్రెండ్సుతో తిరిగి పాడయిపోతున్నాడు. వాడు ఏ ఇంజనీరో డాక్టరో అయితే చూడాలని వాళ్ళ నాన్న తాపత్రయం. అందుకే వాణ్ణి నీ చేతుల్లో పెట్టదలచుకున్నాను. నీతోపాటు వాడు ఏ కొద్దిసేపు చదువుకున్నాచాలు. నీకు ఖాళీ దొరికినప్పుడే వాడికేదైనా చెప్తుండు" అంది.

అంతలా ఆమె తన మంచికూడా కోరు తున్నప్పుడు తిరస్కరించడంలో అర్థం లేదనిపించింది. వెంటనే తను సునీల్ మేడపై గదిలోకి మకాం మార్చేశాడు. అందువల్ల తనకు ఎంతోసమయం కలిసి వస్తోంది. సునీల్‌కు ట్యూషన్ చెప్పగా మిగిలిన సమయం కూడా తను శ్రద్ధగా చదువుకోవటానికి ఉపయోగపడుతోంది.

* * *

ఒకరోజు మెడికల్ కాలేజీనుండి వస్తుం డగా అనుకోకుండా తోవలో ఓ దృశ్యం తన కళ్ళ బడింది. ఎవరో ఇద్దరు స్టూడెంట్సు సునీతవెంటపడి ఏవేవో జోక్సు వేస్తూ ఆమెతో మాటలు కలుప డానికీ,ఆమెను నవ్వించడానికి ప్రయత్నం చేస్తున్నారు. సునీత తల దించుకొని రోడ్డువారగా నడిచిపోతోంది. వాళ్ళు ఒకడి భుజం మీద మరొకడు చేతులు వేసుకుని వెకిలిచేష్టలు చేస్తూ ఫాలో అవుతున్నారు.

సునీత ఎంతగా తప్పించుకునిపోవా లని ప్రయత్నిస్తున్నా వాళ్ళు వదలడం

లేదు. తను తొందర తొందరగా వెళ్ళి వాళ్ళలో ఒకడి భుజంమీద చేయివేసి "మిష్టర్!" అన్నాడు. వాళ్ళిద్దరూ వెనక్కు తిరిగారు. వాళ్ళలో ఒకడు మెడికోయే. ఏం? అన్నట్టుగా సీరియస్‌గా చూశాడు.

"గురూ! అనవసరమైన విషయాలలో కలుగజేసుకోవద్దు. నీ తోవన నువ్వు పో..." అన్నాడు మరొకడు.

"క్లాసులో అందరికన్నా బుద్ధిమంతు డివి, బ్రిలియంట్ స్టూడెంటువు. తిన్నగా రూముకెళ్ళి చదువుకోకుండా ఇలాంటి కార్యక్రమాలు మొదలెట్టావేంటి? బ్రదర్" అన్నాడు మెడికో.

"ఆ అమ్మాయినెందుకు అల్లరి పెడుతున్నారు"?

"ఆ అమ్మాయిని అల్లరి చెయ్యడమా? అలాంటి పనులు మేమెప్పుడూ చెయ్యమే! ఏం పాపా! ఓసారీ నీ పేరు ఇంకా చెప్పలేదుగదూ ... ఇప్పుడు చెప్తావా?" అడిగాడు సునీతను.

"ఆ అవసరంలేదు" అందామె సీరి యస్‌గా.

"పోనీ పాపాయ్! అని పిలుస్తాం... ఆ పాపాయ్! నిన్ను మేము అసలు ఏమైనా అన్నామా? బుద్ధిగా మా తోవన మేము పోవడంలేదూ?" కమేడియన్ స్టయిల్‌లో అడిగాడు ఒకడు.

ఏమైనా చెబితే గొడవ పెరుగుతుందని లేదని బుర్ర అడ్డంగా తిప్పింది సునీత.

"అలా కాదమ్మా చిట్టీ! నోటితో చెప్పాలి...నీ తీయటి పలుకులు మేము వినాలికదా!"

సునీత "అల్లరి చెయ్యడంలేదు" అంది.

"చూశారా! మాలాంటి మర్యాద స్తుల్ని పట్టుకొని నిందలు వేస్తున్నారు. ఇక తమ తోవన దయచెయ్యండి మిష్టర్ సోషల్‌వర్కర్" వెకిలిగా నవ్వుతూ అన్నాడొకడు.

"ఆ పని మీరు చెయ్యండి. మేమే ఇద్దరం కలిసే వెళ్తాం. వాళ్ళ ఇంటివరకూ వెళ్ళి ఆమెను దిగబెట్టి వస్తాను. ఆమె మా బంధువులమ్మాయి"

"మీ రిలేటివా? అత్త కూతురేమో? మేరేజ్ ప్రపోజల్సు కూడా వున్నాయేమో? సారీగురూ! రాంగ్‌నంబరయ్యి పోయింది. పదరా పాల్ పోదాం. సారీ స్వీటీ...వెళ్ళొస్తాం.విష్యూ ఆల్ సక్సెస్. ఇంటికెందుకు అలా ఏదైనా పిక్చర్‌కు పోండి ఇద్దరూ...హాయిగా జాలీగా" అని వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోయిన చాలా సేపటికిగాని సునీతలో భయం పోలేదు. "వెధవలు తెగ అల్లరిచేశారు. చాలా భయంవేసింది" అంది.

"వూరుకున్నావెందుకు? చెప్పు తీయా ల్సింది" అన్నాడు తను.

"అలా చేస్తే ఇంకేవన్నావుందో? వాళ్ళు మరింత అల్లరిచేస్తారు. అందుకే వూరుకున్నాను. ఇంతలో మీరొచ్చేశారు. అసలీ గొడవంతా మీవల్లే వచ్చింది. మీ కోసం పార్కుదగ్గర ఎంతసేపు వెయిట్ చేశానో తెలుసా? అక్కడే వాళ్ళిద్దరూ నన్ను చూశారు. ఒంటరిగా వున్నానని దగ్గరచేరి అల్లరిచేశారు ఏదేదోవాగారు" అంది ఉక్రోషంగా.

"ఏం వాగారు?"

"నా మొహం...అల్లరి పిల్లలు ఏం వాగుతారు? అదంతా నన్ను చెప్పమంటారా?"

"ప్లీజ్! చెప్పు చెప్పు...సరదాగా

వింటాను" అన్నాడు తను.

"బలేగుందిరా" అన్నాడు ఆ చారల షర్టు వేసుకున్న వాడు.

"ఎవరికోసమో? ఎదురుచూస్తోందిరా" అన్నాడు ఆ సోడాబుడ్డి కళ్ళద్దాలవాడు.

"ఇంకెవరికోసం మనం వుండగా. మన కోసమేరా ఫూల్! వచ్చేశాంగా బయలు దేరదామా? పాపాయ్! పిక్చర్‌కా బీచ్‌కా?"

"బార్బర్‌షాపుకు"

"హి హ్హి హ్హి ... బార్బర్‌షాపుకా? అక్కడికెందుకూ?ఛో...చిలిపి"

"మీ ఇద్దరికీ గుండు కొట్టించడానికి" కోపంగా అన్నాను.

"అమ్మబాబోయ్ గుండే! ఒరేపోదాం రా...నాకెందుకో భయమేస్తోంది" సోడా బుడ్డి కళ్ళద్దాలవాడు జారుకోబోయాడు.

"ఆగరా ఫూల్! నీ ప్రేయసికి గుండంటే ఇష్టంలాగుంది ఆమాత్రం త్యాగం చెయ్యలేవురా? అందంగావున్న అమ్మాయికోరికఆమాత్రం తీర్చలేవురా?'' పాపా! ముందేదయినా పిక్చర్‌కు వెళ్ళి అక్కడనుంచి అలా బార్బర్‌షాపుకెళ దాంఏం....మంచి పిల్లవు కదూ! ఎంత ముద్దొస్తోందో పాప" ఒరే నువ్వుముందెళ్ళి టిక్కట్లుతీసుకోరా!మేమిద్దరం వచ్చేస్తాం" అన్నాడు ఒకడు.

"అబ్బ...ఎంతాశ! టిక్కట్లు నేను తియ్యలేను నువ్వే వెళ్ళు. పాపా నేనూ కబుర్లుచెప్పుకుంటూవచ్చేస్తాం" మరొకడు.

"యూ ఫూల్స్! మీకు అక్కాచెల్లెళ్ళు ఎవరూ లేరూ?"

"లేరు అమ్మలూ! మా అమ్మా నాన్నకు నేనొక్కణ్నే. పెంచుకుందా మన్నా ఎవరూ దొరకలేదు...మీకిష్టం అయితే మిమ్మల్ని పెంచుకొమ్మని చెప్తాను"

చెప్పు తీశాను.

"పాపం తెగిపోయిందిరా! ఆజంక్షన్‌లో రిపేరుచేయిద్దాం! లేకపోతే కొత్తదే కొనెయ్యవచ్చు....ఏం పాపా"

కోపంగాచూశాను...ఆ చెప్పు వాళ్ళ ముఖాన కొట్టాలని.

''అబ్బ! తినేస్తోంది గురూ! ఏం అందం''అంటూ ఏదేదో వాగుతున్నారు. వాళ్ళ మాటలు పట్టించుకోకుండా మీరు వస్తారని మీకోసం అలా ఎదురుచూస్తూ నిలబడ్డాను.

చీకటిపడబోతోంది. ఇంకా అక్కడ ఎక్కువసేపు నిలబడితే ప్రమాదం. ఎవ రయినా తెలిసినవాళ్ళయినావస్తే బావుండు నని చూసి చూసి బయలుదేరాను. వాళ్ళు వెంటపడ్డారు. ఆ తర్వాతమీకు తెలిసిందే" అంది సునీత.

"వెరీ సారీ సునీతా! ఓ పేషంటు కండిషన్ సీరియస్‌గా వుండటంతో కదల బుద్ధి అయిందికాదు. 'మా అమ్మకే అలా వుంటే వదలివచ్చేస్తానా' అని పించింది. వార్డులో వుండాల్సిన టైము అయిపోయినా, ఎందుకో ఆమెదగ్గర అలా చాలాసేపు వుండాలనిపించింది. 'సీరియస్‌నెస్' తగ్గగానే వచ్చేశాను"

"డాక్టరుకు వుండవలసిన ముఖ్యలక్ష ణాలు మీదగ్గరున్నాయి. మున్ముందు మీరు చాలా గొప్ప డాక్టరు అవుతారు. ఆ ప్రొఫెషన్‌కు కావాల్సిన సేవాభావం మానవత్వపు విలువల్ని గౌరవించడం, పేషన్ను...మనుషుల్ని ఆత్మీయంగా చూడ టం! 'హేట్సాఫ్' అనిపించుకోగల స్థితికి చేరుతారు మీరు. వెరీసారీ....ఆ సంగతి నాకు తెలీక ఏదో అనేశాను. వారిద్దరిలో ఒకడు మీతో పరిచయం వున్నట్టుగా మాట్లాడాడు. మీ అందరిదీ ఒకే బేచీనా?





ఫ్యాన్లలో ఎన్నోరకాలు ఉన్నా......
అన్నిరకాల ఫ్యాన్లు
దొరికేచోటు ఒక్కటే....

ఆఫ్‌సీజన్
బంపర్ తగ్గింపు
ధరల్లో......



ఆంధ్రప్రదేశ్‌లో అత్యధికంగా ఫ్యాన్ల అమ్మకం దారులు:

## శ్రీ సీతారామ ఎలక్ట్రికల్స్

సామారంగంచౌక్, విజయవాడ-1. ఫోన్: 74039

devaa

# ఈనాడు

## భాషా స్వరూపం

మాట్లాడేటపుడు భాషకు హావభావాలు, అంగవిన్యాసంలాంటివి తోడ్పడతాయి. రాసేటపుడు ఈ సాధనాలుండవు. కనుక విస్పష్టంగా, నిర్దుష్టంగా రాయాలంటే భాషకు ఒక ప్రమాణం వుండాలి. పత్రికా భాషకు అలాంటి ప్రమాణం ఏర్పరచిన పుస్తకం "ఈనాడు భాషా స్వరూపం".

వెల రు. 25.00

ఎం.ఓ. ద్వారాగాని, డి.డి. ద్వారాగాని ఈ మొత్తం పంపి ఈ పుస్తకాన్ని రిజిస్టరు పోస్టుద్వారా పొందవచ్చు.

ప్రతులకు : ఉషోదయా పబ్లికేషన్స్
ప్రయివేట్ లిమిటెడ్
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా,
హైదరాబాద్-500 482.

అలాంటివాళ్ళతో ఫ్రెండ్షిప్ చేశారంటే, ఆరునెలలలో వారు పిరవుతారు .... ఆ మందుబుడ్లు అవీ మీకూ్కడా అలవాటవు తాయి" అంది.

"వాడు నా క్లాస్‌మేట్ ... అంతే! అంతకుమించి వాళ్లతోపరిచయాలు లేవు"

ఇల్లు దగ్గరవ్వడంతో "గుడ్ నైట్!" అని చెప్పింది.

"స్వీట్ డ్రీమ్స్" అని చెప్పి బయలు దేరాడు తను.

* * *

కలలోకూడా ఎన్నడూ వూహించ లేనటువంటి మార్పులు కొన్ని కొందరి జీవితాల్లో జరుగుతుంటాయి. ఒకరోజు జరిగిన సంఘటన తన జీవితాన్ని సమూలంగా మార్చేసింది.

ఆరోజు క్లాసు జరుగుతుండగా తన కోసం 'ఎవరో వచ్చారని' కబురొచ్చింది. తనకోసమని అంతలా కాలేజీకి వచ్చే వారెవరున్నారనుకున్నాడు తను. 'నాన్న గాని వచ్చారేమో' అని ప్రొఫెసర్ పర్మిషన్ తీసుకొని బయటకొచ్చాడు.

చెట్టునీడన ఓ కొత్త ఫియట్ కారు ఆగి వుంది. ఆ కారును ఆనుకొని నిలబడ్డ వయసుమళ్ళిన వ్యక్తి మంచి స్థితిపరుడిలా వున్నాడు. తెల్లగా, పొడవుగా, ఎత్తుగా, బలంగా, బుంగమీసాలతో, కళ్ళకు ఖరీదయిన ఇంపోర్టెడ్ గోల్డ్ ఫ్రేమ్ కూలింగ్ గ్లాసెస్‌తో, తెల్లటి మల్లెపూలలాంటి ఖరీదయిన బట్టల్లో దర్జాగా, ఠీవిగా నిలబడి వున్నాడు.

ఆయన్ను చూడగానే ఎందుకో గౌరవ భావం కలిగింది. అతనెవరో తనకు బాగా ఆత్మీయుడు, ఎన్నాళ్లగానో పరిచయం వున్నవ్యక్తిలా అగుపించాడు.

అతని పక్కనే సాదాదుస్తుల్లో మరో వ్యక్తి వినయంగా నిలబడి వున్నాడు. తను వాళ్ళనెప్పుడూ చూడలేదు.

"ఏరీ....ఎవరొచ్చారు?" ప్యూన్నడిగాడు తను.

"అదిగోనండీ! వాళ్ళే మీకోసమొచ్చారు" అని చూపించాడు ప్యూన్.

తను బయటకు రావడం చూసి. వాళ్ళిద్దరూ ఆత్రంగా ముందు కొచ్చారు.

బుంగ మీసాల వ్యక్తి తన వైపు ఆప్యాయత నిండిన చూపుల్తో, ఏదో పెన్నిధిని చూస్తున్నవాడిలా, మనసులో పెల్లుబుకుతున్న ఆనందంతో ముందు కొచ్చి "బాబూ రజనీ! బాగున్నావా నాయనా" అంటూ పలకరించాడు.

తనకేమాత్రం పరిచయంలేని ఆయన అంత ఆత్మీయంగా పలకరిస్తుంటే ఆశ్చర్యం వేసింది.

ఆ వ్యక్తితో... ఆ గొంతుతో... తనకెప్పట్నుంచో పరిచయమున్నట్టు ఆయన రూపు ఎందుకో తెలీని ఆత్మీయతను మనసులో నింపుతోంది. ఆయన లోని ఏదో ఆకర్షణ మనసులో ఎందుకో ఆరాటం లేపుతోంది అతనివైపు అలా చూస్తూ వుండిపోయాడు తను. అలా ఎందుకు జరుగుతుందో తెలీడం లేదు.

వాళ్ళిద్దరికీ నమస్కారం చేసి... "సారీ! మీరెవరో నేను పోల్చుకోలేక పోతున్నాను" అన్నాడు ప్రశ్నార్థకంగా చూస్తూ.

"వీరు భుజంగరావుగారు. స్వయానా మీ మేనమామగారు. నేను ఆయనపర్సనల్ అసిస్టెంటును" బుంగమీసాల వ్యక్తిని చూపిస్తూ అన్నాడు సాదా దుస్తుల్లో వున్న వ్యక్తి.

"మేనమామగారా ... ఎలా? నాకు మా తండ్రిగారు తప్ప మరో బంధువు




ఎవరూ లేరే" అన్నాడు తను.

"మీ అమ్మగారు... అన్నపూర్ణమ్మకు స్వయానా తోబుట్టువు. రాయపురంలో లేండ్‌లార్డ్. గుర్తుకు తెచ్చుకోండి బాబూ" అన్నాడు పి.ఎ.

"నాకో మేనమామగారుండేవారని వినడమే తప్ప, ఆయన్నెప్పుడూ చూడటం గాని, కలుసుకొని మాట్లాడటంగాని జరగ లేదు. నాకీ ప్రపంచంలో బంధువులెవరూ లేరు. అయినా నాతల్లి చనిపోయినప్పుడు కూడా ఆఖరి చూపులకైనా రానివాళ్ళు నాకు బంధువులెలా అవుతారు?" అంటు న్నప్పుడు కళ్ళు చెమర్చాయి.

"అలా అనకు బాబూ! దీని వెనుక చాలా కథవుంది. నెమ్మది మీద నీకంతా వివరంగా చెప్తాను. మీ అందరి గురించిన భోగట్టా ఈమధ్యనే ఇన్నాళ్ళ తర్వాత తెలిసింది. రాయపురంనుండి పనిమీద వచ్చిన నాకు మీనాన్నగారు కనిపించారు. ఆయనలో చాలా మార్పువచ్చింది. పోల్చు కోలేకపోయాను. ఆయన ద్వారా అన్ని విషయాలూ తెలిశాయి. మా చెల్లెలు అన్నపూర్ణ మరణించిన సంగతి మాకు తెలియదు. నువ్విక్కడ మెడిసిన్ చదువు తున్నావని ఆయనే చెప్పారు. మా అందర్నీ కాదని ఆమె వెళ్ళిపోయినా ఎక్కడో ఓచోట సుఖంగా బతుకుతోం దనే ఇన్నాళ్ళూ అనుకుంటూ వచ్చాం. కోపం తగ్గాక వస్తుందనుకున్నాం. కాని...కాని... ఆమె ఈ లోకంలోనే లేకుండా వెళ్ళిపోయిందని కలలోనైనా వూహించలేకపోయాం. ఎంతో ఆస్తిని, ఐశ్వర్యాన్ని ఒదులుకొని వెళ్ళిపోయింది. ఎన్ని కష్టాలుపడిందో? అందరం వుండి కూడా నువ్వు ఎవరూ లేనివాడిలా బతుకు గడపవలసివస్తోంది. ఏదియేమైనా ఎన్ని కష్టాలు వచ్చిపైనపడినా...నువ్వు ఆత్మస్థైర్యంతో అనుకున్న లక్ష్యాన్ని సాధించటానికి పూనుకున్నందుకు నాకు చాలా గర్వంగా వుంది. ఇంటికి వెళ్ళి అన్ని విషయాలు మాట్లాడుకుందాం. ముందు క్లాసుకు వెళ్ళిరా బాబూ! అంత వరకూ మేమిక్కడే వుంటాం'' అన్నా రాయన.

''ఇదే లాస్ట్ అవర్. క్లాస్ అయిన వెంటనే వచ్చేస్తాను. అంతవరకూ ఆఫీస్ రూమ్‌లో కూర్చోండి'' అన్నాడు తను.

"ఫరవాలేదు కార్లోకూర్చుని వుంటాం. క్లాస్ అయిన వెంటనే వచ్చెయ్" అన్నా రాయన.

క్లాసులో కూర్చుని వున్నాడేగాని మనసంతా ఈ సంఘటనకు గురించిన ఆలోచనలతోనే నిండిపోయింది. తను చాలాకాలం తర్వాత నాన్నగార్ని కలవడం వీళ్ళిద్దరూ అనుకోకుండా కలుసు కోవడం, ఎప్పుడో విడిపోయిన బంధాన్ని ముడివేయటానికి ప్రయత్నిస్తూ ఈయన మేనమామనంటూ తనను వెతుక్కుంటూ రావడం...ఇదంతా ఎంతో విచిత్రంగా వున్నట్టు అనిపించింది. క్లాసు అయిన వెంటనే వెళ్ళి వాళ్ళను కలుసుకున్నాడు తను.

కార్లో భుజంగరావుగారు తన పర్సు లోంచి చెల్లెలితో కలిసి తీయించుకున్న ఫొటో తీసి చూపించారు. ఆ ఫొటోలో అమ్మను చూస్తుంటే తనకు కళ్ళు చెమ ర్చాయి. అమ్మ కాలేజీలో చదువుకుంటున్న రోజులనాటి ఫొటో అది.

వంటినిండా నగలతో, పట్టు చీరలో అందమైన ముఖంతో, పెదవులపై చిరు నవ్వుతో అనురాగమయిలా వుంది అమ్మ. మావయ్యా కూడా అందంగానే



వున్నాడు. ఇద్దరూ కొంచెం సన్నగా పీలగా వున్నట్టు అగుపించారు. తన గదిలో వున్న ఫోటోలోఅమ్మ ఏ నగలూ లేకపోయినా నిండుగా, అందంగా, హుందాగా, నిండైన చిరునవ్వుతో పరిపూర్ణమైన స్త్రీత్వానికి ప్రతిరూపంలా వుంటుంది.

పర్సనల్ సెక్రటరీ కారు స్టార్టు చేశాడు. "అలా షాపింగ్‌కు వెళ్ళి అక్కణ్ణుంచి తిన్నగా రాయపురం వెళ్ళిపోదాం" అన్నారు మావయ్య.

"రాయపురం నేనెందుకు?" అన్నాడు తను గాభరాగా.

"తాతగారింటికి రావా?" అడిగారు మావయ్య నవ్వుతూ.

"తర్వాత వీలుచూసుకొని వస్తాను"

"పదబాబూ! మనవూరు...ఇల్లు చూద్దువు! మమతను నువ్వు చూడలేదు కదూ! పిచ్చిపిల్ల అప్పుడప్పుడూ వాళ్ళ పూర్ణత్తయ్యను తలుస్తూ వుంటుంది"

"ముందుగా నా రూముకు వెళ్ళి, అమృతవల్లిగారికి చెప్పి వెళదాం. ఆమెకు ఏసంగతీ తెలియకపోతే...నా కోసం ఎదురుచూస్తూ వుంటారు. గాభరా పడతారు" అన్నాడు తను.

"అమృతవల్లిగారా? వారెవరు?" అడిగారు మావయ్య.

"ఇప్పుడు వాళ్ళ గదిలోనే వుంటున్నాను. వాళ్ళ పిల్లలకు ప్రయివేటు చెప్తుంటాను. వాళ్ళ పిల్లలతో సమానంగా నన్నూ చూసుకుంటారావిడ"

తను చెప్పిన ప్రకారం డాబాముందు కారాగింది.

అమృతవల్లిగారు బయటికొచ్చిచూశారు. కారుదిగి వస్తున్న తమను ఆశ్చర్యంగా చూస్తున్న ఆమెకు వారిద్దర్నీ పరిచయం చేశాడు తను.

ఆమె ఆప్యాయంగా అందర్నీ లోపలకు ఆహ్వానించి, భోజనాలు చేసేవరకూ వూరుకుంది కాదు.

"పోన్లేబాబూ! ఇన్నాళ్ళకు నీ వాళ్ళందర్నీ కలుసుకున్నావు. ఇన్నాళ్ళూ నా అన్నవాళ్ళ ప్రేమకు, ఆప్యాయతకు, అభిమానానికి ముఖం వాచావు" అంది అమృతవల్లి.

"మిమ్మల్ని చూస్తుంటే మా చెల్లాయినే చూస్తున్నట్లుగా వుందమ్మా! మా వాణ్ణి ఇన్నాళ్లూ కడుపులో పెట్టుకుని కన్నతల్లిలా వాడి మంచిచెడ్డలు చూస్తూ వచ్చారు. మీలాంటి చల్లటి తల్లుల అభిమానం వల్లనే మా మేనల్లుడు ఇంతటివాడయ్యాడు. ఈ రోజు మా వూరు రాయపురం వెళ్తున్నాం. ఓ సారి మీ అందరూ మావూరురండి...తప్పకుండా" అన్నారు మావయ్య.

"తప్పకుండా అన్నయ్యగారూ! మీరు అంత అభిమానంగా అడుగుతుంటే రాకుండా వుంటామా? రజనీకాంత్ ముఖంలోని వర్చస్సు, కాంతీ, సంస్కారం, మాటతీరు, అవిచూసి పెద్ద కుటుంబంలోంచే వచ్చినవాడు అనుకున్నాను" అంది అమృతవల్లి. ఆమెతో చెప్పి అందరూ మేడపైకి వచ్చారు.

మేడమీద గదిలో అడుగు పెడూనే, ఎదురుగా గోడపైవున్న అమ్మనాన్నల ఫోటోపై పడింది మావయ్యదృష్టి.

ఆ ఫోటోవైపే చూస్తూ అలా వుండిపోయారు చాలసేపటివరకూ.

పెళ్ళయిన కొత్తలో తీయించుకున్న ఫోటో అది. నాన్నమ్మ వస్తూ తనతోపాటు తీసుకొచ్చింది. తనకెంతో విలువైన, అపురూపమైన ఫోటో అది. ఆ ఫోటోలో




వున్న అమ్మ, నాన్నగారు తనను అనుక్షణం ఆశీర్వదిస్తూ, తను ముందుకు వెళ్లటానికి ఏటువంటి కష్టాలనైనా సహించగలిగే సహనాన్ని ఆత్మ ధైర్యాన్నీ ఇస్తూ వుంటారు.

"బాబూ! నీకు అభ్యంతరం లేకపోతే ఆ ఫొటోకాపీలు తీయిస్తాను" అన్నారు.

ఆ ఫొటోను భద్రంగాతీసి ఆయనకు అందించాడు.

ఎంతో అమూల్యమైన వస్తువును అందుకున్నట్టుగా మావయ్య ఆ ఫొటోను అందుకున్నారు.

కార్లో తిన్నగా షాపింగ్‌కు బయలు దేరారు తాము. ఎంత వద్దన్నా వినకుండా ఖరీదైన ఆరుజతల రెడీమేడ్ బట్టలు తీశారు. ఫొటో పెద్దసైజుకు ఎన్‌లార్జి మెంట్సుకు ఆర్డర్ ఇచ్చారు. రెండు బుట్టలతో ఏపిల్సు, బత్తాయిలు తీసుకున్నారు. తిన్నగా ద్వారకానగర్‌లో



నాన్నగారి ఇంటిముందుకు వెళ్ళి ఆగింది కారు. "అందరం కలిసి సరదాగా వెళ్ళొచ్చు" అన్నారు మామయ్య. కాని ఇంటికి తాళంవేసుంది. పక్కవాళ్ళ నడిగితే, "వాళ్ళెక్కడికి వెళ్ళారో తెలియ దన్నారు. ఓ అరగంటవరకూ చూసి అంతకూ రాకపోగా రాయపురం బయలు దేరారు తాము.

రెండుగంటల ప్రయాణం తర్వాత కారు రాయపురం పొలిమేరల్లో ప్రవేశించ గానే రోడ్డుమీద పోతున్న జనం ఎంతో వినయంగా తప్పుకుని, కారుకు దారి ఇస్తూ, మామయ్యపట్ల గౌరవాన్ని వ్యక్తం చేస్తున్నారు. పచ్చని పొలాలతో, తోట లతో, రోడ్డుపక్కన, పొలం గట్లమీద కొబ్బరిచెట్లతో ఊరు కలకల్లాడోంది. ఊరికి మధ్యగా మంచినీటికోసం పెద్ద చెరువు, ఊరికి ఈ చివర, ఆ చివర శివాలయం, రామాలయం, మామయ్య ఇంటికి వెళ్ళే తోవలో లైబ్రరీ, పంచా యితీ ఆఫీసు, స్కూలు, హస్పిటల్ వున్నాయి.

రాయపురంలో మామయ్య భవంతి చాలా పెద్దది. చుట్టూ విశాలమైన ఆవర ణలో రకరకాల పువ్వుల మొక్కలు తల లూపుతూ వున్నాయి. ప్రహరీనానుకుని కొబ్బరి, మామిడి, జామచెట్ల మధ్యగా తలెత్తుకొని నిలబడిన పెద్ద భవంతి, రంగులతో అందంగా, హుందాగా వుంది.

కారు పోర్టికోలో ఆగగానే–

అందంగా నాజూగ్గావున్న ఓ యువతి 'డాడీ!' అంటూ పరుగెత్తుకు వచ్చింది.

"ఏమ్మా! నాకోసమని అలా ఎదురు చూస్తూ కూర్చున్నావా? కొంచెం ఆలస్యం అయినా నీకో సంతోషకరమైన వార్తను, వ్యక్తిని తీసుకొచ్చాను. ఈయన ఎవరో చెప్పుకో చూద్దాం!" అడిగారు మామయ్య.

ఆమె కంటికొసతో చూసి "చెప్పుకో లేను" అంది.

"మన పూర్ణత్తయ్య కొడుకమ్మా! రజనీకాంత్" అన్నారు.

చిరునవ్వుతో కళ్ళింతలు చేసుకొని, అభిమానం కురుస్తున్న చూపులతో "నమస్కారం" అంది.

"హలో!" అని "ఈమె ఎవరో చెప్పనవసరం లేదు. మీ ఏకైక పుత్రిక" అన్నాడు తను.

"పేరు మమత" పూర్తిచేశారు మామయ్య.

సన్నగా, పొడవుగా, తెల్లగా, చక్కనైన పలువరుసతో, చురుకుగా మెరుస్తున్న కళ్ళతో అందంగా వుందామె.

"పదండి లోపలకూర్చుని మాట్లాడుకో వచ్చు" అన్నారు మామయ్య.

"అత్తయ్యను తీసుకురాలేదేం డాడీ" అడిగింది మమత.

బాధగా నిట్టూర్చారు మామయ్య. "అత్తయ్య మనకికలేదమ్మా! పూర్ణత్తయ్య చనిపోయి చాలకాలం అయింది" అన్నారు.

కొన్ని నిముషాలు అందరూ విషాదం నిండిన హృదయంతో మౌనంగా మూగ బాధను అనుభవిస్తూ వుండిపోయారు. మమత మౌనంగా రోదిస్తోంది. కన్నీరు చెంపలమీదుగా కారుతోంది. మామయ్య ఆమె తలనుహృదయంపైకి తీసుకున్నారు. తల నిమురుతూ వుంటే, చంటిపిల్లలా అలా వుండిపోయింది.

"పూర్ణత్తయ్యదగ్గరకు తీసుకెళ్ళమని ఎన్నోసార్లు నాతో అనేదానివి కదమ్మా! వాళ్ళజాడ తెలిసిన తర్వాత తప్పకుండా తీసుకువెళ్దామనేవాడ్ని. కాని, ఇప్పుడు




ఎక్కడికని తీసుకెళ్ళేది?'' అన్నారు మావయ్య కంటనీరు పెట్టుకొని.

"అమ్మ లేకపోయినా అత్తయినా వుందని ఏనాటికైనా ఆమెను చూడగలనని... ఇన్నాళ్ళూ ఆశపడుతుండేదాన్ని... నేను చాల దురదృష్టవంతురాల్ని నాన్నగారూ!"

''మావయ్యగారు విశాఖపట్నంలో కనిపించారు. పోల్చుకోలేనంతగా మారిపోయారు. ఆయన ద్వారా ఈ సంగతులన్నీ తెలిసాయి"

మమత కొంతసేపటికి తేరుకొంది.

మావయ్య కళ్ళు తుడుచుకొని... "లేమ్మా! మమతా!...బావ స్నానం చేస్తాడు. బాధపడి ప్రయోజనం లేదు. మనకి అదృష్టంలేదంతే!'' అన్నారు.

భోజనాలు అయిన తర్వాత మావయ్య ప్రారంభించారు. 'కాలేజీలో చదువుతున్న రోజుల్లోనే మీ అమ్మ నాన్నగారు మనసులు ఇచ్చి పుచ్చుకున్నారట. ఆ సంగతి ముందుగా మాకు తెలియలేదు. మీ అమ్మకు సంబంధాలు చూస్తున్న సమయంలో చెప్పిందా విషయం. నాన్నగారు ఈ పెళ్ళికి వప్పుకోలేదు. ''పేదవాడైన అతన్ని పెళ్ళి చేసుకొంటే సుఖపడదు. మంచి పొజిషన్‌లో వున్న లక్షాధికారికి ఇచ్చి చేస్తాను. ఈ ప్రేమల్లో నాకు నమ్మకం లేదు" అన్నారు.

చెల్లాయి వినిపించుకోలేదు. నాన్నగార్ని ఎదిరించింది. 'ఆనందరావును తప్ప మరొకర్ని పెళ్ళిచేసుకోనని, ఖండితంగా చెప్పేసింది.

అలా జరిగినపక్షంలో కట్టుబట్టలతో ఇంట్లో నుండి వెళ్ళిపోవాల్సుంటుందనీ, ఆస్తిలో దమ్మిడీ కూడా దక్కదని,తిరిగి గడపతొక్కే అర్హత కోల్పోవలసి వుంటుందనీ బెదిరించారు నాన్న.

అభిమానం, మొండి పట్టుదల మీ అమ్మకు బాగా ఎక్కువ. నాన్న బెదిరింపుల్ని లెక్కచెయ్యకుండా ఆనందరావుగార్ని ఓరోజు ఇంటికి తీసుకొచ్చింది. ఆయనను చూశాక నాన్నగారు కూడా పెద్దగా అయిష్టత వ్యక్తం చేయలేదు. తన నిర్ణయం చెప్పేసి ఆయనతోకలిసి వెళ్ళిపోయింది.ఆమరుసటిరోజు రిజిష్ట్రార్ ఆఫీస్‌లో వాళిద్దరికీ రిజిష్టర్ మారేజి జరిగింది. నాన్నకు తెలియకుండా నేనూ రిజిష్ట్రార్ ఆఫీసుకు వెళ్ళి, వాళ్ళిద్దర్నీ ఆశీర్వదించాను. అంతే! అదే ఆఖరిసార్తిగా మీ అమ్మను, నాన్నగార్ని చూడటం. ఆ తరువాత వాళ్ళు తిరిగి గుమ్మం ఎక్కలేదు. కోపం తగ్గాక వాళ్ళే వస్తారనుకున్నాం. కాని ... ఇంతగా మొండిగా, పట్టుదల పట్టి వుంటారని అనుకోలేదు.

ఆమెమీద బెంగతో ... నాన్నగారి ఆరోగ్యం పాడయింది. కొన్ని రోజుల తర్వాత మాచెల్లి అన్నపూర్ణ కోసం ... విచారంతో మంచం పట్టిన నాన్నగారు కన్నుమూసారు'' అనిచెప్పి కళ్ళు వత్తుకున్నాడు మావయ్య. పళ్ళబిగువున ఏడుపును అపుకొంటూ కొన్ని నిముషాల తర్వాత''చాలారాత్రయింది. పదబాబూ!'' అన్నారు

తనకని కేటాయించినగదిలో నిద్ర కుపక్రమించాడు తను.

'జరిగింది అంతా కలలా వుంది. నిన్నటివరకూ కటిక నేలమీదే చాప పరుచుకొని నిద్రపోయే తను, ఈరోజు విశాలమైనగదిలో, ఫోమ్‌బెడ్‌మీద, ఫేను క్రింద, పడుకొన్నాడు. ఎప్పుడో విడిపోయిన ఈ బంధం అతివిచిత్రంగా తిరిగి



కలిసింది. ఆలోచనల్లోనే నిద్రలోకి జారాడు తను

ఆ మరుసటిరోజు బయలుదేరుతున్నప్పుడు మావయ్యసంతకాలు చేసిన చెక్ బుక్ ఇచ్చారు. "అవసరం అయినంత డ్రా చేసుకో. నీకోసం ఓ స్కూటర్ తీసుకుంటున్నాను. నువ్వు ఉంటానికో మంచి పోర్షను తీసుకో...అద్దె ఎంతయినా ఫర్వాలేదు. డబ్బుకోసం మాత్రం నువ్వు ఇబ్బందిపడటానికి వీల్లేదు" అన్నాడు మావయ్య.

"మీ అభిమానానికి చాలా కృతజ్ఞుణ్ని మావయ్యా! కాని నన్ను మునుపటిలాగే సామాన్యంగానే బతకనివ్వండి. ఈ డబ్బు, స్కూటరు, వేరే పెద్ద పోర్షను-ఇవేవీ నాకు అక్కరలేదు. ఇన్నాళ్ళూ ఈ యంబిబియస్ చదువంతా నా స్వశక్తి మీద మీలాంటి దయామయుల ఆదరంతోనే గడిచింది. ఇకమీదకూడా అలాగే గడపాలని అనుకుంటున్నాను. అమృతవల్లిగారి ఆదరణలో నాకు తల్లిలేని లోటు తీరుతోంది" అన్నాడు తను.

"సరే నువ్వు వుండటం మాత్రం అక్కడే వుండు కాని తిండికి,బట్టకు ఖర్చులకు మాత్రం నీకేలోటూ వుండకూడదు. స్కూటరు వుండటంవల్ల నీకు బాగా టైమ్ కలిసొస్తుంది. ఇంద చెక్‌బుక్! ప్రతి ఆదివారం నువ్వు ఇక్కడికే వచ్చెయ్."

"వీలు అయినప్పుడల్లా వస్తుంటాను" అని చెప్పి బయలుదేరాడు తను.

సునీతకు జరిగిందంతా చెప్పాడు.

ఆమె ఎంతగానో సంతోషించింది. "చాలా ఆనందంగా వుంది నాకు. ఇన్నాళ్ళకు మీరు మీ వాళ్ళందరిని కలుసుకున్నారు. తన వాళ్ళందరిమధ్య ఉండే మనిషికి అదో ఆనందం. మీలో ఈ హుషారు, ఉల్లాసం ఇలాగే కలకాలం వుండాలి. మీ వాళ్ళందరిమధ్య ఈ పేదరాలు మీకు గుర్తుంటుందా?" అంది సరదాగా నవ్వుతూ.

"నిన్ను మరచిపోవడమా? అది నాకు సాధ్యమవుతుందా?" అన్నాడు తను ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.



మావయ్య పర్సనల్ అసిస్టెంటు కొత్త స్కూటర్ తీసుకొచ్చాడు. టెంపరరీ డ్రైవింగ్ లైసెన్సు తీసుకుని ఆయన దగ్గరే తను డ్రైవింగ్ నేర్చుకున్నాడు. ఓ రెండు మూడు రోజుల్లోనే పర్‌ఫెక్ట్‌గా డ్రైవ్ చేయటం వచ్చేసింది.

ఓరోజు సాయంత్రం ట్రిమ్‌గా తయారయి స్కూటర్ మీద షికారుగా బయలుదేరాడు తను. 'సునీత కనిపిస్తే బావుణ్ను. ఆమె ఈ బండి చూడలేదు. చూస్తే ఎంత సరదా పడుతుందో? ఆమెను ఎక్కించి అలా తిప్పి తీసుకురావాలి' అనుకుంటూ కాలేజీనుండి ఇంటివరకూ ఓ రెండుసార్లు తిరిగాడు. పార్కుదగ్గర కనిపించగానే పక్కగా స్లో చేసి ఆపాడు.

ట్రిమ్‌గా తయారయి స్కూటర్ మీద కూర్చున్న తనను ఆశ్చర్యంగా కళ్ళింతలు చేసుకొని చూసింది. "ఏంటి దొరగారు ఈరోజు ఇంత అందంగా ఉన్నారు?" అడిగింది.

# మా కొత్త విడుదలలు

నవలా రంగంలో కొత్త కెరటం
ప్రసిద్ధ రచయిత పేర నవలాయణం
పిప్పెరమెంట్ రచయిత

## రాజా

అందించిన "గరం గరం" సీరియల్

## • మల్లాది వెంకట కృష్ణమూర్తి

వెల: రూ 20/-

పద్మాలయ నవలా నవమోహిని సస్పెన్స
థ్రిల్లర్ నవలల పోటీలో ఎంపికై
ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రికలో
సీరియలీకరించిన "**రసగుల్లా**" నవల

హోతా పద్మినీదేవి

## • నీడలతో క్రీడలు

వెల: రూ.25/-

TULASI

# పద్మాలయ పబ్లికేషన్స్

రామమందిరం వద్ద, ఏలూరు రోడ్డు
విజయవాడ-2

"చెప్తానుగాని వెనక కూర్చో! అలా షికారుగా వెళ్ళి వచ్చేద్దాం అన్నాడు తను.

"షికారుకా? మీతోనా? ఎవరైనా చూస్తే ఇంకేమన్నా ఉందా? ఇప్పుడలా అడిగావు కాని ఇంకెప్పుడూ అడగొద్దు. అసలు మీతో ఇలా మాట్లాడుతున్నందుకే ఎంతో భయపడుతున్నాను. ఈ సంగతి మా నాన్నగారికిగాని తెలిసిందా, నా పని అయిపోయిందన్నమాటే! వద్దుబాబూ! నేను రాను" అంది.

"ఫరవాలేదు. ఎవరూ చూడరు. ప్లీజ్ అలా సరదాగా వెళ్ళి వచ్చేద్దాం"

"మీరు ఎన్ని చెప్పండి. నేను మీతో రాను. ఏదైనా మాట్లాడాలంటే ఇక్కడే మాట్లాడుకుందాం" అంది సునీత.

"ఈ ఒక్కసారికే అని చెప్తున్నాను కదా! అలా కాస్సేపు బీచ్ రోడ్‌లో తిరిగి వచ్చేద్దాం. అక్కడ మనకు తెలిసిన వారెవరూ వుండరు. అందులోనూ మనం పెళ్ళి చేసుకోబోయే వాళ్ళమే కదా! భయమెందుకు?" అని నెమ్మదిగా ఆమెకు నచ్చచెప్పేసరికి తల ప్రాణం తోకకొచ్చింది. ఎన్నెన్నో కండిషన్లు పెట్టి వెనక కూర్చుంది.

బీచ్ రోడ్డులో చల్లగాలిలో సరదాగా చాలసేపు తిరిగారు, తామిద్దరూ. ఇద్దరికీ ఆ అనుభవం కొత్తగానే వుంది. స్కూటర్ నడపడం, అందులోనూ వెనుక అందమైన అమ్మాయిని కూర్చోబెట్టుకొని తిరగడం ఎంతో థ్రిల్లింగ్‌గా వున్నట్టు అనిపించింది. స్కూటర్‌పై తనకేమాత్రం తగలకుండా జాగ్రత్తగా కూర్చుంది సునీత.

"ఏం? అంత దూరం అంటీ ముట్టనట్టు అలా కూర్చున్నావు? మరీ వెనక్కు వెళ్ళొద్దు పడిపోతావు. దగ్గరగా వచ్చి నన్ను పట్టుకో వచ్చుకదా?"

"వూహూ! రాను! అసలు మీస్కూటరే ఎక్కనని అంటే, బలవంతాన ఎక్కించారు. ఇప్పుడు కొంచెం ముందుకు రమ్మంటున్నారు. ఆ తర్వాత ఇంకా ముందుకు రమ్మంటారు, నడుముచుట్టూ చెయ్యి కూడా వెయ్యమంటారు" అంది కొంటెగా సునీత.

"ఓహో! అలాగా...సరేగానీ కొంచెం ముందుకు జరుగు సునీతా" రిక్వెస్టు చేశాడు తను.

"నేను జరగను" అంది.

ఇలాకాదని స్పీడ్ పెంచిసడన్‌గా బ్రేక్ కొట్టేసరికి వచ్చి పైన పడింది సునీత.

ఆమె వయసు పొంగులు వీపుకు మెత్తగా తగిలాయి. మనస్సంతా తీయటి బాధతో నిండిపోయింది.

సిగ్గుతో ముడుచుకుపోయింది సునీత.

"ఛ! ఇలా అయితే నేను మీతో ఎప్పుడూ రాను బాబూ! నన్నిక్కడ దింపెయ్యండి వెనక్కు వెళ్ళిపోతాను" అంది.

"సరే! అలాగే చేస్తాను గాని ఇక్కణ్నుంచి నడచి వెనక్కు వెళ్ళగలవా? ఇక్కడకు బస్సులవీ కూడా రావు"

"అయితే ఇంత దూరం తీసుకొచ్చి ఇక్కడ దించేస్తాననంటారా?"

"నేను దించేస్తానని అనలేదు. నువ్వే దిగిపోతాననంటున్నావుగా"

"కాకపోతే, నేనేం మీ భార్యననుకున్నారా? మీకు అంత దగ్గరగా కూర్చోటానికి. అయినా ఇదేం నాకు నచ్చలేదు. వెనక్కు తిప్పండి బండిని. ప్లీజ్ వెనక్కు తిప్పండి" అంది.

"తిప్పుతాను గాని నాకో ముద్దు లంచంగా ఇవ్వాలి"

"ముద్దుకాదు. వీపు మీద ఓ గుద్దు

ఇస్తాను. అన్నీ పాడుమాటలే. పెళ్ళయే వరకూ అలాంటివేం కుదరవు తెల్సిందా"

"పోనీ ఈ చేతి మీద, ఒక్కటే ఒక్కటి ఇచ్చెయ్ చాలు" అన్నాడు తను చేతిని వెనక్కు అందిస్తూ.

సునీత పెదవులను సుతారంగా ఆ చేతికి తగిలించింది. ఆమె చేతినందుకొని తనూ ఓ ముద్దు పెట్టాడు.

సునీతకు వళ్ళంతా "ఝల్లు" మంది. మనసు నిండా ఏవేవో పులకరింతలు చెల రేగాయి.

ఆమె చేతిని అలాగే దొరకబుచ్చుకొని నడుము చుట్టూ వేసుకొని "ఇది ఇలా కూర్చోవాలి. ఇప్పట్నుంచీ అలవాటు చేసుకో! రేపు పెళ్ళయ్యాక ఎలాగూ తప్పదుగా" అన్నాడు తను.

కొంత దూరం వచ్చాక స్కూటర్‌ను రోడ్డు పక్కగా పార్క్ చేసి రోడ్డు పక్కగా కట్టిన సిమెంటు గట్టుమీద నిల బడ్డారు ఇద్దరూ.

గాలికి రేగుతున్న ముంగురుల్ని సర్దు కుంటున్న భంగిమలో సునీత మరింత అందంగా అగుపించింది. అంతకు కొన్ని నిముషాల ముందే జరిగిన సంఘటనతో.. సిగ్గువలన ఎర్రబారిన బుగ్గల్లోని అరుణిమ ఇంకా తగ్గలేదు. అలా ఆమె వైపే చూస్తూ వుండి పోయాడు తను.

"ఏంటలా చూస్తున్నావు? పదండి పోదాం! చాల ఆలస్యం అయింది" అంది.

"ఆ హోటల్లో కాఫీ తీసుకునిపోదాం. అయిన ఆలస్యం ఎలాగూ అయింది" అన్నాడు తను.

బీచ్ రోడులోవున్న ఆ హోటల్ ముందు స్కూటరాగింది.

* * *

సర్వర్ తీసుకొచ్చిన బిల్లు చూసి పదులు రెండునోట్లువేసి టిప్‌గా మిగిలిన చిల్లర తీసుకొమ్మన్నాడు తను.

లేవబోతూ కేకలు వినిపించినవైపు చూశాడు తను. పిన్ని, నాన్నగారూ.

"నాన్నగారూ! బావున్నారా?" పలుక రించాడు తను.

"ఓహో! సువ్వేనా రజనీ! అవునా కాదా అని చూస్తున్నాను...ఏంటి బాగా చదువు సాగుతుందా?" అడిగాడు

"నేనిదాకే అన్నాను గదండీ! రజనీయేనని...ఆ ఏంటి సంగతి, బట్టలు అవీ...కొత్తవి కుట్టించుకున్నట్లున్నావు? ఈమధ్య మీ నాన్నగారుగాని కలిసారా? ఏంటి?" అడిగింది పిన్ని.

"లేదు. అందుకే వద్దామనుకుంటు న్నాను. ఈమధ్యనే ఓ స్కూటరు తీసు కున్నాను" అన్నాడు తను.

"స్కూటరు .... స్కూటరే! ఏంటి ఏవన్నా లాటరీగాని తగిలిందా?" ఆశ్చ ర్యంగా నోళ్ళు వెళ్ళబెట్టారు ఇద్దరూ.

"ఆమధ్య రావాలనే అనుకున్నాను... పరీక్షలు అవడం మూలాన ఎక్కడికీ కదలటానికి వీలుపడలేదు ఇప్పుడు ఆ రూమునుండి షిఫ్టయిపోయాను. అమృత వల్లిగారని సునీల్ వాళ్ళమ్మగారు. వాళ్ళ ఇంటిదగ్గరే వుంటున్నాను. పాపం ఆవిడ చాలా పట్టు పట్టాడు. ఆమధ్యలకార్లో మావయ్యా, నేనూ ఇంటికొచ్చాం. ఇంటికి తాళం పెట్టుంది."

"ఆ...ఆ పక్క వాళ్ళు చెప్పారేే! మీరే నేంటి వచ్చింది? ఏంటి కారుకూడా కొనే శావా ఏంటి?'' ఆశ్చర్యపోయింది పిన్ని.

"అవునయ్యా! చెప్పడం మరచాను. ఆమధ్య భుజంగరావు అదే అన్నపూర్ణ వాళ్ళన్నయ్య, మీ మేనమామ కలిశాడు.

జగదాంబలో పిక్చర్ కెళ్ళాను. మాపక్క రోలోనే కూర్చున్నాడు. నావంక పదే పదే చూస్తుంటే? ఎవర్రా, ఈయన అలా చూస్తున్నాడు అనుకున్నాను. నాక్కూడా అతగాణ్ని 'ఎక్కడో చూసినట్లే' అనిపించింది. ఇంటర్వెల్‌లో నాతోబాటే బయటకొచ్చాడు. ఏదో అడగబోయి పూరుకున్నాడు. తిరిగి పిక్చర్ ప్రారంభం అయింది. ఆ తర్వాత అతను సినిమా చూసినట్లుగాలేదు. నావేపు అస్తమానం అలా చూస్తుంటే నాకు చిరాకనిపించింది.

పిక్చర్ వదలిన తరువాత బయటకు నడుస్తున్నప్పుడు వెనక్కొచ్చి "మీ పేరు ఆనందరావు కదండీ!" అన్నాడు.

"అవును. మీరెవరు" అన్నాను.

"బావగారూ!" అంటూ ఆనందంగా చేయిపట్టేసుకున్నాడు. నేను గాభరాపడి పోయాను, 'ఏంట్రా ఈయన బావగారు అంటున్నాడూ" అనుకుంటూ.

"నేనండీ! భుజంగరావును. అన్నపూర్ణ మా చెల్లాయి" అన్నాడు.

నీ గురించి చెప్పాను. ఆత్రుతగా నీ అడ్రస్ అడిగాడు. చెల్లెలు పోయినా ఆమె కొడుకులోనైనా ఆమెను చూసుకోవాలన్న కాంక్ష ఆయనలో కనిపించింది. నీ అడ్రస్ ఇచ్చాను" అన్నారు నాన్న.

"ఆ వెంటనే నా దగ్గరికొచ్చారు. ఆ రోజురాయపురంవాళ్ళింటికి తీసుకువెళ్లారు. సంతకాలు పెట్టిన చెక్‌బుక్ ఇచ్చి ఎంత కావలిస్తే అంత 'డ్రా' చేసుకొని ఖర్చు చేసుకొమ్మన్నారు. ఆస్తిలో నాకు వాటా రాస్తానన్నారు. "మీ అభిమానం వుంటే చాలు నాకవేవీ అవసరం లేదన్నాను" అన్నాడు రజని.

"అయ్యో! అదేం... ఆస్తి రాస్తానంటే వద్దు పొమ్మని అన్నవాణ్ని నిన్నే చూశా నయ్యా రజనీ! ఇప్పుడన్నావుగాని, ఇంకెప్పుడూ అలా అనొద్దు. అంతగా నీకా ఆస్తి పాస్తులేవీ అవసరం లేకపోతే మీ నాన్నగారి పేరన రాసెయ్యమను" అంది పిన్ని.

"అలా వీలవదు. తాతయ్యగారి ఆస్తిలో కొంత భాగం అమ్మ తదనంతరం మనవడికి చెందాలని విల్లులో రాశారట" అన్నాడు తను.

పిన్ని ఆత్రంగా వచ్చి తన పక్కన నిలబడి "బాబ్బాబూ! అదేదో నీపేర రాయించేసుకో! లేదా... నీకవసరంలేదూ అని అనుకున్నదేదో నా పేర రాయటానికవుతుందేమో అడుగు. ఇంట్లో జరుగుబాటుకు చాలా ఇబ్బందిగా వుంటోంది. మేమేం నీకు పరాయి వాళ్ళం కాదుగా" అంది.

సన్నగా నవ్వుకున్నాడు తను... ఏమీ మాట్లాడలేదు.

"రేపు ఆదివారం ఇంటికొచ్చెయ్! బాబూ! పిల్లలందరితో సరదాగా వుండొచ్చు. ఒక్కడివే వుంటే ఏంవూసుపోతుంది? పిల్లలందరూ,అన్నయ్యెప్పుడు వస్తాడు?' అంటూతెగగోల చేస్తున్నారు" అంటూ ఆహ్వానించింది.

"రేపు ఆదివారమా? వీలుపడదు. రాయపురం వెళుతున్నాను. మావయ్య కారు పంపిస్తానన్నారు"

"ఆ! కారే! నిన్ను తీసుకెళ్ళటానికొస్తుందా? అమ్మో! మా రజనీ ఎంత గొప్పవాడయి పోయాడు? ఆ కార్లోనే అక్కడికి వెళ్ళే ముందు ఇంటికొచ్చి వెళ్ళు బాబూ! కారు చూసి పిల్లలు సర్దాపడతారు. అలా వూరు కుంటారేం? పిలవండి" అని పొడిచింది.

నాన్న విస్తుపోయి చూస్తున్నారు.

తరువాత చిన్నగా నవ్వుకున్నారు "రా బాబూ!" అన్నారు.

"సర్లెండి! అలాగే వస్తాను" అన్నాడు తను.

"ఆ అమ్మాయెవరు? గర్ల్ ఫ్రెండా? చక్కని చుక్కలా వుంది. ఈ రోజుల్లో నగలు వేసుకొనక పోవడం ఓ ఫేషన్. ఏ పెద్ద ఆఫీసర్ కూతురో? సింపుల్‌గా వుంది. బాబు సెలక్షన్ చాలా బావుంది కదండీ!" అంది నాన్నతో.

"పేరేంటమ్మా!" అడిగిందది సునీత వైపు ఆరాధనగా, ప్రశంసా పూర్వకంగా చూస్తూ.

"సునీత" తలదించుకొని పేరు చెప్పింది సునీత,

"చక్కటి పేరు! కాలేజీలో మా బాబుతో పాటు డాక్టరీ చదువుతున్నావా? నాన్నగారేం చేస్తుంటారు" అడిగింది పిన్ని.

"నేను చదువుతున్నది ఎం.బి.బి.యస్ కాదండి. బియ్యే! మానాన్న గారి పేరు గోవిందరావుగారు...మాష్టరుగారు"



"పోస్టు మాష్టరా? స్టేషను మాష్టరా?"

"అబ్బే! అదేం కాదండీ స్కూలు మాష్టరు"

"ఆహా! అలా చెప్పు. స్కూలు మాష్టరు కూతురువన్నమాట. అదే ఇందాకట్నుంచి అర్థంకాక చచ్చాను. అయినా పెళ్ళీ పెటాకులూ ఏవీలేకుండా ఆ తిరగడాలేంటమ్మా పెద్దవాళ్ళెవరూ నిన్నేం అనరా?" అంది నిష్టూరంగా.

సునీత ఈదాడికి తట్టుకోలేకపోయింది. విసురుగాలేచి బయటకు వెళ్ళిపోయింది.

సునీతతో ఇంతవరకూ ఆప్యాయంగా మాట్లాడిన పిన్ని ఇంతలోనే ఇలా ఎందుకు మారిపోయిందో అర్థంకాలేదు. "వెళ్ళొస్తానని" చెప్పాడు తను.

"మంచిదిబాబూ! ఆదివారం మాత్రం మరచిపోకు" అంది పిన్ని.

"రుసరుసలాడుతూ బుసలుకొడుతూ" స్కూటర్ పార్కు చేసినచోట నిల్చుంది సునీత.

"వెరీ సారీ! అనవసరంగా నావల్ల మాటలు పడ్డావు" అన్నాడు తను.

"నేను అందుకే రానని అన్నాను. చూశారా! మీరు ఏం ఫరవాలేదని లేసుకొచ్చారు. నావల్ల అనవసరంగా మా పెద్దాళ్ళకు మాటొచ్చింది. నన్ను బస్సు ఎక్కించెయ్యండి వెళ్ళిపోగలను" రాబోతున్న ఏడుపును ఆపుకుంటూ అంది సునీత.

"వెరీసారీ అని అన్నాగా! ఆవిడ పాలసీయే అంత 'మనుషులకు మనసు అనేది ఒకటుంటుందని అది సూటిపోటి మాటలకు బాధపడుతుందని' ఆమెకు ఇంత వయసొచ్చినా తెలిసిరాలేదు. అలాంటి వాళ్ళ మాటల్ని పట్టించుకోకూడదు" అన్నాడు తను నచ్చచెబుతూ.

తడిసిన రెప్పలల్లార్చుతూ అమాయకంగా చూసింది సునీత.

"పద బయల్దేరుదాం" అన్నాడు స్కూటర్ స్టార్ట్ చేస్తూ.

"ప్లీజ్! ఆవిడ చూసిందంటే మరింత గొడవ పెడుతుంది. నా మానాన నన్ను పోనివ్వండి. బస్సెక్కించేస్తే వెళ్లిపోతాను" అంది.

"ప్లీజ్! ముందు కూచో. తోవలో అన్ని విషయాలూ మాట్లాడుకుందాం"

సునీత వెనుక కూర్చుంది. "వర్షం వచ్చేలా వుంది" అంది.

బయలుదేరుతున్నప్పుడే ఒకటి రెండు చినుకులు పడ్డాయి. అవల్లా ఎక్కువై కొంతదూరం వచ్చాక వర్షం ప్రారంభం అయింది. తడుస్తూనే కొంతదూరం వచ్చారు. వర్షం తగ్గలేదు. కాగా రాను రాను హెచ్చవుతూనే వుంది. బాగాతడిసిపోయారు తామిద్దరూ. చుట్టుపక్కల తలదాచుకోడానికి 'షెల్టర్' ఎక్కడా కనిపించలేదు. "ఇదే కొంచెం నయం. కాస్సేపిక్కడ ఆగుదాం" అంటూ బాగా దట్టంగా ఆకులతోవున్న చెట్టుకిందకు స్కూటర్ పోనిచ్చి అక్కడ ఆపాడతను.

"ఇక్కడెందుకు ఆపారు? వెళ్ళిపోదాం" అంది సునీత.

"ఇంత వర్షంలోనా?"

"ఎలాగూ తడిసాం కదా? మరో పది నిముషాలు తడిస్తే, ఇంటికి వెళ్ళిపోవచ్చు కదా?"

"అంత బాధెందుకు? ఒక్క పది నిముషాలు ఇక్కడ ఆగితే వర్షం తగ్గొచ్చు కదా?" అన్నాడు కొంటెగా చూస్తూ.

"అందుకే నేను రానన్నాను. కాని మీరు వినిపించుకోకుండా బలవంతంగా లాక్కొచ్చారు, వికారుకంటూ. అదయి





పోయాక హోటల్ అక్కడ మీ పిన్ని గారిచేత వేడివేడి చీవాట్లు వేయించి, ఇక్కడికి తీసుకొచ్చారు. ఇక్కడ వర్షం చలీ బురదాను" అంది సునీత.

"ఏం? అంత చలిగా వుందా? ఆ గడ్డి మీద అలా కూర్చో!" అన్నాడు తను ఎదురుగా కూర్చుంటూ.

తడిసిన బట్టలు ఆమె శరీరంలోని వంపుల అందాల్ని దాచలేకపోతున్నాయి. అందులోనూ తెల్లటి బట్టలేమో! వంపులన్నీ మరింత స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ సంగతి గ్రహించి, ఆమె చెట్టుచాటుకు వెళ్లి శరీరాన్ని దాచుకో ప్రయత్నిస్తోంది.

అంత స్పష్టంగా స్త్రీ అందాల్ని తను ఎప్పుడూ చూడలేదు. హాస్పిటల్లోనూ, ఏనాటమీ ప్రాక్టికల్స్‌లోనూ చూసినా, అప్పుడిలాంటి అనుభూతి ఏం కలగలేదు. కాని ఇప్పుడు మనస్సంతా ఏదో తీయటి మత్తు పాకుతోంది. హృదయ స్పందన హెచ్చవుతోంది.

"అక్కడెందుకు? ఇలా ఇక్కడికొచ్చెయ్"

"అబ్బ! ఆఁ...ఛీ! మీరింత సిగ్గులేనివారని అనుకోలేదు"

తడిసిన అందాలు మనసును మరింత పూరిస్తున్నాయి. ఇంకా ఇంకా చూడాలనే కోరిక మనసును లాగేస్తోంది. "ఇలా వచ్చెయ్ సునీతా!" బతిమలాడ్తూ అడిగాడు.

"వూహూ!" బుర్ర అడ్డంగా తిప్పింది.

ఆమె కళ్ళలోని మెరుపునూ స్వచ్ఛతనూ నున్నటి శరీరాన్ని చూస్తూ అలా చాలా సేపుండిపోయాడు తను. ఆమె సిగ్గుతో ముడుచుకుపోతూ నేలచూపులు చూస్తోంది.

వర్షం ఇంకా వుధృతంగా కురుస్తూనే వుంది. ఆకులనుండి రాలుతున్న నీటి బిందువులు వంటిమీద పడుతున్నప్పుడల్లా వళ్ళంతా జలదరిస్తూనే వుంది. నీరు చిన్న చిన్న కాలువలుగామారి, పల్లంవేపు ప్రవహిస్తూ వుంది.

నేలవైపు అలా చూస్తున్నదల్లా ఒక్కసారి 'కెవ్వున' కేకవేసి భయంతో వొణికిపోసాగింది.

"ఏం జరిగిందంటూ" వెళ్లి ఆమెను పొదివి పట్టుకున్నాడు తను. భయంతో కౌగిలిలో ఒదిగిపోతూ, దూరంగా వున్న ఓ చిన్న కాలువవైపు చూపించింది.

తానామెను మరింత బిగువుగా కౌగిలిలో బిగించి అటువేపు చూశాడు. అక్కడ ఓ పాము నీటిలోనుండి బయటకు రావటానికి ప్రయత్నం చేస్తోంది. ప్రవాహపు వేగం దాన్ని తోసేస్తూవుంటే ఎక్కణ్నుంచో ప్రవాహంలో పడి కొట్టుకువస్తోంది.

"ఫర్వాలేదు. అదేం చెయ్యదు. దాని భయంలో అదుంది" కౌగిలి బిగిస్తూ అన్నాడు తను. ఆమె శరీరం అంతా తన కౌగిలిలోవుంది.

పిల్ల ప్రవాహం ఒక్కసారిగా పొంగి వచ్చినట్లయి ఆ పామును తనతోపాటుగా లాక్కుపోయింది.

సునీత శరీరం మెత్తగా వంటికి తగులుంటే మనసులో ఏదో తుఫాను చెలరేగినట్లు అనిపించింది. మత్తైన తీయటి బాధ నరనరాన విద్యుత్తులా ప్రవహిస్తూ, శరీరం మొత్తాన్ని కుదిపేస్తున్న హాయి... బరువైన శ్వాసతో హృదయం ఎగసి పడుతుంటే, ఉద్రేకంతో ఆమె ముఖం, మెడపై ముద్దులు పెడుతున్నాడు. సునీత వదిలించుకుంటూ ఆ బిగి కౌగిల్నించి తప్పించుకోటానికి ప్రయత్నిస్తోంది.

''ఛీ! ఛీ! ఇదేంపని...?వదలండి..ఛీ! ఏం మనుషులో'' అంటోంది.

"వదలను ... నా సునీతా! నిన్ను వదలలేను..ప్లీజ్! నన్ను పిచ్చివాణ్ని చెయ్యకు...నాకు అడ్డుచెప్పకు..." వదలకుండా ఆమెను నలిపేస్తున్నాడు తను.

"ఏమండీ! ఇదేంపని... మీకే చెప్తున్నాను...మర్యాదగా వదలండి...లేకపోతే కేకలేస్తాను. వదలండీ...బాబూ! ప్లీజ్ వదిలెయ్యండి. మీకు నమస్కారంచేస్తాను. నన్ను నాశనం చెయ్యకండి" అంటోంది.

అవేవీ తనకు వినిపించడంలేదు. ఏదో ఉద్రేకం వరదగోదారిలా తనను ఉక్కిరి బిక్కిరి చేసేస్తోంది. తడిసిన ఆమె తెల్లటి బ్లౌజ్‌లోంచి నిండుగా కనిపిస్తున్న భుజాలపై చేతులు వేశాడు. అక్కణ్నించి అలా వీపుపైకి, అక్కడ్నుంచి ఆమె పిరుదులమీదకు తనచేయి పాకింది.

వళ్ళంతా 'ఝల్లు' మంటూ ఏవేవో పులకరింతలు వళ్ళంతా అలముకో సాగాయి.

"ప్లీజ్! ఒక్కనిముషం...అలాగే వుండు...కాదనకు" అంటున్నాడు తను.

"ప్లీజ్! నన్నేం చెయ్యకండి...నాకెందుకో భయంగా వుంది" అంటోంది సునీత. క్రమంగా ఆమెలో ప్రతిఘటన తగ్గుతోంది...పారవశ్యం వళ్ళంతా అలముకోగా మొదట వదిలించుకుంటూ తోసివేస్తున్నదల్లా మూగగా, మౌనంగా అరితో...ఏదో తపనతో తన కళ్ళల్లోకి చూస్తూ వుండిపోయింది. అమె అదురుతున్న పెదవుల్ని అదమిపట్టాడు...

మత్తుగా కళ్ళు మూసుకుందామె. గాఢంగా ఆమె నుదురు, బుగ్గలపై వరుసగా ముద్దులు పెట్టాడు తను.

'ట్రాన్స్'లోంచి బయటపడిన దాన్లా "ప్లీజ్! అలాంటివేం వద్దు..." అంటూ కౌగిలిలోంచి బలవంతంగా విడిపించుకొంది. దెబ్బతిన్న పులిలా వున్న తనను బతిమాలుతూ ''ఇంకా మనకు పెళ్ళి కాలేదు...ఇకచాలు'' అంటూ లేచింది 'పదండి పోదాం' అంది.

"ఎలా వెళ్తావు? ఇంతసేపు ఆ చెట్టు చాటున అందాలన్నింటిని దాచుకొన్న దానివి...ఇంతలా ప్రేమించిన నాకైనా నీ అందాల్ని అందించకుండా దాచుకుంటున్న దానివి. త్రోవలో రోడ్డుమీద అందరికీ నీ అందాల్ని ఎగ్జిబిట్ చేసుకుంటూ పోతావా?" అన్నాడు తను ఆమెను ఆపుతూ.

"ఫరవాలేదు. ఇప్పుడు రోడ్డుమీద జనం ఎవరూ లేరుగా? అందులోనూ వర్షంలో పెద్దగా ఎవరికీ కనిపించే అవకాశం లేదు. మీ దగ్గరుండి అపాయాన్ని కొనితెచ్చుకునే బదులు, అదే మంచిది" అంది.

తను ఆమెచేయి వదల్లేదు. విసురుగా ఆమె చేతిని లాక్కోవడంలో తన చేతిలోంచి ఆమెచేయి జారిపోవడంతో నేల మీద పడిపోయింది. వళ్ళంతా బురద అంటుకొంది. 'ఓ! సారీ!' అంటూ చేయి అందించి ఆమెను లేపటోశాడు, ఆమె వంటిమీద అంటుకొన్న బురదను చేత్తో తుడిచెయ్య సాగాడు.

"చాల్లెండి..ముందాచెయ్యి తియ్యండి. అన్నీ వేషాలు" కొంటెగా నవ్వింది.

"దుర్మార్గుడ్ని...నీ వళ్ళంతా బురద చేసేశాను. నన్ను క్షమించు సునీతా! నా పాపానికి నేను ప్రాయశ్చిత్తం చేసుకో

వాలి" అంటూ ఆమె వంటిమీదనున్న బురదను వర్షంనీటితో కడిగెయ్యసాగాడు తను.

"చాల్లెండిబాబూ! చెప్పానుకదా! నేను తుడుచుకోగలను లెండి" అంది చిలిపిగా చూస్తూ.

"నావల్ల జరిగిన పొరపాటును నేనే సరిదిద్దుకోవాలి....అదీ ధర్మం"

"ఏం అవసరంలేదు"

"పోనీ! సగం బురదను నన్ను పంచుకోనీ" అంటూ ఆమెను కౌగలించుకున్నాడు తను. ఆమె బట్టలకున్న బురదంతా తన బట్టలక్కూడ అంటుకుంది.

"కష్టం... సుఖంలాగే... బురద కూడా సగం సగం.... నీకో సగం... నాకో సగం..." రాగంతీశాడు తను.

"పెంకి" అంటూ నవ్వింది.

"ఎలాగూ ఇద్దరి బట్టలూ బురదయిపోయాయి. కాస్సేపు ఇక్కడే ఈ పచ్చగడ్డిలో కూర్చుని కబుర్లు చెప్పుకుందాం" అన్నాడు తను.

ఒత్తుగా మొలిచిన గడ్డిలో కూర్చున్నారు తామిద్దరూ పిచ్చిగా మొలిచిన మొక్కలు తమను చాటు చేస్తున్నాయి.అలా కూర్చుని ఏవేవో కబుర్లు చెప్పుకోసాగారు తామిద్దరూ చలి చలిగా వున్న ఆ వాతావరణంలో ఆమె శరీరం తన శరీరానికి తగుత్తుంటే వెచ్చగా హాయిగా వుంది. గడ్డిలోకి జ్రరున జారి అమె ఒడిలో తలపెట్టుకొని పడుకున్నాడు తను.

వర్షం చినుకులు పైనుండి కళ్ళపై పడ్తుంటే తెరవటానికి సాధ్యం కావడం లేదు. ముఖంపై పడ్డ నీటిని తుడుచుకుంటూ కళ్ళకు చెయ్యి అడ్డంగా పెట్టుకొని ఆమె కళ్ళల్లోకి చూస్తున్నాడు తను.

"మనిద్దర్నీ ఇలా ఎవరైనా చూస్తే ఏమనుకుంటారో తెల్సా?" అంది చిరు కోపాన్ని ప్రదర్శిస్తూ.

"నిజమైన ప్రేమికులు అనుకుంటారు" అన్నాడు తను.

"కాదు పిచ్చివాళ్ళని" అంది.

"అదే ప్రేమ పిచ్చి వాళ్ళు"

"రజనీ నిజంగా నన్ను పెళ్ళి చేసుకుంటారా మీరు? మీపిన్నిగారి ధోరణి చూస్తుంటే ఆమెకు ఇష్టం వున్నట్టు అనిపించడం లేదు" అంది సునీత

"పెళ్ళి చేసుకునేది నేనా లేక మా పిన్నా? ఆభయం నీకేం అవసరం లేదు" అని భరోసా ఇచ్చాడు తను.

పదండి వర్షం తగ్గిపోయింది బయలుదేరండి" అంది సునీత.

ఓ నాలుగైదు కిక్కుల తర్వాత స్కూటర్ స్టార్ట్ అయింది. తామిద్దరితో పాటుగా రయ్యిన ముందుకు పరుగు తీసింది.

* * *

పాల్, రెడ్డి కేంటీన్‌లో కలిసారు "హలో! రజనీ! హౌఆర్‌యూ... హౌఈజ్ యువర్ జి.ఎఫ్?" అడిగారు.

తను తెల్లబోయే సరికి "అదే... జి.ఎఫ్ అంటే గర్ల్ ఫ్రెండ్" అన్నాడు పాల్.

"ఆరోజు! ఆ అమ్మాయి మీ రిలేటివ్ అని చెప్పావు కదూ! పాపం పార్కు దగ్గర నీకోసం చాలాసేపు వెయిట్ చేసింది గురూ! కంగ్రాట్స్" అన్నారిద్దరూ.

"ఎంతవరకూ వచ్చింది మీ ఎఫైరు. ఆ అమ్మాయి చాలా మంచిది గురూ! ఆరోజు మా అదృష్టం బావుంది నువ్వు సమయానికొచ్చావు. రక్షించావు. లేకపోతే కట్టుడు పళ్ళగతే మాకు పట్టివుండేది. చెప్పు తీసింది... హౌడేర్ షి ఈజ్"

అన్నాడు రెడ్డి.

తనకాక్షణంలో ఎంతో గర్వంగా అనిపించింది. వాళ్ళు చెప్తున్న దాంట్లో నూరుపాళ్ళ నిజం వుంది. తను రావడం ఏమాత్రం ఆలస్యం అయినా వాళ్ళన్నంత పనీ జరిగుండేదే. సునీతలాంటి అమ్మాయి ప్రేమ లభించడం నిజంగా తన అదృష్టం.

"కంగ్రాచ్యులేషన్స్ గురూ! ఒక అందమైన అమ్మాయి నిన్ను హీరోగా వర్షిప్ చేస్తున్నది నీకోసం పడిచస్తున్నదీ అంటే యూఆర్ మెరిటోరియస్! ఈ శుభ సందర్భంగా నువ్వు మాకో పార్టీ కొట్టించాలి"

"కరెక్ట్ గురూ! రెడ్డి చెప్పింది సెంట్ పర్సెంట్ కరెక్ట్... ఎప్పుడు పార్టీ?"

"ఎప్పుడో ఎందుకు? ఇప్పుడే ఈ బిల్లునే పే చేసేస్తాను" అన్నాడు తను.

"ఇదా? టీ పార్టీ... ఇదీ ఓ పార్టీయేనా? ఆడపిల్లల పార్టీ. మాకు కావలసిన పార్టీ వేరే వుంది. చెప్పరా రెడ్డీ" అన్నాడు పాల్.

"మన గురుడికి తెలీదేంటిరా. జోక్ చేస్తున్నాడు సరదాకి. ఇవ్వాళసాయంత్రం 'డాల్ఫిన్స్‌కి' వెళ్ళి పోదాంగురూ!" రెడ్డి.

వీళ్ళిద్దరి ప్రెజర్‌కు తట్టుకోలేక ఓకే అనేశాడు తను.

ఆరోజు రాత్రికి డాల్ఫిన్స్ హోటల్‌లో రెడ్డి, పాల్‌లకు తను ఓ బ్రహ్మాండమైన పార్టీ ఇచ్చాడు.

"సరదాగా అప్పుడప్పుడు మా రూమ్ కొస్తుండండి. ఎప్పుడూ అలా చదువుకుంటూ కూర్చుండి పోకుండా" అన్నాడు పాల్, సిగరెట్ ఆఫర్ చేస్తూ.

రెడ్డి తానా సిగరెట్టు తీసుకుంటాడా? తీసుకోడా అని చూస్తున్నాడు.

"తీసుకో గురూ! మరీ అంతలా సిగరెట్ కూడా కాల్చకపోతే జీవితంలో మజా ఏంవుంటుంది. మీరు కాబట్టి ఇంకా సిగరెట్.... మందూ లాంటి ఏ అలవాటు లేకుండా వున్నారు ... ఇవ్వాళ హోస్ట్ మీరు కాబట్టి అంత తేలిగ్గా వదిలేశాను. వచ్చే బుధవారం సాయంత్రం మా రూములో జరిగే పార్టీకి మీరు తప్పకుండా రావాలి" ఆహ్వానించాడు రెడ్డి.

'ఓకే' అన్నాడు తను. వీళ్ళు చాలా సరదా అయిన మనుషులు! ఎప్పుడూ ఏవేవో జోక్స్ కట్ చేస్తూ నవ్వుతూ నవ్విస్తుంటారు. ఇలాంటివాళ్ళ కంపెనీ చాలా సరదాగా వుంటుంది.

గుడ్‌నైట్ చెప్పుకుని అందరూ ఎవరిదారిన వాళ్ళు బయలుదేరారు.

* * *

అనుకున్న ప్రకారమే ఉదయం కారొచ్చి గేటుముందు ఆగింది.

"ఓహో! ఈరోజు ఆదివారం కదూ" అనుకుని గబగబా తయారయాడు.

కారు ఇంటిముందు ఆగగానే, పిన్ని, పిల్లలు లోపల్నుంచి పరుగెత్తుకువచ్చారు.

"పిల్లలందరూ పొద్దున్నే తయారయి నీకోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు రా...లోపలకు" ఆహ్వానించింది పిన్ని.

లోపల పేపరు చదువుకుంటోన్న నాన్నగారు "కులాసా నా!...నా!.... నీకోసమే ఎదురు చూస్తున్నాం" అన్నారు.

తను వరండాలోనే కూర్చోబోతుండగా పిన్ని "అయ్యో! అదేంటి? రా...రా... లోపలకొచ్చి కూర్చోబాబు!" అంటూ గదిలోకి తీసుకెళ్ళింది. దుర్గమ్మ, ఆమె భర్త ఎంతో ఆప్యాయంగా పలుకరించారు.

తను కూర్చుని అయిదు నిముషాలన్నా

కాలేదు. ఓ నాలుగైదు ప్లేట్లలో, స్వీట్సు నాలుగురకాల టిఫెన్స్ తీసుకొచ్చి పెట్టింది పిన్ని.

"ఇదేంటి పిన్నీ ఇన్ని పెట్టేశారు. ఇవన్నీ నేను తీసుకోగలనా? నా గురించి అనవసరంగా శ్రమ తీసుకున్నారు. నేను టిఫిన్ ఫుల్‌గా తీసుకునే వచ్చాను"

"శ్రమేం వుంది బాబూ! మాకు నువ్వేం పరాయివాడివా? ఇకనుండీ భోజనానికి ఇక్కడికే వచ్చేస్తూంటే సరి. హోటల్ తిండివల్ల ఆరోగ్యం పాడవుతుంది" అంది పిన్ని.

"నేను వట్టి 'టీ' మాత్రం తీసుకుంటాను. బైట డ్రైవర్ వున్నాడు అతనికి ఇవన్నీ పెట్టెయ్యండి" అన్నాడు తను.

"లేదు బాబూ! ఇవి నువ్వు తీసుకోవాల్సిందే. డ్రైవర్‌కు పంపిస్తున్నాను కొంచెం అలా అలా ఎంగిలిచేసి వదిలేస్తుండు..నువ్వేమీ తినకపోతే నామనస్సేం బావుండదు" బలవంతం చేసింది పిన్ని.

తను కొంచెం .... అలా తీసుకొని వదిలేశాడు.

కారుచుట్టూ మూగివున్నారు ఆ వీధిలోని పిల్లకాయలు. "మా కారు ముట్టుకోకు" అంటూ వాళ్ళను దెబ్బలాడ్తోన్న చెల్లాయిలు కిటికీలోంచి కనిపిస్తున్నారు.

ఎవరో నలుగురైదుగురు ఆడవాళ్ళు పేరంటానిక్కాబోలు, పట్టుచీరలు, మెడనిండా నగలతో వచ్చారు. గుమ్మం దగ్గర్నుంచి లోపలకు తొంగి తొంగి చూస్తున్నారు.

పిన్ని వెళ్ళి వాళ్ళని ఆహ్వానించింది. "రండి ... రండి ... ఇలా లోపలకు వచ్చెయ్యండి. ఫరవాలేదు. ఇలా వచ్చి కూర్చోండి." సోఫాలో కూర్చోబెట్టింది.

"ఈయనే మా పెద్దబ్బాయి. డాక్టరు. రాయపురంలో లక్షలకొద్దీ ఆస్తి వుంది. ఆకారు అదీ ఆయనదే..." అంటూ తన గురించి వాళ్ళదగ్గర ఏవేవో చెప్పేస్తోంది.

అలా మాట్లాడుతున్నదల్లా తన దగ్గర కొచ్చింది.

"బంగారమ్మగారి అమ్మాయి వుంది బాబూ! లక్షరూపాయల వరకూ కట్నం ఇస్తారట. ఆడపడుచుల కట్నంకింద చెల్లాయిలు ముగ్గురికీ తలో ఎనిమిది వేలు. అమ్మాయి బంగారబ్బొమ్మలా వుంటుంది. ఆ ఎదురింటి ఇంజనీర్‌గారి భార్యా ఈ సంగతి తెలిసినప్పట్నుంచీ తినేస్తుందనుకో రెండు లక్షల కట్నం, ఆడపడుచులకు తలా పదిహేనువేలు" అంటూ "కాని అమ్మాయి కొంచెం ఛాయ తక్కువ. వీళ్ళమ్మాయి అయితే దబ్బపండుఛాయతో చాలా అందంగా వుంటుంది" అంది.

గుమ్మం గుండా ఎదురింటివైపు చూశాడు తను. ఓ అయిదారుగురు ఆడవాళ్ళు, మగవాళ్ళు, వాళ్ళ గుమ్మంలోంచి...తొంగి తొంగి చూస్తూ ఏవేవో అనుకుంటున్నారు.

నువ్వు 'వూ'అను. వచ్చే ఆదివారం ఇక్కడే పెళ్ళిచూపులకు ఏర్పాటు చేసేస్తాను. లేదా మనమే వెళ్ళి చూసొచ్చేద్దాం... ఏమండీ! ఏం అంటారు? మిమ్మల్నే! మాట్లాడరేం?" అంది పిన్ని నాన్నగారితో. ఆయన తలూపారు దేనికో?

"ఒక్క వారంగాని నువ్విక్కడ వున్నావంటే, కార్లో వెళ్ళి రోజుకో సంబంధం చొప్పున చూసుకువచ్చెయ్యొచ్చు... లేదా ... ఓ పదిరోజులు మొత్తం వుంటే సంబంధాలు అన్నీ చూసెయ్యడం పూర్తవుతుంది. వాళ్ళం




దరూ నన్ను క్లబ్బులో తినేస్తున్నారు" అంది పిన్ని.

పిన్ని మాటలకు నవ్వాలో ఏడవాలో తెలిడం లేదు.




'ఏంటి ఈ తుఫానేంటి? ఇంకా తను చదువు పూర్తి చెయ్యనేలేదు. పెళ్ళికి ఇప్పుడంత తొందరేంటి?' అదే పిన్నితో అనేశాడు. "ఇంత తొందర్లో పెళ్ళి చేసుకునే ఉద్దేశం నాకు లేదు పిన్ని. ఈ చదువు అంతా పూర్తికావాలి ... కట్నం మీద అసలు నాకు ఆశలేదు. నేను కట్నం తీసుకోకుండానే పెళ్ళి చేసుకుంటాను. ఇక ఏ సంబంధంచూడమని నన్ను అడగొద్దు" అన్నాడు తను.

పిన్ని ముఖం మాడ్చుకుంది.

"పోనీ మాట్లాడుకుని వుంచేద్దాం. చదువయ్యాకే పెళ్ళిచేసుకుందువుగాని" అన్నారు నాన్న.

"ఇప్పుడప్పుడే నేనేం చెప్పలేను. అలాంటి ప్రపోజల్సు ఏవీ పెట్టకండి"

"సరే నీ యిష్టం" అంది పిన్ని తనతో.

నవ్వుకుంటూ వాళ్ళదగ్గరకెళ్ళి ఇప్పుడు రావటానికి అబ్బాయికి టైము లేదట.... పరీక్షలు అవీ అంటున్నాడు. బోలెడన్ని సంబంధాలు వచ్చి పడిపోతున్నాయి. అవన్నీ చూడటానికే టైము చాలడం లేదు. ఇంకా కొత్త సంబంధాలు ఎందుకు చూస్తున్నావంటున్నాడు. నేను నెమ్మది మీద తేదీ నిర్ణయించి కబురుచేస్తాను" అంది పిన్ని. వాళ్ళందరూ వెళ్ళిపోయారు.

"ఏంటే బోడిపెత్తనాలు అన్నీ చేస్తున్నావు. అబ్బాయితోగాని, నాతోగాని ఓ మాటన్నా చెప్పకుండా సంబంధాలు చూసేస్తున్నావు" కోప్పడ్డారు నాన్న.

"నన్నేం చెయ్యమంటారు చెప్పండి. ఏదో మాట వరసకు 'మా అబ్బాయి డాక్టరు చదువుతున్నాడు.వాళ్ళ తాత ఆస్తి వాడికికలిసొస్తోంది....బోలెడన్ని తోటలు, భూములు పెద్ద బంగళా' అని చెప్పేసరికి వచ్చి పడిపోతున్నారంతా. "మా అమ్మాయిని చూడండంటే మా అమ్మాయిని చూడండి" అని! అబ్బబ్బ! వీళ్ళతో వేగలేకపోతున్నాను బాబూ" అంది పిన్ని సమాధానంగా.

"చూదొచ్చులే! అప్పుడే ఏంతొందర అబ్బాయింకా చదువుకుంటున్నాడుకదా" అన్నారు నాన్న.

చెల్లాయిలు ఎంతో ఆప్యాయంగా వచ్చి తన దగ్గరే కూర్చుని "అన్నయ్యా" అంటూ నోరారా పిలుస్తూ ఎన్నెన్నో కబుర్లు చెప్తున్నారు.

"నీ పెళ్ళికి మాకు అవపడుచుల కట్నాలు అవీ వస్తాయిట...నువ్వు మాకు మంచి మంచిబట్టలుకుట్టిస్తావట. తొందరగా పెళ్ళి చేసేసుకో అన్నయ్యా!" అంటు న్నారు చెల్లాయిలు. తనకెంతో బాధని పించింది. 'పిళ్ళ వయస్సులెంతెంతేసని? అప్పుడే ఇంతలేసి మాటలు మాటాడేస్తు న్నారు' అనిపించింది.

"అలా అనకూడదమ్మా! కట్నాలు వాటి గురించి డిమాండ్ చెయ్యకూడదు. నాకు ఒక్కడికి కట్నం పుచ్చుకుంటే మరి రేపు నాన్నగారు మీ గురించని మూడు కట్నాలు తిరిగి ఇవ్వాలికదా" అన్నాడు తను.

"ఆ కట్నాలు అవీ నాన్నగారు ఇవ్వరుకదా! మీరే ఇస్తారుకదా! మీకు బోలెడంత డబ్బు ఉంవటగా. మీరు డాక్టరైనాక బోలెవంత సంపాదిస్తారట కదా?"

నవ్వుకున్నాడు తను ... "ఇవన్నీ మీకెవరు చెప్పారు?" అన్నాడు

మధ్యలో కలుగజేసుకొని పిన్ని అంది. "అప్పుడప్పుడూ వస్తుండు బాబూ! పోనీ పూర్తిగా ఇక్కడికే వచ్చేయ కూడదూ. నీకని సెపరేట్‌గా పెద్ద గది వేరేగా వుంచేస్తాను" అంది.

"నీకెందుకు పిన్నీ! అనవసరశ్రమ నేను మధ్యలో ఎక్కడికైనా మారిపోతే ఆ అమృతవల్లిగారు బాధపడతారు"

"ఆవిడెవరో బాధపడుతుందని అక్కడుంటున్నావా? ఆవిడేమన్నా నిన్ను కందా? పెంచిందా? ఏదో నువ్వు వాళ్ళ పిల్లలకు ప్రయివేట్ చెప్తున్నావని ఇంత ముద్ద పడేస్తుంది" అంది పిన్ని. దుర్గమ్మ ఆ మాటకు వత్తాసు పలికింది.

"నాకు అక్కడే బావుంది పిన్నీ. చదువు బాగా సాగుతుంది. మరోలా భావించకండి. ఇక నే వెళ్ళొస్తాను. అక్కడ నాకోసం అందరూ ఎదురు చూస్తూ ఉంటారు" అని చెప్పి బయలు

 

దేరాడు తను.

'ఒకప్పుడు తన వాసనంటే పడని వీళ్ళందరూ ఇప్పుడు తనంటే ఎక్కడ లేని ఆప్యాయతల్ని ఒలకబోస్తున్నారు. రక్త సంబంధాన్ని, అనుబంధాల్ని అన్నింటినీ మించిన బంధం ఈ 'డబ్బు బంధం' దేవుడనేవాడు ఉన్నాడోలేడోగాని ఈ డబ్బున్నవాడే దేవుడవుతున్నాడు. ఆఖరికి దేవుడనేవాడికికూడా మడులు, మాన్యాలూ ఆదాయం, ఆభరణాలు, అలంకారం లేకపోతే విలువఉండదు. మహత్యం, ప్రచారం ప్రజాదరణ కూడా ఉండదు, అన్న ఆలోచనతో ఈ లోకపు తీరుకు నవ్వొచ్చింది తనకు.



రాయపురంలో మావయ్య చూపిస్తున్న అభిమానం, ఆదరణ, మమత,చూపుతున్న ఆప్యాయత తనను మరో ప్రేమమయమైన ప్రపంచంలోకి తీసుకుపోతోంది.

భోజనాలు అయేక మధ్యహాలులో అందరూ కూర్చున్న సమయంలో మావయ్య ప్రారంభించారు.

"రజనీ! డబ్బనేది రెండువైపులా పదునున్న కత్తిలాంటిది. డబ్బుతో ఎన్ని రకాల సుఖాలు అనుభవించవచ్చో, అన్ని రకాల ఆపదల్ని ఎదుర్కొనవలసి వుంటుంది డబ్బుతోపాటే దర్పం, అహం మనకు తెలీకుండానే మనలో చోటు చేసుకుంటాయి. ఈడబ్బు ఆస్తి....అంతస్తులు ఏవీ శాశ్వతాలు కావు. శాశ్వతంగా నిలిచిపోయేవి ప్రేమానుబంధాలు, మమతానురాగాలు మాత్రమే"

"మీ అమ్మ ఎంత నిండు కుండను కున్నావు? ఆమె ఆత్మాభిమానం ముందు ఎవరైనా సరే జోహారు చేయవలసిందే. మీనాన్నగారి మీద ప్రేమతో ఇన్ని లక్షల ఆస్తిని...ఇంత మంది బంధుగణాన్ని లెక్కచేయకుండాతేలిగ్గా తృణీకరించి వెళ్ళిపోయింది. ఆమె ప్రేమలో అంతత్యాగం అంత పవిత్రత వున్నాయి" అంటున్న మామయ్యకంఠం రుద్ధమైంది.

మావయ్య కుర్చీలోనే చేరబడి, ఎటో చూస్తూ అమ్మ తలపులలోకి వెళ్ళిపోయారు.

కొంతసేపయాక ఎవరి గదుల్లోకి వారు వెళ్ళిపోయారు.

* * *

తానుంటోన్న రూముకు పిన్ని రాకపోకలు హెచ్చయ్యాయి. వచ్చినప్పుడల్లా ఏవేవో సంబంధాల గురించి చెప్తూ వుండేది. మావయ్య కారు హెచ్చుగా పిన్ని వాడకంలోనేవుండేది.అప్పుడప్పుడు పెట్రోలు అయిపోయినప్పుడు మాత్రం తన దగ్గరకు వస్తుండేది. తనకు స్కూటరుంది కాబట్టి పెద్దగా అవసరం అవుతుండేది కాదు. ఆదివారాలు మాత్రం తను ఆ కార్లో రాయపురం వెళ్ళివస్తుండేవాడు. పట్టు చీరలు, నగలు నిండా వేసుకుని కార్లో లేడీస్‌క్లబ్ మీటింగ్స్‌కు, పెళ్ళి సంబంధాల పేరుతో అమ్మాయిలను చూడటానికి వెళ్ళి వస్తూ అమ్మాయిల తరపు వారి సకల మర్యాదల్ని అందుకుంటూ హోదా వెలగ బెడుతుండేది. ఆవిడతో పాటే దుర్గమ్మ, ఆమె భర్త బైరాగిరావులు

తన ఆశయాభిలాషలు అయిపోయారు. తన రూముకు అప్పుడప్పుడు స్వీట్సు చేసి పంపుతుండేది. తను వాళ్ళింటికి వెళ్ళినప్పు డల్లా పిల్లల కోసమని బట్టలు అవీ తీసు కెళ్తుండేవాడు.

సునీతకు ఎన్ని రకాల బహుమతుల్ని ఆఫర్ చేసినా తీసుకునేది కాదు. నగల షాపులో తను సెలక్ట్ చేసిన రవ్వల నక్లెస్, పట్టుచీరలు ఇవేవీ తనకవసరం లేదంది. "మీ ప్రేమ ఒకటిచాలు నాకు, అది మాత్రం ప్రెజెంట్ చేస్తుండండిచాలు" అంది.

ఆత్మ గౌరవం, ఆత్మాభిమానం కన్నా మనిషికి కావలసిందేముంటుంది. అవి మెండుగా వున్న సునీత అంటే అందుకే తనకంత గౌరవం...ప్రేమ.

ఓ రోజు "రాయపురం వెళదామా" అని అడిగాడు తను.

"తర్వాత ఎలాగూ రావాల్సివుంది కదా?" అని తప్పించుకుంది సునీత.

* * *

చేతిలో డబ్బు బాగా ఆడుతుండటంతో జల్సాగా ఖర్చుచేయడం అలవాటయింది. ఫ్రెండ్స్ సర్కిల్ కూడా పెరిగింది. రెడ్డి, పాల్ ల రూముకు అప్పుడప్పుడు వెళ్ళొ స్తున్నాడు తను. ఆదివారాలు రాయ పురంలో గడిచిపోతున్నాయి. మిగిలిన రోజుల్లో అప్పుడప్పుడు వాళ్ళ రూములో పేకాట పిచ్చాపాటి కబుర్లు, షికార్లు, సినిమాలు, అప్పుడప్పుడు పార్టీలకు అటెండ్ అవడం జరుగుతోంది. 'ఒరే' అని పిలుచుకోవడం వరకూ చనువు పెరి గింది. ఓ పది రోజులపాటు తను రాయ పురం, ఆటూఇటూ తిరగాల్సొచ్చింది. మావయ్య ఆస్తి తనపేర రిజిస్టర్ చేయించాడు. ఆ సంగతి వీళ్ళతో చెప్పాడుతను. రెడ్డి పాల్ ఇద్దరూ 'కేబరే డాన్సులకు వెళ్దామన్నారు. నువ్వు బ్రహ్మాండమయిన పార్టీ ఇవ్వాలి కదా.... కేబరేకు వెళ్ళిపోదాం అన్నారు.

ముందు తను "అలాంటి చోటుకు రాను" అని అన్నాడు. తరువాత వాళ్ళ ద్దరి బలవంతం మీద "సరే" అన్నాడు.

ఆ తర్వాత వాళ్ళు మరో ప్రోగ్రాం ఫిక్స్ చేశారు. "అక్కడ్నుంచి అలా ఏ లైనా లాడ్జికి వెళ్ళిపోదాం" అన్నారు.

"కేబరేకు వస్తాను. మందు తీసుకోను లాడ్జికి మాత్రం రాను" అన్నాడు తను.

"అదేం కుదరదు రావాల్సిందే. సర దాగా ఫిక్స్ చేసిన ప్రోగ్రాంను మార్చ కూడదు. అందులోనూ హోస్టువు నువ్వు రాకపోతేఎలా?" అన్నారు.

"పదరా! సరదాగా వెళ్ళి వచ్చేద్దాం. లాడ్జికి మంచి ఫస్టుక్లాసయిన అమ్మాయిల్ని ఎంచుకుని తీసుకెళ్ళొచ్చు" అన్నాడు రెడ్డి.

రెడ్డి ఆహ్వానంలో తీయటి ఆకర్షణ వుంది. కాని మనసు మాత్రం అందు కంగీకరించడం లేదు. అందుకే అంతలా సంశయిస్తున్నాడు. మరికొంత సేపు ఆలోచించి "నేను రాన్నా! మీ ఇద్దరూ వెళ్ళి వచ్చెయ్యండి" అన్నాడు తను.

"వస్తానంటాడు కదాని" ఆశపడ్డ రెడ్డి, పాల్ ఇద్దరికీ నిరాశే ఎదురయింది.

"మన ఫ్రెండ్స్ అందర్లోకీ వీడేరా విలో ఏవరేజ్ ఫెలో! ఒక సరదా అనడు ఒక సుఖం అనడు. ఆ సునీత నామ స్మరణం చేసుకుంటూ కూర్చుంటాడు. ఏమైనా అంటే, ప్రేమించానంటాడు. నిన్నెవడు ప్రేమించవద్దని అన్నారోయ్! ప్రేమించు. నేనూ ప్రేమిస్తాను నా పెళ్ళాన్ని..అవన్నీ ఇంటిదగ్గరే! అలాంటి పర్మినెంటు ప్రేమల్ని, స్టూడెంట్సు

## సెప్టెంబరు విడుదల!




### శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్

విజయవాడ - 520002

ఫోన్ : 63322

బుర్రలో పెట్టుకో కూడదు. పరీక్షలు అయి ఇంటికెళ్ళాక, అప్పుడు తిరిగి పెళ్ళాన్ని ప్రేమించడం ప్రారంభిస్తాను. అప్పుడెలాగూ తప్పదు. ఇంట్లో ముసలాళ్ళూరుకోరు. "మనవడ్నెప్పుడు ఇస్తార్రా?" అంటూ ప్రాణాలు తీస్తారు. అందులోనూ మనచుట్టూవున్న మనుషులు 'వీడు పెళ్లాన్ని సరిగ్గా చూట్టంలేదు, వీడు అక్కడాఇక్కడా తిరిగి చెడిపోతున్నాడు' స్టాంపు గుద్దేస్తారు. కాబట్టి పెళ్ళాన్నిగాని ప్రేయసినిగాని ప్రేమించడం మానకూడదు. దానిపని అదే మన పని మనదే!" అన్నాడు పాల్.

వాడి మాటలకు నవ్వొచ్చింది. "చెడిపోయిన వాడిగా నీకెన్ని స్టాంపులు పడ్డాయిరా?" అడిగాడు తను.

"నవ్వాద్రోయ్! అంతే! కొంచెం కొంచెంగా దార్లో పడుతున్నాడన్న మాట. మస్తుగా డబ్బున్న నాలాంటివాడికి చెడిపోయాడని స్టాంపు వెయ్యటానికి ఎవడికన్నా ఎన్ని గుండెలుండాలిరా? ఈ డబ్బున్న వాళ్ళు ఏంచేసినా ... ఎన్ని చేసినా చెడిపోరు. వాళ్ళ నీతి నిజాయితీల గురించి ఎవరూ పట్టించుకోరు" అన్నాడు రెడ్డి.

"ఒకవేళ చెడిపోయినవాడని అనాలంటే, నిన్నూ నీలాంటి అమాయకపు పక్షుల్ని అంటారు. ఎందుకంటే ఏ తప్పు పని చేయటానికి నీకు ధైర్యం లేదు. అలాంటిది ఏదయినాచేస్తే మీ బాబు, మీ అమ్మ....సారీ! మీ పిన్ని ఇద్దరూ గోలెడతారు. "పాడయిపోతున్నావురా! కొడకా" అంటూ. కాని నాకు అలా కాదు. నేను తాగనీ, తిరగనీ మా డాడీ ఏమీ అనడు. చూసీ చూడనట్లు ముఖంతిప్పుకొని వెళ్ళిపోతాడు" అన్నాడు రెడ్డి.

"కొత్తవాడివి గనుక కొత్త అమ్మాయిని అప్పచెబుతాం. రాత్రంతా హాయిగా ఎంజాయ్ చెయ్యొచ్చు" అన్నాడు పాల్.

"ఒరే! అది ఎంజాయ్‌మెంటా?..." కోపంగా అన్నాడు తను.

"హ హ హ" నవ్వారిద్దరూ.

"అవునొరే! నువ్వింకలా మడి కట్టుకొని కూర్చుండిపోవడంఏంబాగోలేదు" అన్నాడు పాల్.

"కొంచెం సాయం పట్టండ్రా ... వీడిలాకదిలేలాలేడు...''

"నన్నొదిలెయ్యండ్రా! బాబో" అని గోలెడుతున్నా వినిపించుకోకుండా "ఛ! నోర్మూయ్! వెధవా! రేపోమాపో పెళ్ళి చేసుకుని బోనులో దూరబోతున్నావు. పెళ్లాం ఆడించే సర్కస్ ఆటంతా ఆడాలి. ఇప్పుడే ఏ సరదా అన్నా తీర్చుకోవడం" అంటూ లేవనెత్తినడిపించారు తనను.

"దేన్ని ఒక్కటే చూసి రూము కొచ్చేస్తాను.ఆ తర్వాత మీరెలా ఏడుస్తారో ఏడవండి" అన్నాడు తను.

"సర్లే! పద! ఎవరి ఏడుపు వాళ్ళే ఏడుద్దాంలే" అన్నారిద్దరూ.

టేక్సీ హోటల్ 'సోనీ' ముందు ఆగింది. ఎంట్రన్సు దగ్గర నీట్‌గా తెల్లటి సూటులో వున్న దర్వాన్ గ్లాస్‌డోర్ తెరచి పట్టుకొని మర్యాద పూర్వకంగా ఆహ్వానిస్తూ వంగి నిల్చున్నాడు.

తను, రెడ్డి, పాల్ ముగ్గురూ లోపల ప్రవేశించి, కేబరే జరుగుతోన్న హాలులో అడుగు పెట్టారు. వైట్ యూనిఫాంలో వున్న వెయిటర్ తమను రిసీవ్ చేసుకుని, రిజర్వ్‌చేసి వుంచిన సీట్లలో కూర్చోపెట్టాడు.

పాప్ మ్యూజిక్ మంద్రంగా హాయి

గొల్పేలా వినిపిస్తోంది. 'డిమ్'లైటు వెలుగులో కేబరే జరుగుతోంది. అర్ధ నగ్నంగా వున్న కేబరే డాన్సర్ వయ్యారాలు వొలకబోస్తూ వంపులు ప్రదర్శిస్తూ వంటిపై వున్న బట్టల్ని ఒక్కొక్కటిగా విడిచేస్తూ డ్యాన్స్ చేస్తూనే ప్రతి ఒక్కరి సీటు దగ్గరకు వచ్చి, పలుకరిస్తూ వాళ్ళ చేతుల్లోని గ్లాసులు లాక్కుంటూ, ఎంగిలిచేస్తూ, తిరిగి వాళ్ళకు అందించి వెళ్ళిపోతోంది.

రెడ్డి ఆర్డరిచ్చిన విస్కీ టేబుల్ పైకి రాగానే, ఇదేంటి అన్నట్టుగా చూశాడు.

"ఛీర్స్" చెప్తూ చెరొక గ్లాసు తీసుకున్నారు రెడ్డి, పాల్. తీసుకొమ్మని సైగ చేశారు తనకు.

"లేసుకోరా బాబూ!" తొడమీద చరిచాడు పాల్.

"యూ మస్ట్ టేకిట్" ఆర్డర్ పాస్ చేసి, గ్లాసును రజనీ చేతిలో పెడ్తూ, రెడ్డి.

డ్యాన్స్ చేస్తూనే ఇదంతా గమనిస్తోంది క్యాబరే డాన్సర్. రెడ్డి చేసిన సైగను అందుకొని, తన వెనుకకు వచ్చి పైకి వంగి, చేతిలోవున్న గ్లాసును అందుకొంది.

భుజాలకు మెత్తగా తగులుతున్న ఆమె గుండెపై ఎత్తులు. వంటికి రాసుకొన్న లవండర్ వాసన, నోటినుండి మల్లెపూల వాసన కొడుతున్న 'జిన్' తనను మత్తులోకి లాక్కెడుతున్నాయి. గ్లాసులోని విస్కీని కొంచెం 'సిప్' చేసి, పెదవులకందించింది. గ్లాసులోని ద్రవం కొంచెం అప్రయత్నంగానే గొంతులోకి జారింది.

తాగిన క్షణంలో ... గొంతుకలో మండినట్టు అనిపించింది. కాని కలుగుతున్న స్పర్శాసుఖం, మైకంలో అదేం అంత పెద్దగా పట్టించుకోవలసినదాన్లా అనిపించలేదు.

ఇదంతా చూస్తూ రెడ్డి నవ్వుతున్నాడు.

కేబరే డాన్సర్ తన దగ్గరకు రాగానే, ఆమె ముఖాన్ని దగ్గరకులాక్కుని ముద్దు పెట్టుకున్నాడు రెడ్డి. ఆమె చేతికో నోటు విలాసంగా అందించాడు.

ఆమె ఓసారి డ్యాన్స్ చేస్తూ, టేబుల్స్ అన్నీ ఓ చుట్టుచుట్టి వచ్చి, తనపై దాదాపుగా వాలిపోయి, రెడ్డి ముందున్న గ్లాసులోని ద్రవాన్ని కూడా తాగించింది.

ఆమె మెత్తటి శరీరం మత్తుగొలుపుతూ వుంది. ఆమె చూపులు కైపెక్కిస్తున్నాయి. ఆమె పెదవులు అందుకొమ్మని వత్తిడి తెస్తున్నాయి. అలాంటి తీయటి బాధను తనెప్పుడూ చవిచూడలేదు.

గ్లాసులోని ద్రవం..కొంచెం కొంచెంగా గొంతునుండి కిందకు జారుతోంది. శరీరానికి క్రమంగా మత్తెక్కుతోంది. రెప్పలు బరువుగా కిందకు వాలిపోతున్నాయి.

మరో మూడు గ్లాసులతో విస్కీ సెర్వ్ చేశాడు బేరర్.

కేబరే డాన్సర్ సన్నగా, నాజూగ్గా, అందంగా వుంది. ఆమె వంపులన్నీ ఆచ్ఛాదనలోంచి బయటికే తొంగి చూస్తున్నాయి. పేరుకే ఆ ఆచ్ఛాదన. విల్లులా వంగుతూ, హుషారుగా చలాకీగా కదుల్తూ నాట్యం చేస్తోంది. ఈసారైతే వళ్ళోకే వాలిపోయి తన గ్లాసులోని విస్కీని తాగించింది. ఆమెను కాదనడం తనకి సాధ్యం కావడంలేదు.

ఆమె టర్న్ అయిపోగానే మరో డ్యాన్సర్ వచ్చింది. ఆమె కూడా నాట్యం చేస్తూ వంటిమీద బట్టల్ని ఒక్కొక్కటిగా విప్పి పారేస్తోంది. ఆమె దగ్గరకు రాగానే చెయ్యి పట్టుకొని లాగాడు తను.

ఆమె సున్నితంగా వారిస్తూ చేయి విడిపించుకొని కవ్విస్తూ వెళ్ళిపోయి డ్యాన్స్ చేయసాగింది.

ఆమె వెళ్ళి పోతుంటే స్వర్గంనుంచి జారిపడ్డ వాడిలా బాధపడ్డాడు. ఆ వాతావరణం అంతా ఎంతో బాగుంది తనకి. కాబరే డ్యాన్సర్ వంటిమీద గుడ్డల బరువు తగ్గించుకుంటుంటే బయట పడుతున్న అందాల్ని చూస్తూ...ఇంకా దేనికోసమో వెతుకుతున్న వాడిలా చూపుల్ని ఆమె వంటిపైనుండి జారిపోనీయకుండా చూస్తున్నాడు.

టేబుల్స్ చుట్టూ కూర్చుని డ్రింక్ చేస్తున్న వారిలో ఉత్సాహవంతులు కొంత మంది ఆనందాన్ని పట్టలేక నోట్లు తీసి ఆమె పైకి విసురుతున్నారు. ఆమెను అందుకోవటానికి ప్రయత్నం చేస్తూంటే ఆమె చాకచక్యంగా దొరక్కుండా తప్పించుకు పోతోంది. కొంతమంది పైకిలేచి, మత్తుతో జోగిపోతూ, ఆమెను దగ్గరకు రమ్మని బతిమాలుతూ నమస్కారాలు పెడుతుంటే కొంతమంది ఈ సారి దగ్గరకు రాగానే వదలకూడదని సరి పెట్టుకుంటున్నారు. దాదాపుగా అందరూ నిషాలోకి జారిపోయి తూలుతూ, పేలుతూ వున్నారు.

అంతవరకూ అది తన వూహకు కూడా అందని పరిచయం లేని కొత్త ప్రపంచం.విచిత్రలోకం.మురిగి పోతున్న డబ్బును విసిరి ఆనందాన్ని జుర్రుకో వాలని ఆరాట పడే వ్యక్తులలోకం అది.

ఆమె వెళ్ళిపోయింది. కొంత విరామ సంగీతం తర్వాత, మరో డ్యాన్సర్ వచ్చింది. ఈమె అర్ధ నగ్నంగా లేదు. వంటినిండా బట్టలతోనే వుంది. ముఖం అంతా కురులతో కప్పేసుకుంది. డ్రస్ మాత్రం మోడరన్‌గానే వుంది. డ్యాన్స్ మాత్రం కేబరే డ్యాన్సు కాదు.

"ఇదెవర్తో కొత్తగా వచ్చినట్లుంది. ఇదేం కేబరే! ముసలమ్మలా వళ్ళంతా కప్పేసుకుంది. ఇంకా లైన్లో పడనట్టుంది"

"పయాస్ దిగి రావడంలేదు... మన దగ్గరకురాదను కుంటాను"

రకరకాల వ్యాఖ్యానాలు బయలు దేరాయి. కొంతమంది ఆసక్తిగా చూస్తుంటే మరి కొంత మంది అసంతృప్తిని వ్యక్తం చేస్తున్నారు.

బేరర్ మరో మూడు పెగ్గుల బ్రాందీ సెర్వ్ చేశాడు.

"ఈసారి ఎవరూ చెప్పకుండానే అప్రయత్నంగా ఆ గ్లాసును అందు కున్నాడుతను. మధ్యమధ్య చిప్సు తింటూ సిగరెట్ కాలుస్తూ సిప్ చేస్తోన్నాడు.

ఈ డ్యాన్సు వింతగా కనిపించింది తనకి.అలంకరణ అంతా మోడరన్ స్టైల్. డ్యాన్సు మాత్రం శాస్త్రీయం. మ్యూజిక్ మధ్య ఎనౌన్స్‌మెంటు వినిపించింది.

"న్యూలీ ఇంట్రడ్యూసింగ్ ! రైనా ఫ్రమ్ బొంబే!"

ఆమెవైపు అలా చూస్తున్న వాడల్లా ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు. ముఖం కనిపించడం లేదు గనుక పోలిక దొరకడం లేదు. కాని ఆమె ఎత్తు... శరీరపు రంగు నడకలతో తనకి బాగా పరిచయం వున్నట్టనిపిస్తోంది.

కురుల మాటున ముఖం దాచుకున్న ఈమె ఎవరై వుంటారు. ఎవరైనా కానీ! ఈమె మాత్రం తనకు బాగా పరిచయం వున్న వ్యక్తి... రైనా...ఫ్రమ్ బొంబే.. తను బొంబే వెళ్ళలేదు మరి ఎక్కడ చూసినట్టు? అనుకున్నాడు

గుండె వేగం హెచ్చింది. మనసు




ఆరాటపడుతోంది. ఎంతో అసహనంగా వుంది.

డ్యాన్స్ జరుగుతోంది. వాయిద్యాల హోరు ఘోరంగా, కర్ణకఠోరంగా వున్నట్టు, చాలా చికాకు కలిగిస్తోంది.

"ఆమె కిందకు ఎప్పుడు దిగుతుందా" అని చూస్తున్నాడు.

కాని ఆమె కిందకు కస్టమర్స్ మధ్యకు దిగిరావడంలేదు.




ఆమె ఎవరు? ఎవరు? ఆమెను మాత్రం తను ఎక్కడో చూడటం జరిగింది. మనసు పీకుతోంది. సస్పెన్సుతో మనసులో ఏదో ఉద్వేగం. భరించలేక ఒక్క ఉదుటున లేచాడు. ఒకేఒక్క ఉరుకులో డయాస్‌పైనున్న ఆమె దగ్గరకు చేరాడు.

హఠాత్తుగా తన దగ్గర్లో... ఎదురుగా చూడగానే నాట్యంచేస్తున్న 'రైనా' పులికెదురుపడ్డ లేడిలా వణికిపోతూ, పారిపోవటానికి ప్రయత్నించింది.

ఆ సమయంలో ఆమెను పోల్చుకోగలిగాడు తన మత్తంతా ఎగిరిపోయింది.

ఆవేశంతోవూగిపోతున్నాడు. ఉద్రేకంతో వణికిపోతున్నాడు. తనకి పిచ్చెత్తినట్లుగా అనిపించింది.

"నువ్వా!" అరచాడు.

ఆమె లోపలికి పారిపోయింది. ఆమె వెనుకనే పరుగెత్తాడు తను.

ఆ హాలు వెనుక ఓ గది...ఆ వెనుక మరో మూడు గదులు. వాటిలో ఏ గదిలో దూరిందో? కనిపించలేదు. ఆత్రంగా ఎదురుగా అగుపించిన గది తలుపు తోసాడు లోపల సరిగ్గా గెడ వేయ నట్టుంది.

లోపల మంచం మీద దున్నపోతులా వున్న వాడి కౌగిలిలో నగ్నంగా ఓ ఆంగ్లో ఇండియన్ యువతి. లోపల దురుసుగా ప్రవేశించిన తనను చూసి భయంతో 'కెవ్వున' కేక వేసింది.

ఆ దృశ్యం చూడగానే ఒక్క క్షణం పాటు శరీరం అంతా జలదరించినట్లు యింది. మొట్టమొదటి సారిగా డ్యాన్స్ చేసిన డాన్సర్ ఆమె.

దున్నపోతులా వున్నవాడు తినేసేలా చూస్తూ హూంకరించాడు. వాడిచేతికిగాని దొరికితే ఏకీలుకాకీలు విరిచేసి అన్నీ కలిపి కట్టకట్టేసేలా వున్నాడు. లోపల ఎంత ఆత్రంగా దూరాడో, అంత ఆత్రంగా బైటపడ్డాడు తను. ఆ పక్కనున్న మరో గదిలో చొరబడ్డాడు.

ఆ గదిలో ఓ మూలగా నిలబడి రెండు చేతుల మధ్య ముఖాన్ని దాచుకుని ఏడు స్తోంది ఆమె. తనను చూసి మరింతగా వణికిపోతూ ఏడవసాగింది.

"నువ్వా! ఎన్నాళ్ళగా సాగుతుంది వ్యవహారం? ఛీ! ఇంత నీచురాలివనుకో లేదు" పిచ్చిగా అరిచాడు. మనస్సంతా కసికసిగా వుంది.

"నిన్నంతలా ప్రేమించిన నాకెందు కంత ద్రోహం తలపెట్టావు? నన్నెందుకు మోసగించాలని చూస్తున్నావు?" గద్దిం చాడు.

సునీత ఏం జవాబు చెప్పలేదు. ఏడు స్తూనే వుంది.

"నన్నే గాఢంగా ప్రేమించానన్నావు. నేను లేందే జీవించలేనన్నావు. అంతలా ప్రేమించిన నా దగ్గర ఎంతో పవిత్రు రాలిగా నటించి ఇక్కడ ఇలా పరాయి వాళ్ళకౌగిలిలోతేలుతున్నావు. అంతేనా?" జుత్తుపట్టి ఆమె తలను పైకిలేపి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగాడు.

"కాదు! కాదు...అది నిజం కాదు" అంటోంది ఏడుస్తూ. ఆమెను పొదివి పట్టుకుని "చెప్పు! ఎందుకిలా నాటకం ఆడుతున్నావు? చెప్పు...చెప్పకపోతే... నిన్ను...నిన్ను" కోపంతో అరిచాడు.

"నేను చెప్తాను... ముందామెను వది లెయ్" అంటూ భీకరంగా ఓ గొంతు విని పించింది.

గదిలోకి ముగ్గురు వస్తాదుల్లా వళ్ళు పెంచిన రౌడీలు వచ్చారు. "ముందు నేసు అడిగిన దానికి సమాధానం చెప్పు... ఎవర్నువ్వు...లోపలకెందు కొచ్చావ్"

సునీతను మరింత గట్టిగా పొదివి పట్టుకొని "నేను...నేను...ఈమె..ఈమె నాకు...నా సునీత" అన్నాడు.

"ముందామెనువదల్రా! ఏం వదుల్తావా లేదా?" ఒక రౌడీ ముఖం మీద గుద్దాడు.

"వదలను... ఈమె నా సునీత... నిజం తెలుసు కోవాలి... అంతవరకూ వదలను"

ముఖం మీద మరో రెండు గుద్దులు. వెనక్కు విరుచుకు పడిపోయాడు. తన ముక్కునుండి రక్తం కారింది. పెదవులు




చిట్లిపోయాయి.

సునీతను ఒకడు పట్టుకున్నాడు.

లేచి, ఆమె వైపు ఉరికాడు.

మరొకడు పట్టుకొని ఆపాడు... "ముందు బయటకు పో,...ఏంపోతావా? లేదా?" తీక్షణంగా కళ్ళల్లోకి చూస్తూ అరిచాడు.

"ముందు నాకా నిజం తెలియాలి. అంతవరకూ నేను కదలను" అరిచాడు తను.

"అయితే అనుభవించు" ఒకడు భుజాలమీద గుద్దాడు. మరొకడు కడుపులో...ఇంకొకడు నడ్డిమీద తన్నాడు... బాధతో కిరకిర్లాడాడు తను.

పెడరెక్కలు విరిచికట్టి బైటకు మోసుకొచ్చేశారు.

రెడ్డి, పాల్ నిషా దిగిపోగా, తన కోసం వెదుక్కుంటూ లోపలకొచ్చారు.

"వాణ్ణేం చెయ్యకండి బాబ్బాబూ! వాణ్ని వదిలెయ్యండి...వాడికేం తెలీదు. వాణ్ని మాతో తీసుకుపోతాం" బతిమాలాడు ఇద్దరూ.

"తాగినోడు తాగినట్టుండాల. ఆడపిల్లల్ని పట్టుకొని అల్లరిచేస్తాడా? కిల్లిరి చేస్తాం. ఏంటనుకున్నాడో! మేమిక్కడ వున్నదెందుకు. ఇలాంటి రౌడీనాయాల్లుంటారనేగదా?" అన్నాడొకడు.

"ఇకనుండీ బుద్ధిగావుండు. ఈల్లిద్దరి ముఖంసూసి వదలిపెడుతున్నాం" అని కిందకు దించి ఒక్కతోపు తోశాడు. కింద పడిపోయాడు.

ఓ రెండు నిముషాలు నిస్త్రాణగా అలాగేపడివుండిపోయి. ఓపికతెచ్చుకుని... లేచినిలబడి... లోపలకుపరుగెత్తబోయాడు. "సునీతను రక్షించాలి ఈ దుర్మార్గులు" అంటూ ఏదో అనబోతున్న వాడల్లా, కడుపులో బలంగా తగిలిన దెబ్బతో కిందపడిపోయి స్పృహ కోల్పోయాడు.

* * *

ఆ సంఘటన గుర్తుకొస్తే పిచ్చెత్తినట్లుగా వుంటుంది తనకు. ఆ సంఘటన జరిగిన చాలరోజుల వరకూ తను మనిషి కాలేకపోయాడు.

'ప్రాణప్రదంగా ప్రేమించిన సునీత ఎందుకలా మారిపోయిందో? అర్థంకాలేదు. చాలారోజుల వరకూ తిండి, బట్ట మీద ధ్యాస వుండేదికాదు. క్లాసులు ఎగొట్టి తలుపులు బిడాయించుకొని ఒంటరిగా రూములో కూర్చునేవాడు.

ఓ సాయంత్రం సునీత ఇంటివైపు బయలుదేరాడు తను. ఇంతకుముందు సునీతఇల్లు దగ్గర పడుతోందనగా గుండె లయచిత్రంగా మారిపోయేది....తనకు ప్రియమైన చోటుకు వెళుతున్నానన్న అనుభూతి మనసులో మెదిలేది. కాని ఇప్పుడో! ఎందుకో వెగటుగా చేదుమాత్ర మింగబోయేముందు కలిగే భావనలా అనిపిస్తోంది.

ఆ ఇంటికి తాళం వేసుంది. వాకబు చేస్తే వాళ్లీ మధ్యనే ఇల్లు ఖాళీచేసేసి వెళ్లిపోయారని తెల్సింది.

"మాష్టారు రిటైరు అయిపోయి చాలా రోజులైంది. ఆ తర్వాత ఎందుకో ఎవరితోటీ చెప్పాచెయ్యకుండా వాళ్లు వూరొదిలి వెళ్లిపోయారు. వాళ్ల అడ్రసుకూడా ఎవరికీ తెలియదు" అన్నారు ఆ పక్క ఇంటివాళ్లు.

కొద్ది రోజులవరకు సునీత కోసం... ఎన్నో చోట్లు, ఎన్నో వూళ్లలో వెదికినా ప్రయోజనం లేకపోయింది.

గాయపడిన మనసులో చెలరేగే ఆలోచనలు మనసును దహించివేస్తూ అను

షణం అశాంతికి గురిచేస్తూ వుంటే ఆ ధాటికి తట్టుకోలేని తను తాగుడుకు లోనయాడు. ఆ మత్తులో...మైకంలో, బాధనుండి విముక్తి తాత్కాలికంగా లభించేది.

తన శ్రేయోభిలాషులు అందరూ తన లోని ఈ మార్పుకు ఎంతగానో బాధ పడ్డారు. అమృతవల్లి మరింతగా బాధ పడింది.

"ఏం జరిగింది బాబూ! ఈ మధ్య ఎందుకిలా అయిపోయావు? మానసికంగా బాధపడుతున్నావు..చెప్పుబాబూ! ఏంజరి గింది? నీ తల్లిలాంటి దాన్ని నాతో చెప్ప డానికేం?" అడిగింది.

"ఏమీలేదని" చెప్పి తప్పించేసు కున్నాడు తను.

ఈ లోపుగా రెడ్డి జరిగినదాన్ని చిలవలు పలవలుగా...కల్పించి అందరికీ ప్రచారం చేశాడు.

"ఇన్నాళ్ళూ మీరంతా ఎంతో మంచి వాడని అనుకుంటున్న రజనీగాడు పక్కా తాగుబోతు, తిరుగుబోతూను అందరికీ ఎంతో బుద్ధిమంతుడిగా అనిపిస్తూనే రహ స్యంగా క్లబ్బులు, బార్‌లకు తిరుగు తుంటాడు. తాగిన మైకంలో ఆ మధ్య ఓ హోటల్లోని డ్యాన్సర్ని బలవంతం చేయబోతే హోటల్‌వాళ్ళు పట్టుకుతన్ని రోడ్డుమీద పడేశారు. ఆ త్రోవంట వెళ్తున్న మేము పిన్నిచూసి, టాక్సీలో ఇంటికి తీసుకొచ్చాం. డాక్టరును తీసు కొచ్చి చూపించాం" అంటూ వీధిలో వాళ్ళందరికి చెప్పాడు. వాళ్ళంతా విని నవ్వుకొంటుంటే, తృప్తిగా, పిచ్చిగా తన లోని 'సేడిజాన్ని' సంతృప్తి పరచు కున్నాడు.

అమృతవల్లిగాని, వాళ్ళ కుటుంబ సభ్యులెవరుగాని, నమ్మలేదీ ప్రచారాన్ని "ఈ వెధవే! అతన్ని తీసుకెళ్ళి పాడు చేశాడు" అనుకున్నారు.

ఈ విషయం, ఆ నోటా...ఈ నోటా పాకి నాన్నగారు, పిన్నికికూడా తెల్సింది. వెంటనే పనిగట్టుకొని వచ్చారిద్దరూ. తను ఆ సమయంలో రూములో లేకపోవడంతో అమృతవల్లిగారిని అడిగారు. "మా రజనీ కాంత్‌మీద ఇలా చెప్పుకుంటున్నారు ... ఇవన్నీ నిజమేనంటారా?" అని

"ఆ ప్రచారాలన్నీ నమ్మకండి, బాబు ఎన్నాళ్ళుగానో మాకు తెలుసు. ఇవన్నీ అబద్ధపు ప్రచారాలు" అంది ఆమె.

పిన్నికి మంచి అవకాశం దొరికిన ట్టుంది ఇక్కడుంటే ఇలాంటివన్నీ మన సులో పెట్టుకుని ఆరోగ్యం పాడుచేసు కుంటాడు. కొద్దిరోజులు మాఇంట్లో వుంటాడు వాళ్ళ నాన్నగారు రిటైర్ అయిపోయారు కాబట్టి బాబు దగ్గరే ఉండి శ్రద్ధగా చూసుకుంటాను అంటున్నారు" అంది.

"అలాగే మీ ఇష్టం తల్లీతండ్రీ దగ్గర గాకపోతే పిల్లలు ఎక్కడుంటారు" అంది అమృతవల్లి.

కాని తను అందుకు వప్పుకోలేదు "ఫరవాలేదు ఇక్కడే వుంటాను" అన్నాడు. పిన్ని, నాన్నగారు ఎంతగానో బతిమాలి ఆఖరికి వప్పించారు.

'ఆ బాధ పైకి కనిపించడంలేదుగాని తను వెళ్ళిపోతున్నందుకు అమృతవల్లి ఎంతగానో బాధపడ్డారు. తనకు మరింత బాధనిపించింది. "అప్పుడప్పుడు వస్తుం టానమ్మా!" అని ఆమె దగ్గర శలవు తీసుకొని ఇంట్లో అందరితో చెప్పి వచ్చే శాడు తను.

* * *




వరుసగా మూడు ఆదివారాలు రాయపురం వెళ్లకపోయేసరికి మావయ్య రెండు మూడుసార్లు ట్రంకాల్ చేశారు. నాన్న, పిన్ని ఏదో చెప్పి సర్దేశారు. ఒకరోజు మావయ్య, మమత కార్లో వచ్చేశారు.

"ఏం బాబూ! రావడం మానేశావేం? ఈమధ్య నువ్వు రాకపోతే నీకెలా ఉందో? ఏం జరిగిందోనని గాభరాపడి వచ్చేశాం. నాన్నగారు చెప్పారనుకో 'ఏదో టూర్ ఉందట, ఈవారం రాసన్నాడు వచ్చే వారానిక్కూడా రాకపోవచ్చు. ఆపై ఆదివారం వస్తాడు అన్నారు. ఆపైవారం కూడా రాకపోగానే నేనే వచ్చేశాను" అన్నారు.

తను పిన్ని, నాన్న వైపుచూశాడు. 'అలా ఎందుకు చెప్పారు. నిజంగా జరిగిందంతా చెప్పేస్తే పోయేదికదా?' అనుకున్నాడు.

టూర్నుండి వచ్చేశాడు కాని తిరగడం వల్ల నీరసం చేసింది అంది పిన్ని. తను అవునని తలూపాడు.

"ఏం బావా మరచిపోయావా?" అడిగింది మమత.

"అబ్బే! మరచిపోవడమా? కారణం మా పిన్ని చెప్పిందికదా?"

"పోన్లే! ఈ విధంగానన్నా వచ్చారు అన్నయ్యగారు. అప్పుడెప్పుడో వచ్చారట కాని అప్పుడు మేము ఇంట్లో లేము" అంది పిన్ని.

కాస్సేపు ఆ కబుర్లు...ఈ కబుర్లతో కాలం గడచిపోయింది. మధ్యాహ్నం భోజనాలు అయ్యేక అందరూ కాస్సేపు రెస్టు తీసుకున్నారు.

సాయంత్రం "అలా కాస్సేపు తిరిగొస్తాండాదీ!" అంది మమత. సరేనన్నారు మావయ్య. బయలుదేరక తప్పలేదు తనకు.

మమత కారు డ్రైవ్ చేస్తోంది. దీక్షగా రోడ్డుపైనే దృష్టివుంచి డ్రైవ్ చేస్తున్న ఆమె ఎంతో అందంగా, నాజూగ్గా, నీట్గా ఉంది.

కారు బీచ్ రోడ్లో పార్క్ చేసి ఇద్దరూ ఇసకలో కొంతదూరం నడిచి ఇసుకలో కూర్చున్నారు.

సముద్రపు కెరటాలు పందెం కార్లలా ఒకదాన్నొకటి తరుముకుంటూ పోటీ పడుతూ తీరాన్ని తాకుతున్నాయి. వాటి వేగానికి మేమేం తీసిపోమని పైన ఆకాశం మీద ఆదరాబాదరా గమ్యం తెలీకుండా పరుగులెడుతున్న కార్లలా మబ్బులు పోటీ పడుతున్నాయి.

ఉన్నతంగా, గర్వంగా తలెత్తుకుని నిలబడ్డ వ్యక్తిలా అగుపిస్తున్న 'డాల్ఫిన్ నోస్'ను చూస్తున్నాను నేను ఆ కొండపైనున్న లైట్ హౌస్ వుండి వుండి ఇన్ని కాంతిపుంజాల్ని వెదజల్లి వెళ్ళిపోతున్నట్టుగా ఉంది.

ఎదురుగా సముద్రం పైకివాలి అంచును ముద్దుపెట్టుకుంటున్న ఆకాశాన్ని చూస్తూ కూర్చుంది మమత.

కొన్ని నిమిషాలుగడిచాయి. ఇద్దరిమధ్య మాటలేం దొర్లలేదు. మమత ఒకటి రెండుసార్లు తన పలుకరించి కదలించాలని చూసింది. తను ఏదో లోకంలో ఉన్నవాడిలా ఉండిపోయాడు. తనవైపే చూస్తూ కూర్చుంది. ఆకాశంలో మబ్బులగుంపులు ఎక్కడెక్కణ్నించోవచ్చి చేరుతున్నాయి.

"వర్షం వచ్చేలావుంది" అన్నాడు తను.

"సరే పదండి ..ఏం అలాఉన్నారు. మౌనవ్రతంగాని చేస్తున్నారా. పదండి ఆ హోటల్లో కొంచెం కాఫీ తీసుకొని




పోదాం అప్పటికైనా మీకు హుషారు వస్తుందేమో?" అంది.

ఇద్దరూ హోటల్లో టిఫిన్ చేసి, కాఫీ తీసుకున్నారు.

'ఇదే హోటల్‌కు తనూ, సునీతా వచ్చారు. ఇప్పుడు అవే సీట్సు, అదే సప్లయిర్, ఆరోజు ఎంత సరదాగా గడిపారు తామిద్దరూ. ఆ అనుభవం తను జీవితంలో ఎన్నడూ మరచిపోలేడు.

బయటకు రాగానే వర్షం కొద్దిగా ప్రారంభం అవుతోంది. ఇప్పుడు తనూ మమత కార్లో ఉన్నారు. తడుస్తామన్న భయంలేదు. ఆరోజు సునీత, తను తల దాచుకోవటానికి ఆగిన చెట్టు దగ్గరకు రాగానే కారు ఆపమని చెప్పాడు. ఆ ప్రదేశాన్ని చూస్తుంటే బాగా ఎదిగిన తుప్పలచాటున సునీత, తనూ అక్కడ తడుస్తూ నిలబడ్డట్టు' అనిపించింది.



"రండి రండి మంచి సమయాని కొచ్చారు. మా అన్నయ్యగారు కూడా వున్నారు. వీలయితే మాటలుకూడా అనుకోవచ్చు" అని ఆహ్వానించింది పిన్ని.

ఎవరో ముగ్గురు మధ్య వయసులో వున్న ఆడవాళ్లు పట్టుచీరల్లోనూ మెడ నిండా నగలతోనూ వచ్చారు. పరిచయాలు అయిన తర్వాత "అమ్మాయిని చూసుకోడానికి ఎప్పుడు వస్తారు? ఏమిటి? మీ అన్నయ్యగార్ని కనుక్కొనిచెప్పండి" అన్నారు. ఆ మాటే పిన్ని మావయ్యతో అంది. తెల్లబోయి చూశారు మావయ్య.

"ఏమిటి? అప్పుడే రజనీకి పెళ్ళి సంబంధాలు చూసేస్తున్నారన్నమాట" అన్నారు.

"ఏదీ! ఇప్పుడప్పుడే చేసుకోనంటున్నాడు. చదువంతా పూర్తవ్వాలిట. మీరు కొంచెం అబ్బాయికి నచ్చచెప్పారంటే..." నసిగింది పిన్ని.

"సరే! అలాగే చెప్పి చూస్తాను" భరోసా ఇచ్చారు మావయ్య. వాళ్ళు, "కబురు చేయండి తర్వాత" అని చెప్పి వెళ్ళిపోయారు.

"ఎన్నెన్నో సంబంధాలు వచ్చిపడిపోతున్నాయండీ అన్నయ్యగారూ! ఈ పెళ్ళి అయ్యేక అమ్మాయికి కూడా చెయ్యాలనుకుంటున్నాం" అంది పిన్ని.

"మీ అమ్మాయి మమత బంగారపు బొమ్మలా వుంది. మీరేమీ అనుకోనంటే ఓ మాట... అక్కడా ఇక్కడా సంబంధాలు చూసుకోవటం దేనికి. మీకు అభ్యంతరం లేకపోతే అమ్మాయిని రజనీకే ఇచ్చి చేస్తే బావుంటుందని అనుకుంటున్నాం. ఇన్నాళ్ళూ అమ్మాయి పెళ్ళికి ఎదిగి వుందన్న సంగతే నేను ఆలోచించలేదు" అంది పిన్ని.

తన మనసులోని మాటే వాళ్ళ నోటి నుండి వెలువడటంతో "సరే! కానివ్వండి నాకేం అభ్యంతరం లేదు. అబ్బాయికి ఇష్టమో లేదో అడగండి" అన్నాడు మావయ్య.

సునీత దూరం అయ్యేకా తనకు ఎవరైనా ఒకటే. అందుకే... "పెళ్ళికి నాకేం తొందరగా లేదు. చదువంతా అయిన తర్వాత అయితే బాగుంటుందని

అనుకుంటున్నాను. నా సంగతి అడిగారు కాని మమతను అడగలేదేం? నన్ను చేసుకోవడం ఆమెకు" ఆగి మమత వైపు చూశాడు తను.

మమత సిగ్గుతో లోపలకు పారిపోయింది.

"అమ్మాయికి ఇష్టమే బాబూ! ఆమెను చూస్తేనే ఆ సంగతి తెలిసిపోతుంది. పిచ్చిపిల్ల. పెళ్ళని అనగానే సిగ్గుతో ఎలా పారిపోయిందో? నీకూ ఆమె అంటే ఇష్టమేనన్న సంగతి తెలిసిపోతోంది. మరి ఇంకా ఆలస్యమెందుకు? త్వరలోనే మంచి ముహూర్తాలు వున్నాయి. సిద్ధాంతికి కబురు పెట్టేద్దాం. కట్నాలు అవీ మాట్లాడేసుకుందాం" అంది పిన్ని.

"ఇంకా వేరే మాట్లాడుకోవడం అదీ ఎందుకు. నీ కెంత కావాలో చెప్పమ్మా. ఆడపడుచుల కట్నం తలొక పాతికవేలు చాలా? లేక మొత్తం ముగ్గురికీ కలిపి లక్ష రూపాయలు ఇచ్చెయ్యమన్నారా?" అన్నారు మావయ్య.

పిన్నికి గుండె ఆగిపోయినంత పనయింది. 'లక్ష రూపాయలు ఆడపడుచుల కట్నమా?' అనుకొంది.

"మీ ఆదేశాన్ని కాదనగలమా అన్నయ్యగారూ! ముహూర్తాలు పెట్టించేద్దాం. సిద్ధాంతికి కబురు పెడతాను'' అంది పిన్ని.

* * *

మమతకూ తనకూ పెళ్ళి వైభవంగా జరిగింది. పెళ్ళిలో హడావుడి అంతా పిన్ని, నాన్న, చెల్లాయిలదే. పెత్తనాలన్నీ వాళ్ళవే. మగపిల్లవాడి తరపువాళ్ళు కదా అందుకు. బట్టలు, నగలు, లాంఛనాలన్నీ బాగా అందుకున్నారు. కట్నం డబ్బు నాన్న దగ్గరే వుంచారు. అవసరమైన వాటికి కొంత డబ్బు ఖర్చయిందని చెప్పారు. పెళ్ళికి అమృతవల్లిగారి కుటుంబసభ్యులు, ఫ్రెండ్స్ వచ్చారు.

మర్నాడు...

తలుపు గడియపెట్టి వచ్చింది మమత. ఎదురుగా రాశిపోసిన అందం. తెల్లని చీరలో, మల్లెపూలతో కుట్టిన పొడవైన జడతో, వంటినిండా విలువైన ఆభరణాలతో, నడుముకు అలంకరించబడిన ఒడ్డాణముతో...ఇంపుగా నిండైన వంపులతో, ఆనందంతో నిండి మిలమిల మెరుస్తున్న కళ్ళతో, నునుపైన రోజా బుగ్గలతో తలదించుకొని నిలబడివుంది.

తను నిర్లిప్తంగా వుండిపోయాడు. అంత అందమూ తనలో ఏ రకమైన చైతన్యాన్నీ తీసుకురాలేకపోయింది.

కాలికున్న పట్టీల మువ్వలు గలగల్లాడుతుండగా చేతిలో పాలగ్లాసుతో నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ దగ్గరకొచ్చింది.

వంటికి రాసుకున్న సెంటు వాసనలో మిళితమైన జడలోని పూలవాసన మత్తు కలిగించేలా గుప్పుమంది.

"ఏంటి? అలా చూస్తుండిపోయారు?" అడిగింది మమత.

"నా అదృష్టానికి ఆశ్చర్యపోతున్నాను. ఇప్పటివరకు జరిగిందంతా కలా నిజమా అని అనిపిస్తుంటుంది అప్పుడప్పుడు. నిన్ను భార్యగా పొందిన నేను ఎంతో అదృష్టవంతుణ్ని మమతా!'' అన్నాడు. తన మాటల్లోని అస్వాభావికత కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ఆ మాటలు మనసు లోతుల్లోంచి కాకుండా నాలుక చివరినుండి వచ్చినట్లుగా అనిపించాయి.

కాని ఆవెంటనే మనస్సాక్షి తిరగబడింది. 'సునీతను చేసుకొనుంటే అంత

కట్నం, లాంఛనాలు... అతి వైభవంగా జరిగిన పెళ్ళి ఇవన్నీ సమకూరేవేనా?' అని ప్రశ్నిస్తున్నట్లుగా అనిపించింది.

సునీతను తాను ఏరకంగానూ దూరం చేసుకోలేదే? తనకు తానుగానే దూరం అయిపోయింది. పొరపాటుగా వ్యవహరించి, దొంగగా దొరికిపోయి, ముఖంచెల్లక పారిపోయింది. అలాంటి పరిస్థితుల్లో ఆమె వుండకుండా ఉంటే తను మావయ్యను, అందర్నీ వప్పించి ఆమెనే చేసుకునేవాడు

"ఏంటలా వుండిపోయారు? మాట్లాడుతూనే అలా ఏవో ఆలోచనల్లోకి జారిపోయారు" అడిగింది మమత.

"అబ్బే! ఏంలేదు" అన్నాడు తను.

"ఏమీ లేకుండా ఎందుకుంటుంది. ఏదో వుంది. మీరు నాదగ్గర దాస్తున్నారు" నిష్ఠూరంగా అంది.

"అదేంకాదు మమతా! రా! ఇలా కూర్చో" వాతావరణాన్ని మార్చటానికి ప్రయత్నిస్తూ అన్నాడు.



ఆమె రాలేదు. సిగ్గుపడుతూ నిల్చుంది.

వెళ్ళి ఆమె భుజాలు పట్టుకొని మంచం వరకు నడిపించుకొచ్చాడు తను. "మోడరన్ పెళ్ళికూతుళ్ళకు కూడా ఇంత సిగ్గయితే ఎలా?" అన్నాడు నవ్వించటానికి ప్రయత్నిస్తూ. 'ఆమె చేయి మెత్తగావుంది సునీత చేయికూడా ఇంతే మెత్తగావుండేది. ఒకరోజుమాత్రం తను ఆమె చేతిని తన చేతిలోకి తీసుకోగలిగాడు. మరో రోజు వర్షంపడుతున్న సమయంలో చెట్టుకింద ఆమెను గాఢంగా హత్తుకున్నాడు. అంతే! ఆమె ఎప్పుడు తనకు దగ్గరగా కూర్చున్నా సరే, దూరంగా వుండటానికే ప్రయత్నించింది.

"అరే! ఏంటయింది మీకీరోజు? ఎదురుగా మనిషిని పెట్టుకొని ఎక్కడెక్కడో విహరిస్తున్నారు. ఈరోజు మీకు ఒంట్లో బాగులేదా? లేక అత్తయ్యగాని గుర్తొచ్చి అలా వుంటున్నారా?" మమత అడిగింది.

అమాయకంగా చూస్తున్న ఆమె కళ్ళలోకి చూశాడు. "ఎంత సునిశితంగా ఆలోచిస్తుందీమె. ఈమె మనసులో తన తల్లి అన్నపూర్ణ ఓ ఆరాధ్య దేవత. ఆమె గురించి తలవనిరోజువుండదు. అమ్మలో వుండే లక్షణాల్లో ఈమె దగ్గర కొన్ని వున్నా, తన జీవితం సుఖమయమే అవుతుంది. ఏ మగవాడి జీవితమైనా నాశనమైనా, సుఖప్రదమైనా, దానిక్కారణం ఆడదే అవుతుంది"

"అత్తయ్య ఆశీర్వాదం మనకుఎప్పుడూ వుంటుంది. ఆమె తలపులు మనకు బాధ కలిగించేలా ఆలోచించకూడదు. జీవితం సుఖప్రదం కావటానికి ఆమె దోహదం చేస్తుందన్న ఆశ, ఆమె దీవెనలు వుంటాయన్న నమ్మకం పీడినే పెంచుకోవాలి" అంది పక్కనే కూర్చుంటూ.

"మమతా! మావయ్యకు ఆరోజు మా నాన్నగారు గాని కనిపించివుండకపోతే.. మన ఈ కలయిక సాధ్యమయేదేనా? ఏంటో విధి...కొన్ని జీవితాల్ని విడదీసి మరికొన్ని జీవితాల్ని కలుపుతుంది. ఏది యేమైనా నువ్వు నా జీవితంలో ప్రవేశించావు...వెన్నెల వెలుగులు నింపటానికి" దగ్గరకు లాక్కున్నాడు తను. సాగరుని వడిలో సుడులు తిరుగుతూ కలసిపోతున్న తరంగిణిలా తన ఒడిలో కరగిపోయింది మమత.

* * *

ఓ పదిరోజుల తర్వాత పిన్నివాళ్ళు వెళ్ళిపోతామంటే మమత ఊరుకోలేదు "అయినా ఇప్పుడు అంతగా అక్కడకు వెళ్ళి చేయాల్సినపనులేంవున్నాయి. పిల్లలందరకూ కలవులేకదా! ఓ నెలరోజులన్నా ఇక్కడ వుంటేనేగాని కుదరదు" అంది.

"ఈమాట మా కోడలుపిల్ల అంది గాని మా అబ్బాయి అనేలేదు" అంది. నిష్ఠూరంగా పిన్ని.

"తనెలాగూ అడుగుతోందికదాని నేనూరుకున్నాను. వుండండి పిన్నీ"

"సరి! అలాగేవుంటాం" అంటూ వాళ్ళకు కేటాయించిన మేడమీద గదుల్లో తిష్టవేశారు.

ఎందుకో వాళ్ళని వుండమనటానికి తన మనస్సంగీకరించడంలేదు. కాని వద్దని ఎలా అనగలం...పోనీలే ఓ నాలుగైదు రోజులువుండి వాళ్ళేపోతారు అనుకున్నాడు.

పిన్ని, దుర్గమ్మ అతితక్కువ వ్యవధిలోనే కోడలుపిల్లను ఆకట్టుకోగలిగారు. అలాచేయడం వాళ్ళకు వెన్నతో పెట్టిన విద్య. మనుషుల్ని, ఏరకంగా మాట్లాడి

తమవైపు ఎలా తిప్పుకోవాలో వాళ్ళకు బాగాతెలుసు. నవ్వుతూ సరదాగా వున్నట్లు మాట్లాడుతూవున్నా, అప్పుడప్పుడూ వాళ్ళ కంఠంలో ధ్వనించని విషపు జీర లతో తనకు బాగా పరిచయమే.

మమత పిన్నిని "అత్తయ్యగారూ!" అంటూ ఎంతో ఆప్యాయంగా పిలిచేది. వదలకుండా వెంటే తిరిగేది. వాళ్లు వెళతా మన్న రోజుల గడువు కూడా దాటిపోతోంది. కాని వాళ్లు కదిలే సూచనలు మాత్రం కనిపించడంలేదు. అక్కడ పిన్ని వూరుకునేది కాదు... బజార్లు తెమ్మని, నీళ్ళుతోడమని, మొక్క లకు గొప్పితవ్వమని ఇలా రకరకాలుగా పనులు చెప్పేది. లోపల మూలుక్కున్నా చెయ్యక తప్పేదికాదు. కాని ఇక్కడ అలాంటి బాదరబందీ ఏంలేదు. మూడు పూటలా మస్తుగా తినడం గుర్రుపెట్టినిద్ర పోవడం తప్ప వేరే పనేం వుండేది కాదు. సాయంత్రంపూట షికారుగా వెళ్ళి వచ్చే వాడు. దుర్గమ్మకయితే తినడం కబుర్లు ఆ సిపాస్తుల గురించి ఆరా తీయడం. పిన్నికయితే నిజంగా సంబరమే. అత్తయ్య గారంటూ సలహాలడిగే కోడలు, వేళకు అమరిపోయే తిండి, ఆ తిండి బాగా వంట బడుతుండటంతో, ఆరోగ్యంకూడా కొంచెం కుదుట పడటయింది. అందుకే కదలటానికి వాళ్ళే ప్రయత్నం చేయడంలేదు. ఓ రెండు నెలల తర్వాత వాళ్లు అయిష్టంగా కదలి వెళ్లారు.

తమ కొత్త కాపురం దివ్యంగా సాగి పోతోంది. హౌస్‌సర్జన్‌గా చేయవలసిన పిరీయడ్ కూడా పూర్తయిపోవడంతో ఇద్దరికీ సినిమాలకు, షికార్లకూ తిరగ టానికి బాగా టైమ్ దొరుకుతోంది. అప్పు డప్పుడు కారులో విశాఖపట్నం వెళ్ళి పోయేవారు. బాగా చీకటి పడే వరకూ బీచ్‌లో కూర్చుని కబుర్లు చెప్పుకునేవారు. అప్పుడప్పుడు సునీత తన తలపులలో చోటు చేసుకునేది. అలాంటి సమయాలలో తను ముభావంగా వుండిపోయేవాడు. మమత అల్లరి చేస్తూ, కబుర్లతో తననీ లోకంలోకి తీసుకువచ్చేది.

* * *

విశాఖపట్నంలో నర్సింగ్‌హోమ్ ఓపెన్ చేశాడతను "స్వంతంగా ఓ నర్సింగ్‌హోమ్ మెంటైన్ చెయ్యి. నీ చదువును సార్థకం చేసుకో. డబ్బు సంపాదన కంటే ముఖ్యం, మానవత్వపు విలువలను గౌరవించడం" అన్నాడు మామయ్య.

ప్రతిరోజు నర్సింగ్‌హోమ్‌కు కారులో వచ్చి వెళ్తున్నాడు.

"రోజూ అంతశ్రమపడి అక్కడికేం వెళ్తావు? కోడల్ని ఇక్కడికే తీసుకువచ్చేసి ఇక్కడే కాపురం పెట్టకూడదా?" అనేది పిన్ని.

తనేం జవాబిచ్చేవాడు కాదు.

"మమతను తీసుకురా బాబూ! కొద్ది రోజులు ఇక్కడ వుంటుంది" అంది పిన్ని.

మామయ్యతో చెప్పి ఓ వారం రోజులు అక్కడ వుండి వచ్చేస్తాం అని చెప్పి బయలుదేరారు తామిద్దరూ.

ఆ వారం రోజుల్లోనూ సినిమాలు, పేరంటాలు, షాపింగ్, క్లబ్బు వీటన్నిటికి కలిసె తిరిగారు పిన్ని మమత.

"ఆ పల్లెటూర్లో ఏం తోస్తుంది? ఇక్కడే ఎంచక్కా వుండిపోవచ్చుకదా?" అంది పిన్ని.

"నేను ఆయనతో ఆ మాటే అంటుం టాను. ఆయన వినిపించుకుంటేనా? మీరు కొంచెం చెప్పి చూడండి" అంది మమత.

పిన్ని సహచర్యంలో ఈ వారం

రోజుల్లోనే మమతలో చాలా మార్పు గమనించాడు తను.

"నిజమే అత్తయ్యగారు అంటున్నది కూడా. ఇక్కడయితే సాయంత్రాలు బీచ్‌లో ఎంతో హాయిగా గడుస్తాయి... కొత్తకొత్త సినిమాలు, ఫ్రెండ్స్ పరిచయస్తులు లేడీస్ క్లబ్బులో పెద్ద పెద్ద ఆఫీసర్స్ భార్యలతో పరిచయాలు మనం ఇక్కడికొచ్చేద్దాం. ఆ పల్లెటూర్లో నాకేం తోచడం లేదు" అంది గోముగా.

''మామయ్యా ఆ ఇంటిని వదలిరారు. ఆయన్ని, ఆ ఇంటిని అక్కడ వదలి మనం ఇక్కడ అనుభవించే హాయి ఏంటో నాకర్థం కావడంలేదు" అన్నాడు తను.

"ఆయన ఆ ఇంటిని వదలి రారు. ఆ ఇల్లంటే ఆయనకు ప్రాణం. ఆయన కోసమని మన సరదాల్ని, సుఖాల్ని చంపుకుంటూ ఎన్నాళ్ళని అక్కడ వుంటాం?'' అంది మమత.

''సరే చూద్దాం ... మామయ్యతో కూడా ఈ విషయం గురించి ఆలోచించి ఆయన అభిప్రాయం కూడా తెలుసుకుందాం" అన్నాడు తను. ఆ విషయాన్ని అక్కడితో కట్ చేయటానికని.

వారం రోజుల తర్వాత తిరిగి వాళ్ళు ఇద్దరూ రాయపురం తిరిగి వచ్చారు. మమతలో మొండితనం పాలెక్కువ. అనుకున్నదల్లా జరిగితీరవలసిందేనన్న మంకుపట్టు ఆమెలో ఎక్కువగా కనిపించేది. తాను డబ్బున్నదాన్ననీ, సుకుమారంగా, అపురూపంగా పెరిగిన దాన్ననీ, అందగత్తెననీ, ఆమెకు అహంకారం ఎక్కువ.

తమ కాపురాన్ని పట్నానికి మార్చాలని ఎంతగానో ప్రయత్నించింది. కాని ఆ ప్రతిపాదన తనకు, మామయ్యకు ఇష్టం లేకపోవడంతో ఆ ప్రయత్నం నుండి విరమించుకొంది. "ఇక్కడ ఇంత భవంతి పెట్టుకొని అక్కడెక్కడో అద్దెఇళ్ళల్లో వుండాల్సిన ఖర్మమేం పట్టింది? ఎప్పుడు కావలిస్తే అప్పుడు ఇద్దరూ కార్లో వెళ్ళివచ్చేయొచ్చు కదా" అన్నారు మామయ్య.

ఓ రోజు సరదాగా కబుర్లు ఆడుకుంటున్న సమయంలో అడిగింది మమత. "కాలేజీరోజుల్లో మీకు ఆడపిల్లల్తో బాగా పరిచయం వుండేదట"

"ఎవరు చెప్పారట ఆ సంగతి మీకు"

"ఏం? మీరు చెప్పకపోతే తెలియదనుకుంటున్నారా? మీ గురించి అన్ని విషయాలూ తెలిసాయి. సునీత అనే అమ్మాయితో మీరు చాలా చనువుగా వుండేవారట...ఇద్దరూ కలిసి సినిమాలకు, షికార్లకూ తరచుగా వెళ్ళేవారట" అడిగింది.

ఆమెకేం జవాబు చెప్పాలో తెలిసింది కాదు. ఆమె మనసునెవరో విషపూరితం చేస్తున్నారు. విషబీజాలు నాటి తనపై పగుబాటు చేసేలా చేస్తున్నారు. ఆ సమయంలో ఆమెతో ఏ విషయం చెప్పినా గొడవ మరింత పెరగడం తప్ప మరే ప్రయోజనం లేదు! అందుకే ఏమీ మాట్లాడకుండా మౌనంగా వుండిపోయాడు.

"ఏం మీ రహస్యాలన్నీ నాకెలా తెలిసిపోయాయా? అని ఆశ్చర్యపోతున్నారా?" అడిగింది మమత.

"ప్లీజ్! ఇప్పుడు నన్ను ఆ విషయాలేవీ అడగొద్దు. తరువాత అన్నీ వివరంగా చెప్తాను" అన్నాడు తను.

"మన పెళ్ళి జరిగిన మరుసటిరోజే నేనీసంగతి కనిపెట్టాను. మీ మనసులో నాకంటే ముందే ఎవరో వున్నారన్న




పాల బిస్కట్లు–
నవ్వుతూ, తుళ్ళుతూ పెరిగే పాపాయిలకు నేస్తం!






బ్రిటానియా

రుచికరమైన, పుష్టికరమైన బిస్కట్లు

LINTAS BIN MB 10 1710 TL

సంగతి నాకు 'అనుమానంగా' తోచింది. ఆ తరువాత అదంతా నిజమేనని తెలిసింది మీరు మనసయితే ఆమెకు అర్పించారు. కాని డబ్బుకోసం నన్ను పెళ్ళి చేసు కున్నారు. ఆ సంగతి మీరు పెద్ద పెద్ద మొత్తాలలో తీసుకున్న కట్నం...ఆడ పడుచుల కట్నాలవల్ల రుజువు అవు తోంది. కనీసం 'మేనమామ కూతురు' అన్న అభిమానం కూడా మీకులేదు" కోపంగా అంది మమత.

"ఆవేశంలో వున్న నీకు ఇప్పుడేం చెప్పినా అర్థంకాదు. నువ్వు అనుకుం టున్న వాటిలో పూర్తినిజం లేదు. ఎవరో కావాలని కక్షకట్టి లేనిపోనివన్నీ నీకు నూరిపోసారు" అన్నాడు తను.

"మీరు డబ్బు మనుషులండీ! ఇన్నాళ్ళూ కడుపునిండా తిండికి నోచు కోక బతికారు. ఇప్పుడు నాలుగుడబ్బులు కళ్ళచూడగానే గత జీవితాన్నంతటినీ మరచిపోయారు"

"మమతా!" అన్న కేకతో ఆమె ఆగిపోయింది "ఏంటీ వాగుతున్నావు నువ్వు బావనేనా అంత మాటన్నది" అడిగాడు కోపంగా మావయ్య.

కోపంతో విసవిసగా వెళ్ళిపోయింది మమత.

"దాని మాటలేవీ మనసులో పెట్టు కోకు బాబూ! చిన్నప్పట్నుంచీ అతి గారాబంగా పెరగడంవల్ల, ఎవరితో ఎలా మాట్లాడాలో దానికి తెలిసిరాలేదు. పిచ్చి వాగుడు అలవాటైపోయింది" అన్నారు మావయ్య.

"అదేంలేదు మావయ్యా! మేమిద్దరం బాగానే వుంటున్నాం" అన్నాడు తను.

"దాని సంగతి నాకు బాగా తెలుసు బాబూ! చిన్నప్పట్నుంచీ తల్లి దగ్గర అలవాటు అయిన గారాబం, ఆవిడ పోయాక మరింత ఎక్కువ అయిపో యింది. జీవితం గురించి దానికి మంచి చెడ్డలు తెలియజెప్పేవారు లేకపోవడంతో సరైన అవగాహన అలవడలేదు. దాని మాట ప్రకారం ఏమైనా జరక్కపోతే, ఇక దానిరోషానికి హద్దూపద్దూ వుండదు. అందుకే బాబూ! నిన్ను ప్రత్యేకంగా వేడుకుంటున్నాను. అది తొందరపడి ఏదో పిచ్చిగా వాగినా...నువ్వంతగా పట్టించుకోవద్దు" బతిమాలు తున్నట్టుగా అన్నారు మావయ్య.

"అదేంటి మావయ్యా! మీరు నన్ను అంతగా బతిమాలడం ఏంటీ. ఇలాంటి వాటిని నేను అసలు లెక్కచెయ్యను. కాని మరీ మనసును చిత్రవధచేసే మాట లతో మూర్ఖంగా ప్రవర్తిస్తుంటే మాత్రం అదుపుతప్పి పోతానేమో! అని భయం వేస్తూ వుంటుంది. ఆ విషయమై మీరు ఆందోళన చెందకండి. ఆవిడ ఏవో చెప్పుడుమాటల ప్రభావంవల్ల అలా ప్రవర్తిస్తుంది తప్ప...ఒరిజనల్‌గా అణ కువ కలిగిందే" అన్న తన మాటలు మావయ్యకు భరోసానిచ్చాయి. తృప్తిగా నిట్టూర్చారు.

* * *

ఎంతగా కాదు కూడదనుకున్నా మన సులో సునీత రూపమే మెదిలేది. అప్పు డప్పుడూ. ఆమె అక్కడ ఎందుకలా వుండాల్సొచ్చిందో అన్న ప్రశ్న తన మనసులో ఓ పెద్ద అఘాతంలా వుండి పోయింది. ఏవో పరిస్థితులు బలవం తంగా ఆమెను అక్కడ చేర్చాయి. అన్న ఆలోచన మెదిలేది. ఏది ఏమైనా ఈ పరిస్థితుల్లో ఆమె గురించిన తలపులు, ఆలోచనలు దరిచేరకుండా వుంచుకో

చూసికే ఎంతో ప్రయత్నం చేస్తున్నాడు తను. ఆమె రూపం చాలావరకు తన హృదయ ఫలకం నుండి చెదిరిపోయి, చెరిగిపోయి ఆ స్థానాన్ని మమత ఆక్రమిస్తోంది. మమత చూపిస్తున్న నిర్మలమైన ప్రేమ ఆమె అమాయకత్వం ఏ కల్మషమూలేని మనస్తత్వం, తనపట్ల ఆమె కళ్ళల్లోని ఆరాధన, ఇవే...ఇవే ఆమెను తన హృదయంలో ప్రతిష్టించుకోటానికి దోహదం చేస్తున్నాయి.

* * *

ఒకరోజు సాయంత్రం మావయ్యా భవంతిముందు పచ్చగడ్డిలో కుర్చీలు వేసుకుని కూర్చున్నారు. కబుర్ల మధ్య మావయ్య తన ఉద్దేశం వ్యక్తం చేశారు. "నాకో నర్సింగ్‌హోమ్ కట్టించాలని ఉంది. అది ఎక్కడ కట్టిస్తే బావుంటుందో బాగా ఆలోచించి నాకు చెప్పండి"

"విశాఖపట్నంలోనే అయితే బాగుంటుందని నా అభిప్రాయం" అన్నాడు తను.

"ఈ వూళ్ళో అయితే?"

"ఇక్కడయినా ఫరవాలేదు. బాగా విశాలంగా కట్టించవచ్చు" అన్నాడు తను.

"ఇక్కడయితే? ఎవరొస్తారు? ఇంత చదువు చదువుకొని పల్లెటూర్లో ఉండిపోవాలా? మనం పెట్టిన పెట్టుబడికి నయా పైస వడ్డీ చొప్పునన్నా రావాలా? ఇక్కడ నాకు ఇష్టంలేదు. ఒక సరదావుండదు పాడూవుండదు" అంది మమత.

"వ్యాపారంచేసి డబ్బు సంపాదించవలసిన అవసరం లేదమ్మా! ఇక ప్రాక్టీసంటావా? ట్రీట్‌మెంటుబట్టి ఉంటుందది. ఈ చుట్టు పక్కలవున్న గ్రామాల్లో ఎక్కడా సరైన హాస్పిటల్ లేదు. మంచి డాక్టర్లు కూడా లేరు. మీ అమ్మ ఎలా చనిపోయిందో నీకు తెలుసుకదా? ఇంత ఐశ్వర్యం, పలుకుబడి వుండి మీ అమ్మను రక్షించుకోలేకపోయాను. మీ అమ్మకు టౌన్‌నుండి డాక్టర్లువచ్చి ట్రీట్ చేసేవారు. ఒకరోజు అర్ధరాత్రి సడన్‌గా ఆమె కండిషన్ సీరియస్ అయిపోయింది. అమ్మను డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళటానికిగాని, టౌన్ పంపించి డాక్టర్ను రప్పించటానికిగాని మన కారు అవసరానికి పనికిరాకుండా పోయింది. నాలుగురోజులుగా రిపేరుతో అది షెడ్‌లోనే పడుంది. కబురు పంపిస్తే వాడు "ఒకటి రెండు రోజుల్లో పూర్తిగా కండిషన్‌లోకి తీసుకువచ్చి, మీ ఇంటికి తెసుకువచ్చేస్తాను మీరు పట్నం రావలసిన పనిలేదు" అని కబురు పంపాడు. వూళ్ళో ఉన్న నాటువైద్యుణ్ని పిలిపించాను. "లాభంలేదు నిమిషాలమీద ఆమెను పెద్దాసుపత్రికి తీసుకుపొండి" అన్నాడు.

మరో మార్గంలేక మన ఎడ్లబండిమీదే మీ అమ్మను టౌన్ తీసుకువెళ్ళాల్సొచ్చింది. ఒకటి గాఢాంధకారం, గతుకుల రోడ్డు, బండి కుదుపులకి మీ అమ్మ నొప్పి మరింత ఎక్కువయిపోయింది. కుదుపు కుదుపుకూ ఆమె 'అమ్మా...అమ్మా'! అంటూ అరిచేది. ఆ అరుపుకు నా ప్రాణం పోయినట్టుండేది. అలా అంత సడన్‌గా ఆమె పరిస్థితి అలా తిరగబెట్టేస్తుందని ఎవరం ఊహించలేకపోయాం. ఆ బండిలోనే నా ఒడిలోనే ఆమె ప్రాణం హాస్పిటల్‌కు వెళ్ళే లోపలేపోయింది. సరియైన సమయంలో గనుక ఆమెకు వైద్య సహాయం అంది ఉంటే ఆమె బతికేదేమో? ఆమెకు ఆ సహాయం అందించలేని 'ఈ నా డబ్బెందుకు'? అన్న బాధ నా మనసును

ఎప్పుడూ పోలిచేస్తూ ఉండేది. ఆ రోజుల్లో మన వూరికి సరైన రోడ్డు, హాస్పిటల్, టెలిఫోన్ లాంటివి లేవు. మరొకరికి ఆ పరిస్థితి రాకూడదని వెంటనే రాజకీయంగా ఉన్న పలుకుబడిని ఉపయోగించి ఆ అవసరాలు వెంటనే జరిగేలా చేయించాను. రోడ్డు సేంక్షన్ అయిపోయింది. టెండర్లు ఫైనలైజ్ చేయడం వర్కు ఇవ్వడంలో ఆలస్యం అయింది. ప్రాణం పోయేముందు మీ అమ్మ చెయ్యి నా చేతిలోనే ఉండి పోయింది. అంత డబ్బున్న మనలాంటి వాళ్ళమే వైద్యసహాయంకోసం అన్ని అవస్థలుపడ్డప్పుడు ఈచుట్టుపక్కలవున్న పేద ప్రజలకు మరెంత అవస్థగా ఉంటుంది?" అన్నారు మావయ్య.

"ఎవరికోసమని మన సరదాలు చంపుకుని ఇక్కడ పడిఉండాలన్న మాట. ఇక్కడేం సరదా ఉంటుంది. ఓ క్లబ్బుందా? పార్కుందా? సినిమా హాల్సున్నాయా? చుట్టూ పొలాలు, తోటలూ అంతా అలగా జనం. ఎంతకని ఇక్కడ పడిఉండాలంటారు?" మూలుగుతూ తన అయిష్టతను వ్యక్తం చేసింది మమత.

"స్వచ్ఛమైనగాలి, వెలుతురు, ప్రశాంతమైన వాతావరణం, వీటిని వదులుకొని కంపుకొట్టే, కలుషితమైనవాతావరణం గల ఆ ప్రమాదమైన కల్తీలు, మోసాలు, దౌర్జన్యం నిండిన ఆ అర్థంలేని నాగరికత పైన మోజు పెంచుకోవడంలో అర్థంలేదు. నాకా ఆరోగ్యం రోజురోజుకు దిగజారుతోంది. నేను పుట్టిన ఈ గడ్డమీదే కన్ను మూయాలన్న కోరికతో నేనీ వూరువదలి రాను....రాలేను. కాని మిమ్మల్ని ఇక్కడ బలవంతంగా ఉంచాలన్నదికూడా నా అభిమతంకాదు. మీరు ఇక్కడ ఉండటం అంతగా నచ్చనప్పుడు పట్నంలోనే ఉంటూ అప్పుడప్పుడూ వచ్చి పోతూ ఉండండి" అన్నారు.

తర్వాత మమతా తను బాగా ఆలోచించుకుని ఓ నిర్ణయానికొచ్చారు. మావయ్య కోరిక తీర్చటమే ఇద్దరి కర్తవ్యం అనిపించింది.

మావయ్య ఆరోగ్యం అంతగా బావుండటంలేదు. నర్సింగ్ హోమ్ నిర్మాణం పూర్తయింది. అతికొద్ది కాలంలోనే చురుకుగా నిర్మాణం కొనసాగి పూర్తయింది. పేరును మావయ్యే సెలక్ట్ చేశారు. "మమత" ఆ పేరు అందరికీ నచ్చింది.

హాస్పిటల్ నిర్మాణం అయితే పూర్తయింది కాని అవసరం అయిన మిషనరీ, ఎక్విప్‌మెంట్సు, ఫర్నిచర్, బెడ్స్, మెడిసిన్స్, ఇంజక్షన్స్ అవీ కొనటానికి మరో పదిలక్షలు అవసరం పడుతుందని తేలింది.

తనకు కన్‌స్ట్రక్షన్ వర్క్సులో అనుభవం లేకపోవటం వల్ల కంట్రాక్టర్ మోసం చేశాడు. అందువల్ల అనుకున్న ఎస్టిమేషన్‌కన్నా పెద్ద మొత్తంలో ఖర్చు అయింది. మావయ్య ఇచ్చిన డబ్బు, తన దగ్గర వున్న డబ్బు పూర్తిగా అయిపోయింది.

మావయ్యకు హార్ట్ కంప్లైంట్ వుంది. హాస్పిటల్‌లో కొద్దిరోజులు వుంచవలసి వచ్చింది. ఆ సమయంలో టౌన్‌లో వున్న నర్సింగ్ హోమ్ వసంతా అసిస్టెంట్సు చూస్తుండేవారు. కొద్దిరోజులు నాన్న ఇంట్లో వున్నారు తాను.

తనకు కట్నంగా ఎంత ఇచ్చారో? ఆ డబ్బును నాన్న ఏం చేశారో తను పట్టించుకొనేలేదిన్నాళ్ళూ. మమతను అడిగితే చెప్పింది... మావయ్య ఆరు లక్షలు

ఇచ్చారని. ఇంత ఇచ్చారని నాన్నగాని, పిన్నిగాని మాటవరసకైనా తనతో అనలేదు. ఆ డబ్బుతో సగానికిపైగా అవసరం అయిన ఎక్విప్‌మెంటు కొని మిగతా విభాగాల్ని కూడా పనిచేయించవచ్చు అనే ఉద్దేశంతో పిన్నిని ఆ డబ్బు సంగతి అడిగాడు తను.

"ఆ డబ్బులో చాలావరకు నీ పెళ్ళి ఖర్చులకని అయిపోయింది. ఏదో కొంత మిగిల్తే ఆ డబ్బు పిల్లల ఆడపడుచుల కట్నంతోపాటుగా ఫిక్స్‌డ్ డిపాజిట్ చేశారు మీ నాన్నగారు. పిల్లలు పెళ్ళికెదిగి పోయారు కదా? ఏవైనా మంచి సంబంధాలు కుదిరితే చూసి పెళ్ళి చేసేద్దాం కొడుకు డాక్టరు కాబట్టి అల్లుళ్ళు కూడా డాక్టరు, ఇంజనీరు అయితే బావుంటుందని మీ నాన్నగారి పట్టుదల" అంది పిన్ని.

"మావయ్య దగ్గర్నుంచి కట్నం తీసుకోవడం ఏమిటి? ఆయన మనకు పరాయివాడా? పోనీ పుచ్చుకున్నారు, ఏదో ఆయన ఇస్తానన్నాడు కాబట్టి. మరి ఆ వివరాలన్నా నాకు చెప్పాలా? మీ ఇష్టం వచ్చినట్టు చేసేశారు. ఇప్పుడు నాకు అర్జంటుగా పదిలక్షలు కావాలి. అవి లేకపోతే నర్సింగ్‌హోమ్ పూర్తిగా పని చేయడం జరగదు" అన్నాడు తను.



"కోడలి దగ్గర బోలెడంత డబ్బుంది. అది తీసుకోకూడదూ? ఆవిడ పేర బేంకులో వేరే ఎకౌంటు వుంది... అది తీసుకో" అంది పిన్ని.

"సరే... ప్రయత్నిస్తాను మీ దగ్గర కూడా ఏమైనా ఉంటే అప్పుగా నన్నా ఇవ్వండి తరువాత తీర్చేస్తాను" అని చెప్పి వచ్చేశాడుతను.

షాపింగ్‌కు వెళ్ళిన మమత తిరిగి రాగానే ప్రారంభించింది పిన్ని. "అయినా ఇదేం పనమ్మాయ్! ఇన్నిలక్షలుపోసి ఆ ముంతాపల్లెటూర్లో అంత పెద్ద హాస్పిటల్ కట్టడం దేనికి? ఆ దరిద్రగొట్టు జనం తేరగా మందులు దొరికితే పట్టుకుపోతా రేగాని, తిరిగి డబ్బులిస్తారా ఏంటి? అంతంత దూరాల్నుంచి ఎవరు వస్తారని ఆ మూలకు...ఏదయినా తాహతునుబట్టి మనలుకోవడం నేర్చుకోవాలి. అప్పుడ్ని ఓ సరదానా? హాబా? ఆచుట్టు పక్కల అంతా కూలీ నాలీ జనం... పెంటకుప్పల పక్కన మసిలేవాళ్ళకు ఆస్పత్రిలో అంత వైభవం ఎందుకు? వాడికి బుద్ధి లేకపోతే మీనాన్నకు, నీకూ ఏమైందని? ఏంచక్కా ఆకట్టేది ఇక్కడ కట్టుంటే ఎంత గొప్పగా, గౌరవంగా వుండేది? ఎంత ఆదాయం వచ్చేదని..." అడిగింది పిన్ని.

"మొదట్నుంచీ అక్కడ కట్టించవద్దని మొత్తుకుంటూనే వున్నాను. నామాట ఎవరైనా వినిపించుకుంటేనా?"

"మెత్తనివాళ్ళని చూస్తే మొత్తబుద్ధే స్తుందని, ఈకాలంలో మొండిగా, గడుసుగా వుండకపోతే కష్టం. వచ్చి వస్తాడు నీమీద కూడా ... కొంచెం చూసుకో. లేకపోతే అంతా పట్టుకెళ్ళి ఆ వూళ్ళో బూడిదలో పోసేసినట్లు పోసేసి, నీ చేతికి చిప్ప ఇస్తాడు మాదగ్గరికీ వచ్చాడు "నాన్నగారు రిటైర్ అయినాక వచ్చిన డబ్బివ్వమని ... లేదని చెబితే వెళ్ళి పోయాడు" అంది పిన్ని.

* * *

"నేను అనుకుంటూనే వున్నాను. డబ్బు కోసం మీరు నాదగ్గర కొస్తారని వున్న డబ్బంతా బూడిదలో పోసేశారు. ఇంకా పదిలక్షలు కావాలా? అవేం చిల్ల పెంకులనుకున్నారా? లేక చింతపిక్క లనుకున్నారా? అయినా ఈవూళ్ళో ఏం వుందని అంత ఖర్చుచేశారు? నాన్న అంతకు ముందు ఇచ్చిన డబ్బూ ఇప్పుడు ఇచ్చిన డబ్బూ అన్నీ అయిపోయాయా? ఇప్పుడు నాదగ్గరేంలేదు... "వెళ్ళండి" అంది మమత.

"నీబేంకు బేలన్సు"

"అదెక్కడుంది? ... ఏం లేదు" దురుసుగా అంది.

"పోని నగలు తాకట్టు పెడతాను. అవన్నా ఇస్తే..." సందిగ్ధంగా ఆగాడు.

"ఇవ్వను... అవన్నీ నా నగలు. ఎంతో సరదాపడి చేయించుకొన్నవి. వాటినీ అమ్మేస్తారా? మీరు మనుషులు కాదండీ. నేను సరదాగా వుంటే చూడ లేరు" అప్రయత్నంగా ఆమె కళ్ళు చెమర్చాయి.

"సరే! మీ నాన్నగారు నా పేర రాసిన ఆ కొబ్బరి తోట, పొలాలు, అమ్మే స్తాను. ఎలాగైనా ఆ నర్సింగ్ హోమ్ పూర్తిచేసి తీర్తాను" నిశ్చయంగా అన్నాడు తను.

"అమ్మెయ్యండి ... అన్నీ అమ్మెయ్యండి. అమ్మేసి ఆఖరుకి మమ్మల్ని ఓకాదుల్ని చేసెయ్యండి... మిమ్మల్ని చేసుకున్న ఖర్మానికి వీధుల




వెంబడి అడుక్కుతింటాం" అంది మమత.

"నా పేరన. మా అమ్మ వాటాకి వచ్చిన ఆస్తి అమ్ముకుంటానన్నానుగాని నీదేం అమ్మేయ్యడం లేదుకదా?"

"మీ అమ్మ వాటానా? అది నీ ఆస్తి అయిందంటావా? నిన్నటివరకూ తంతే దమ్మిడీ లేనివాడికి ఈరోజు ఆస్తి వస్తే అంతకుమించి ఏం చేస్తాడు?"

విపరీతమైన కోపం ముంచుకొచ్చింది. బలవంతాన అపుకుని సూటిగా ఆమె కళ్ళలోకి చూశాడు.

జంకు కొంకు లేకుండా కనీసం భర్త అన్న అభిమానం, గౌరవం అన్న లేకుండా, నోరు జారిపోయింది. ఆమె కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. పెదిమలు అదురుతున్నాయి. ఆమె వెర్రికోపానికి అర్థం తెలియడంలేదు. ఎందుకంత మూర్ఖంగా ఆలోచిస్తుంది. తనను ఎందుకు అర్థం చేసుకోడం లేదు? తనేనా అంత తక్కువ తిన్నది. ఏదియేమైనా తాను పట్టిన పట్టు విడవడు. మావయ్యకు తానిచ్చిన మాట నిలబెట్టుకొనే తీరుతాడు. విసురుగా బయటకొచ్చేశాడు తను.

లౌక్యం తెలియకపోవడం, అవసరం పడింది– అమ్మక తప్పదని అందరికీ తెలిసిపోవడం,మావయ్యకు తెలియకుండా ఇదంతా జరిగిపోవాలని తాను అనుకుని తొందరగా వ్యవహారం నడిపించడం.... పేటన్నిటిపల్లె భూములన్నీ చాలా చౌకగా అమ్ముడుపోయాయి.

పరికరాలు, ఎక్స్‌రేప్లాంటు, ఎక్విప్‌మెంటు అంతా వచ్చేసింది. స్టాఫ్‌ను సెలక్టు చేసుకుని ఎపాయింట్ చేసేశాడు తను. తనతో చదివిన పద్మిని గవర్నమెంటు హాస్పిటల్లో పనిచేస్తుంది. సూపరింటెండెంట్‌తో ఆమెకు పడక రిజైన్ చేసేసింది. ఆమె అప్లికేషన్ పంపటంతో సెలక్ట్ చేశాడు. వెంటనే వచ్చి జాయినయింది పద్మిని.

మమత నర్సింగ్‌హోమ్ ప్రారంభోత్సవం చాలా ఘనంగా జరిగింది. నాయకులు, ప్రముఖులు ప్రఖ్యాత వైద్యులతోపాటు చుట్టుపక్కల గ్రామాల ప్రజలూ చాలామందే హాజరయ్యారు.

ప్రారంభోత్సవం మావయ్య అధ్యక్షతన జరిగింది. మావయ్య ఉదార స్వభావాన్ని దాతృత్వాన్ని, గొప్పతనాన్నీ అందరూ ప్రశంసించారు.

ఫంక్షను అంతా పూర్తయ్యాక కుటుంబ సభ్యులందరూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న సమయంలో పిన్ని తననడిగింది.

"అంతా బాగానే చేశావు, కాని మావయ్య ఎంతో సరదాపడి నీపేరరాసిన కొబ్బరితోట, పొలాలు అమ్మేసేవట.... అదేం పని బాబూ! డబ్బు చాలలేదని మావయ్యతో చెబితే, అయనే ఎక్కడో ఏర్పాటు చేసేవారు గదా!"

ఏ సంగతయితే మావయ్యకు తెలియకూడదని తను మొదట్నుంచీ ఎంతో జాగ్రత్త తీసుకున్నాడో, ఆ సంగతే పిన్ని, మావయ్య ముందు ప్రస్తావనకు తెసుకొచ్చింది. అసలా సంగతి పిన్నికెలా తెల్సిందో తనకర్థం కాలేదు. అసలు మమతకు కూడా ఆ సంగతి తను చెప్పలేదు. మరి పిన్ని ఆ సంగతి ఎలా కనిపెట్టిందో ఆశ్చర్యంగా వుంది. ఆ సంగతి తననే అడగొచ్చుగా? మరి మావయ్య ముందు అడగటంలో అంతరార్థం ఏమిటి?"

"ఏంటి? ఆస్తి అమ్మటమా ? అంటు

లోనూ నేను బతికుండగానే? 'నీకు నా చెల్లెలి తరపున వచ్చిన ఆస్తి ఎప్పుడు అందిస్తానా ... ఆమెపట్ల నా ప్రేమను, అభిమానాన్ని నిలబెట్టుకోగలుగుతానా' అని ఆశపడి ఆ వాటా ఆస్తిని నీపేర రిజిష్టర్ చేయించగలిగాననే ఆత్మ సంతృప్తితో హాయిగా ఊపిరి తీసుకున్న నాకు అశనిపాతంలా ఆ ఆస్తిని ఎందుకు అమ్మేశావు బాబూ! ఎందుకూ...నాకిచ్చిన మాటను నిలబెట్టుకోవాలనే, ఎంత పని చేశావు బాబూ! డబ్బు చాలకపోతే నాతో చెప్తే నా తరపున వచ్చిన ఆస్తిని అమ్మి అయినా ఇచ్చేవాడినికదా! లేదా అమ్మాయి పేర బేంకులో లక్షలకొద్దీ డబ్బు మూలుగుతోంది, ఆమెను అడగలేకపోయావా?" మావయ్యలో ఆవేశం ఎక్కువైంది.కోపం దుఃఖం...బాధ...అన్నీ కలగలుపుకొని ఆయన మీద దాడి చేశాయి. ఇది ఎంతో అవమానకరంగా అనిపించిందాయనకు. ఆవేశంగా గుండె పట్టుకున్నారు. తనేం మాట్లాడలేదు. గుండెజబ్బు మనిషి ఆయనకు ఆవేశం రాకూడదు... ఆయన 'ఎక్సైట్' కాకూడదు అందుకే జవాబివ్వకుండా మౌనంగా వుండిపోయాడు.

"అడిగాను నాన్నా! కాని నేనే ఇవ్వనన్నాను" అంది మమత.

"ఇవ్వనన్నావా? నువ్వు ఆ డబ్బు నీభర్తకే ఇవ్వనన్నావా? ఎంతపని చేశావమ్మా! ఎందుకలా చేశావ్! నువ్వుచేసిన పొరపాటువల్ల బంగారంలాంటి పొలాలు, కొబ్బరితోట అమ్ముకోవలసి వచ్చింది. ఇవి నాకెంత అవమానకరంగావుందో! నీకు తెలుసా?...ఇంత బతుకుబతికి... ఆఖరికి పొలాలు ... తోటా అమ్ముకునే స్థితికి తీసుకువచ్చావా?... ఇదంతా అతడు ఎందుకు చేశాడో ఎప్పుడైనా ఆలోచించావా అమ్మా? ఎవరి కోరిక తీర్చడానికి తన వాటా అమ్ముకున్నాడో తెలుసుకున్నావా? ... కోరిక..నా కోరిక తీర్చడంకోసం...నా ఆశయంనెరవేర్చడం కోసం...తనపేరనున్న ఆస్తి అమ్మి...ఆ నర్సింగ్‌హోమ్‌ను నిలబెట్టాడు..ఆనర్సింగ్ హోమ్..ఎవరిపేరనుందో నీకు తెలుసా?.. నీపేరనే...అదంతా ఇప్పుడు నీదే .... అతనిది అంటూ ఏదీలేదు. చాలమ్మా! నువ్వు చేసిన పనికి నా హృదయం ఆనందంతో నిండిపోయింది'' నిష్టూరంగా ఆవేశపడ్తూ ఉబికివస్తున్న కోపాన్ని.... ఉద్రేకాన్ని... దుఃఖాన్ని ఆపుకోటానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు. కాని అది సాధ్యం కావడం లేదు. కోపం ... ఉక్రోషం ... క్షణ క్షణానికి పెరిగిపోతోంది. ఆయన వళ్ళంతా బిగుసుకుపోతోంది....ఇంకా ఏదో చెప్పాలనీ ... తన బాధను, కోపాన్ని వెళ్ళగక్కాలనీ.. అనుకొంటున్నారు ... కాని ఆవేశంలో మాట తడబడ్తోందేగాని ... బైటకు రావడంలేదు ... దహించుకుపోతోన్న హృదయంతో అటు ఇటూ వూగిపోతున్నారు.

"ప్లీజ్! మావయ్యా! ఎక్సైట్ కావద్దు..ఇప్పుడేం జరిగిపోయిందని మీరు అంత బాధపడ్తున్నారు. మరో సంవత్సరంలో అదంతా ఎంత డబ్బొచ్చి అయినా సరే! కొనిపారెయ్యనూ....నా తల్లి ద్వారా నాకు సంక్రమించిన ఆస్తిని అంత తేలిగ్గా వదలేస్తానా...? నీలాగే నేనూ పట్టుదలగల మనిషినే మావయ్యా!" అంటూ శాంతింపచేయటానికి తను ప్రయత్నిస్తున్నాడు.

మమత దగ్గరికొచ్చింది ... "నన్ను క్షమించండి నాన్నగారూ! ఇదంతా నేను





మధుర సుమధుర సువాసనలు వెదజల్లి భగవంతుని ప్రార్థనకు,
ఏకాగ్రత చేకూర్చే
అశోకా
అగరువత్తులు
వాడండి.
FRESH ROSE
వివిధ రకముల
పరిమళములతో వివిధ
సైజులలో లభించును
తయారు చేయువారు:
ఆంధ్రా పంపిణీదారులు.
అశోకా ట్రేడింగ్ కంపెని, బెంగుళూరు-3,. జెమిని ఏజెన్సీస్, మచిలీపట్నం, 521001.
P.E.No.7,
Vnath

ఆలోచించలేదు... ఆలోచించినట్లయితే... అలా ప్రవర్తించేదాన్నికాదు" అంది.

"నాదగ్గరకు రావద్దమ్మా! నువ్వు... నీ ముఖం నాకు చూపించవద్దు...

ఆ డబ్బంతా... ఆస్తంతా... నెత్తిన కట్టుకుని వూరేగు... పో!..." కేకలు వేస్తున్నారు మావయ్య... ఆవేశంగా... పిచ్చిగా... వెర్రికేకలు-

అంతే! ... గుండె పట్టుకొని ... ముందుకు వంగి... పోయారు... కుప్పలా కూలిపోయారు మావయ్య.

మావయ్య ప్రాణం అనంత విశ్వంలో కలిసిపోయింది. అంతవరకూ ఎంతో సందడిగావున్న ఆ భవంతి అంతా విషాదంతో నిండిపోయింది.

తన చేతులతోనే మావయ్య చితికి నిప్పుపెట్టాడు. ఎంతో ఉత్సాహంతో ప్రారంభోత్సవానికి హాజరు అయిన బంధువులు, స్నేహితులు దహనసంస్కారాలు, చిన్నదినం... పెద్దదినం, కర్మలు చూసుకుని భారమైన హృదయాలతో వెళ్ళిపోయారు.



తన సమయంలో ఎక్కువ భాగం నర్సింగ్ హోమ్‌లోనే గడచిపోతోంది. ఇంట్లో వున్నంతసేపూ మావయ్య జ్ఞాపకాలు బాధించేవి. అందుకే ఆ బాధామయమైన స్మృతులకు అందకుండా, ఎక్కువ సమయం రోగులసేవలోనే గడిపేయసాగాడు.

హాస్పిటల్‌కు రోగులు ప్రవాహంలా వచ్చేవారు. బాధలు, నిరాశ, నిస్పృహలతో వచ్చే రోగులందరూ, ఆరోగ్యవంతులై తిరిగి వెళ్ళేటప్పుడు ఎంతో ఉత్సాహంగా, ఆనందంగా నవ్వుముఖంతో ఎన్నెన్నో ఆశలతో వెళ్తొంటే, తనకు 'లేదు మావయ్య మరణించలేదు... వీళ్ళందరి హృదయాలలోనూ బతికే వున్నార'నిపించేది.

తను ఇంటి దగ్గర వున్నంత సేపూ మమత ఎప్పుడూ ముభావంగా, నిర్లిప్తంగా మౌనమ్మురదాల్చి... నిస్తేజంగా వుండేది. ఆమెను చూస్తుంటే మనసంతా జాలితో నిండిపోయేది. ఆమె మనసులో చెలరేగుతున్న అగ్నిపర్వతాలను తను పోల్చుకోగలడు. కాస్తంత ఓదార్పుగా మాట్లాడగానే కరగిపోయేది. కౌగిలిలో చిన్నపిల్లలా ఒదిగిపోయి ఏడ్చేసేది.

ఆ బాధ మరచిపోవడం కోసమనీ ఆమెను ... ఉదయం, సాయంత్రం ఓ అరగంట అలాతిప్పి తీసుకొచ్చేవాడు తను. ఆమెకోసమని కథల పుస్తకాలు, నవలలు కొనితెచ్చేవాడు. వాటితో ఆమెకు కొంత కాలక్షేపం అయిపోయేది.

తనకు టిఫిన్, భోజనం ... అవీ ఇప్పుడు మమతే స్వయంగా ఏర్పాటు చేస్తుంది.

నర్సింగ్ హోమ్‌లో వున్నంత సేపూ తనకు ఏ మాత్రం తీరిక వుండేది కాదు. 'అక్కడ ట్రీట్‌మెంటు చాలా బాగుంది. డాక్టరు గారి చేయిచాలా మంచిది' అన్న టాక్ రావడం వల్ల చాల చాల దూరం నుండీ రోగులు వస్తూనే వున్నారు. డాక్టర్ పద్మిని తనకెంతో సహాయకారిగా వుం

టోంది. అందమైన ముఖంతో, పెదవుల పైన ఎల్లప్పుడూ చిరునవ్వుతో.... రోగులందర్నీ సరదాగా పలుకరిస్తూ, వారి బాధల్ని, కష్టాల్ని ఓపిగ్గా వింటూ సలహాలు చెప్పే ఆ డాక్టరమ్మ అంటే రోగులందరికీ ఎంతో గౌరవం, నమ్మకం. రోగికి ఆ డాక్టరుపై అపరిమితమైన నమ్మకం వున్నచోట రోగం నయం కాక ఏమవుతుంది. పద్మిని చాలా చురుకైన మనిషి... ఆపరేషన్సు చేయడంలో చాల నైపుణ్యం చూపిస్తుంది. రోగాన్ని డయాగ్నైజ్ చేయడంలో ఆమె ఎన్నడూ పొరబడి ఎరగదు. అందుకే ఆమె అంటే తనకెంతో అభిమానం.

మమతను అప్పుడప్పుడు తను నర్సింగ్ హోమ్‌కు తీసుకు వచ్చేవాడు. మమత, పద్మిని ఎంతో క్లోజ్‌గా వుండేవారు. పద్మిని సహచర్యంలో మమతలో కొంత మార్పు వచ్చింది. అంతకు ముందున్న నిర్లిప్తత, నిరాసక్తత కొంచెం దూరం అయింది. ఆమెను అప్పుడప్పుడు భోజనానికి పిలిచేవారు. ఆమె తమ ఇంటికి వచ్చిన రోజున ఇంట్లో ఎంతో సందడిగా వుండేది. ఇద్దరి మధ్య బాగా చనువు పెరిగింది. జోక్స్ కట్ చేస్తూ, నవ్విస్తూ గలగల పారే సెలయేటి ప్రవాహంలా వుండే పద్మినికి, నిర్లిప్తంగా గంభీరంగా చెరువులోని నీటిలా నిశ్చలంగా వుండే మమతకూ ఎలా కలిగిందో గాని చాలా కొద్ది కాలంలోనే మంచి స్నేహితులైపోయారు.

పద్మినికి ముప్పై అయిదుదాటుతున్నా ఇంకా కుమారిగానే వుండిపోయింది. నర్సింగ్ హోమ్ ఆవరణలోనే స్టాఫ్ క్వార్టర్సులో వుంటుండేది ఆమె.

ఇంపోర్టెడ్ ఎక్స్‌రే ప్లాంటు కస్టమ్స్ క్లియరెన్సు కోసమని బొంబాయి వెళ్ళవలసొచ్చింది తనకు.

"ఇంత ఇంట్లోనూ ఒంటరిగా వుండటం... నాకు శక్యం కాదు. నాకు తోడుగా వుండమని కొంచెం పద్మినికి చెప్పి పంపించండి" అంది మమత.

పద్మినిని రిక్వెస్ట్ చేస్తే "అలాగే" అంది.

తను బొంబాయిలో పని చూసుకుని తిరిగి రావటానికి ఆరురోజులు పట్టింది. ఈ ఆరు రోజులు తన భార్యకు కంపెనీ ఇచ్చినందుకు పద్మినికి థేంక్స్ చెప్పాడు తను.

ఆమరుసటిరోజు శెలవు దినం కావడం వల్ల సరదాగా గడపొచ్చని, 'స్పెషల్స్ చేయించ'మని చెప్పాడు మమతతో "డాక్టర్ పద్మినికి ఫోన్ చేసి తిన్నగా ఇక్కడి కొచ్చెయ్యమని చెప్పు మనతో పాటే ఈరోజు భోజనానికి వుంటుంది" అన్నాడు.

"సరే!" అంది మమత.

పద్మిని కోసం చాలాసేపు చూశారు... ఆమె రాలేదు. కారణం ఏంటో అర్థం కాలేదు.

మరుసటిరోజు పద్మినిని అడిగాడు తను "నిన్న ఇంటికి భోజనానికి రాలేదేం? నీ కోసమని మేము చాలాసేపు వెయిట్ చేశాం" అన్నాడు తను.

"పిలవందే ఎలా వచ్చేది? ఏం ఏదైనా స్పెషల్.... అకేషనా?"

"ఏం లేదు.... సరదాకనే మమతను ఫోన్ చెయ్యమని చెప్పాను... "సరే" నంది"

"కాని నాకు ఫోన్ చెయ్యలేదు. చేశానని మీతో చెప్పి వుంటుంది. యామై కరెక్ట్" అంది సన్నగా నవ్వుతూ పద్మిని.

ఏదో చెప్పబోతుండగా, సిస్టర్ వచ్చి పిలిస్తే వెళ్ళిపోయింది.

ఇంటికి వచ్చాక మమతను అడిగాడు తను "పద్మినిని భోజనానికి పిలువలేదా? అని"

"ఆమెను పిలవడం నాకిష్టం లేదు... అసలామెను నర్సింగ్ హోమ్ నుండి పంపించేస్తేనే బాగుంటుందేమో అనిపిస్తుంది" అంది.

"అదేం? ఆమె నీకు బెస్ట్ ఫ్రెండ్ కదా? ఇద్దరికీ ఏమైనా బెడిసి కొట్టిందా ఏం? అయినా ఆమెను సర్వీస్‌లోంచి తీసెయ్యాల్సినంత అవసరం ఏమొచ్చింది"

"ఏమొచ్చిందా? ఆమె అంటే నాకిష్టం లేదు. అయినా ఆమెను ఎందుకు పంపించేస్తారు లెండి. ఆమె మీకు క్లాస్‌మేట్ కదా? ఏవేవో పాత పరిచయాలుండివుంటాయి. అందుకే ఇంకా ఆమె పెళ్ళి చేసుకోలేదు. మిమ్మల్ని వదలి వుండలేక చక్కటి గవర్నమెంటు డాక్టరు ఉద్యోగం వదులుకొని ఈ పల్లెటూర్లో... పని చేయటానికి వచ్చింది... అంతేకదూ" అడిగింది మమత.

"నీకిలాంటి ఆలోచన లెందుకొస్తున్నాయి? ఆమె మంచి ఎక్స్‌పర్ట్ డాక్టర్. గైనిక్ కేసులన్నీ ఆవిడే ఎటెండవుతోంది. ఎంతో ఓపిగ్గా రాత్రి పగలు అనిలేకుండా ఎప్పుడు అవసరం వస్తే అప్పుడొచ్చి కేసుకు ఎటెండవుతోంది. ఇంత అర్ధాంతరంగా ఆమెను పంపించి వేస్తే అంత తొందరగా డాక్టర్లెవరూ దొరకరు. అందులోనూ ఈమారుమూలపల్లెలో పనిచేయటానికి లేడీడాక్టర్లు రావడం కష్టం" అని తను చెప్పగానే విధిలేక వప్పుకున్నది మమత.

మమత అప్పుడప్పుడూ నర్సింగ్ హోమ్ కొచ్చి కూర్చునేది. పద్మిని పలుకరించినా ముఖం తిప్పుకొని ఆమెవైపు చీదరింపుగా చూసేది. సూటిపోటిమాటలతో ఆమె మనసును బాధపడేలా చేసేది.

మమత ప్రవర్తనకు తనెంతో బాధపడేవాడు. "వెరీసారీ పద్మా! మమత ఒక్కోసారి మూర్ఖంగా ప్రవర్తిస్తుంది. ఈమధ్యనే ఆమెలో మార్పు వచ్చింది"

పద్మిని తేలిగ్గా కొట్టిపరేసేది. "ఆమె ప్రవర్తనపట్ల మీరేం బాధపడకండి. కొంతమంది ఆడవాళ్ళ పోలసీయే అంత. తమలోని ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు వల్ల, మరొక ఆడదానిపై లేనిపోని అభాండాలు వేయడం వాళ్ళకి అలవాటు. తమలోని ఈర్ష్యనీ విధంగా వాళ్లు బయట పెట్టుకుంటారు" అంటూ తిరిగి తనకు సర్ది చెప్పేది.

ఒకరోజు ఓ పేషెంటు కండిషన్ సీరియస్‌గా వుండటంలో ఇంటికి వచ్చేసరికి బాగా ఆలస్యం అయింది. పద్మిని, తను అక్కడి నుంచికదలటానికి వీలుపడింది కాదు.

ఇంటికొచ్చేసరికి మమత మంచి వేడిలో వుంది. "ఏం అయ్యాయా?రాచకార్యాలు. అదుంటే చాలు మీకు ఇల్లూ వాకిలీ అవసరం లేదు. దానికంటే మొగుడనేవాడు లేడు. మరి మీకేమయింది? ఇల్లూ పెళ్ళాం ఏవీ లేనట్టు ఆ నర్సింగ్‌హోమ్‌లోనే రోజంతా గడిపేస్తేఎలా?" అంటూ చాలాసేపు గొణుక్కుంటూ కూర్చుంది.

మరో రోజు అర్జంటుగా ఓ పేషెంటుకు ఆపరేషన్ చెయ్యాల్సొచ్చింది. చాలా కాంప్లికేటెడ్ ఆపరేషన్ అవడంవల్ల చాలా టైమ్ తీసుకుంది.

తనకోసమని మమత రెండుసార్లు కబురు చేసిందట. 'థియేటర్లో వున్నార

ఆపరేషన్ చేస్తున్నారు కొంచెం ఆలస్యంఅవుతుంద'ని స్టాఫ్ ఇంటికి కబురు పంపాడు. వెంటనే మమత సీరియస్‌గా వచ్చి కన్సల్టింగ్‌రూమ్‌లో కూర్చుంది.

ఆపరేషన్ సక్సెస్‌ఫుల్‌గా నిర్వహించి సంతృప్తిగా బయటికొచ్చిన తననూ, పద్మినినీ మార్చిమార్చి చూస్తూ వుక్రోషంతో ఉడుకెత్తిపోతున్న మమత కనిపించింది.

పద్మిని ఆమెను పలుకరించింది. "ఎంతసేపయింది వచ్చి" అంటూ. "చాలా సేపట్నుంచి ఇక్కడే వ[illegible] దయచేసి తల్లీ! నువ్వ[illegible] డ్యూటీకి రావద్దు. వేరే ఎ[illegible] చూసుకో" అంది మమత [illegible]

పద్మినికిదేం అర్థం కాలే[illegible]

"రేపట్నుంచి ఈ నర్సి[illegible] రావాల్సిన అవసరం లేదంటున్నాను. ఇంకా అర్థం కాలేదా? నీలాంటి వాళ్ళ వల్ల డిసిప్లిన్ అంతా చెడిపోతోంది. నీకు రావాల్సిన జీతం తీసుకుని వెంటనే బయలుదేరి వెళ్ళిపో!"

పద్మిని మమత ధోరణికి విస్తుపోయింది. మనసంతా, జరిగిన అవమానానికి చెదిరిపోయి, అశాంతితోనూ, బాధలోనూ విలవిల్లాడిపోయింది.

[illegible]తవప ఏమీ అర్థంకాని సర్జెంగ్ [illegible]తా చిత్తరువుల్లా నిలబడి [illegible]పోయారు.



ఆ రాత్రి ఇంట్లో యుద్ధం అయిపోయింది.

"రోజు రోజుకు ధూర్తాళ్ళయిపోతున్నారు. పెళ్ళికి ముందు అదెవరో సునీత, ఈ పద్మిని ఇంకా ఎంతమందో!" పెద్దగా నోరు చేసుకొని అరుస్తోంది మమత.

"ప్లీజ్! అనవసరంగా లేనిపోని అభాండాలువేసి నన్ను రెచ్చగొట్టొద్దు. మా వయ్యకు మాట ఇచ్చానుగనుక నువ్వు ఎంత వాగినా ఊరుకుంటున్నాను"

"రాత్రీ పగలు అని లేదు...ఎప్పుడు ఐడితే అప్పుడే దాన్తో సరదాలు తీర్చుకుంటున్నారు"

చెంప ఛెళ్ళుమంది మమతకు.

"నోర్ముయ్! ఇంకా అట్టే వాగావంటే పళ్ళు రాలగొట్టేస్తాను. ఆమెతో నేను సరసాలు ఆడటం నువ్వు చూశావా?" అడిగాడు కోపంతో వణికిపోతూ.

"ఎంత ధైర్యం మీకు. ఆఖరికి నన్ను కొట్టడానికి కూడా తయారయ్యారన్న మాట"

"కొట్టడమే కాదు...అట్టే వాగావంటే జుట్టుపట్టుకొని బయటకు ఈడ్చేస్తాను"

"నన్ను జుట్టు పట్టుకొని ఈడుస్తావా? ఇదిగో బావా! నువ్వు పనిచేస్తున్న నర్సింగ్ హోమ్, వుంటున్న ఇల్లు, కడుతున్న బట్ట, తింటోన్న తిండి-ఇవన్నీ ఎవరివో తెలిసే మాట్లాడుతున్నావా? అంతగా మాట్లాడితే ... ముందు నువ్వే బయటికి వెళ్ళాల్సొస్తుంది" అంది రోషంగా నిప్పులు కురిపించే చూపులతో.

అంతమాట అంటుందనుకోలేదు. నిర్ఘాంతపోయి చూశాడు తను.

"మా దయాదాక్షిణ్యం మీద బతుకుతూ, తిరిగి మామీదే అధికారం చెలాయించటానికి తయారవుతున్నారన్న మాట. ఆ నర్సింగ్‌హోమ్ నా పేరున పెట్టడమే మంచిదయింది. నా నర్సింగ్ హోమ్‌లో నా ఇష్టం వున్నవాళ్ళను వుంచుతాను...లేనివాళ్ళను తీసివేస్తాను. నిజంగా దాంతోనే ఊరేగాలని వుంటే పోండి.. దాన్ని ఎక్కడికో తీసుకుపోండి. అంతేగాని ఇక్కడమాత్రం వుండొద్దు" ఆవేశంతో మాటలురాక ఆగిపోయింది మమత.

బయట ఎవరో కాలింగ్‌బెల్ మోగించారు.

వెళ్ళి తలుపు తీశాడు స్టాఫ్‌క్వార్టర్సు వాచ్‌మన్ ఓ లెటరు తీసుకొచ్చి ఇచ్చాడు.

"పద్మిని అమ్మగారు ఇచ్చారండి! ఇదిగో ఈ తాళాలు కూడా ఇచ్చారు. ఇక తిరిగిరానని చెప్పి వెళ్ళిపోయారు" అన్నాడు

"వెళ్ళిపోయారా...ఎక్కడికి?"

"వెళ్ళిపోయారండీ! బాగా ఏడ్చినట్టున్నారు. కళ్ళు వాచిపోయి ఎర్రబడిపోనాయండి, 'ఎక్కడికమ్మా?' అనడిగాను. చెప్పలేదండి ... అలా ఏడుస్తూనే తిన్నగా నడుచుకుంటూ వెళ్ళిపోయారండి" అన్నాడు వాచ్‌మన్.

"ఏడుస్తూ వెళ్ళిపోయారా? చూశావా మమతా....నువ్వెంత పనిచేశావో!" ఆ వుత్తరం విప్పి చదివాడు తను.

"రజనీగారూ!

నమస్తే! సారీ ... మీ విలువైన సమయాన్ని ఓ అయిదు నిముషాలు ఈ ఉత్తరం చదవటానికి స్పేర్ చెయ్యండి. అంతే...ఇక ఆ తరువాత నా గురించి తలవనే తలవొద్దు.

పేపర్లో మీరిచ్చిన అడ్వర్‌టైజ్‌మెంట్ చూసి నేను అప్లై చేశాను. నాకు చిన్నాళ్ళగానో ఏదైనా ఓ పల్లెటూరులో పనిచేయాలని వుండేది. అందులోనూ

మీరు తెలిసినవారు. మీదగ్గర అయితే నాకేం ఫర్వాలేదని అనుకున్నాను.

నన్ను మీరందరూ ఎంతగానో అభిమానించారు..ఆదరించారు. మిమ్మల్ని చూసి అన్నయ్యలేనిలోటు తీరిందని ఎప్పుడూ భావించేదాన్ని. మీ శ్రీమతికి నాపై ఎందుకో అకారణంగా అనుమానం కలిగింది. మీరు బొంబే వెళ్ళినప్పుడు ఆమెకు నేను తోడుగా వున్న సమయంలో మీ గత జీవితం గురించిసరదాగా ఏవైనా విశేషాలుంటే చెప్పమని అడిగింది. మీకు ఎవరైనా అమ్మాయిలతో ఫ్రెండ్‌షిప్ వుందా? పైన కూడా ఎవరైనా ఆడపిల్లలతో పరిచయాలు అవీ వుండేవా? క్లాసులో అమ్మాయిలతో ఎలా వుండేవారు? - ఇలాంటి వివరాలన్నీ అడిగింది. 'ఆయన అలాంటివారు కాదు. అందరితోనూ ఎంతో గౌరవంగా మర్యాదగా వుండేవారు' అని చెప్పాను.

ఆమె ఎందుకో ఆ తరువాత నుండి ఏవేవో సూటిపోటి మాటలు నామీద ప్రయోగించసాగింది. మనిద్దరి గురించి ఆరాతీయమని కనిపెట్టి వుండమని ఆయాలకు డబ్బిచ్చి ఎప్పటికప్పుడు వివరాలతో చెప్పమని చెప్పిందట.

రాయపురంలాంటి పల్లెటూర్లో నవ నాగరికతకూ, అన్నిరకాల సరదాలకు, సౌకర్యాలకు దూరంగా ప్రతిఫలాపేక్ష ఏమాత్రం లేకుండా పేదప్రజలకోసమని నర్సింగ్‌హోమ్ నడుపుతున్న మీలాంటి సహృదయులు, ఆదర్శవంతులు అయిన వారి వద్ద ఉద్యోగం చేయడం ఎంతో అదృష్టంగా భావించి వచ్చాను. ఒంటరి దాన్ని, ఏ ఆసరాలేనిదాన్ని అవడంవల్ల మీ కుటుంబంతో చనువుగా మసలేదాన్ని. కాని ఆమె మనిద్దరి అనుబంధాన్ని మరోలా అర్థం చేసుకున్నారు. మీమీద నాకు ఎంతో గౌరవం. మీ ఆదర్శాల పట్ల ఎంతో ఆరాధన, అభిమానం. అదే మనిద్దరి మధ్యగల అనుబంధం... దాన్ని ఆమె వక్రంగా చిత్రించటానికి ప్రయత్నిస్తూ అనుక్షణం మనల్ని వేధిస్తోంది. ఇంకా నేను వుంటే మీ సంసారంలో కలతలకు కారణం అవుతానన్న భయంతో వెళ్ళిపోతున్నాను. ఆమె మీ మనసును ఎప్పటికైనా తెలుసుకోగలదన్న నమ్మకం నాకుంది. మీ ఇద్దరి జీవితం కలకాలం నిత్యనూతనంగా వుంటూ ఆనందమయం కావాలనీ, ఏ కలతలు లేకుండా మీరిద్దరూ కాపురం చేయాలనీ కోరుతూ..."

చదువుతున్న ఉత్తరాన్ని చేతిలోంచి లాగేసుకొంది మమత.

"ఇద్దరిమధ్య ఉత్తరాలు కూడా నడుస్తున్నాయన్నమాట. చాలావరకూ వచ్చిందే వ్యవహారం. ఏంటి రాసింది మీ ప్రేయసి? విరహ వేదనంతా గుప్పించిందా ఈ ఉత్తరంలో" వ్యంగ్యంగా అంది.

"ఛీ!" అంటూ ఛీత్కారంతో, అసహ్యంగా మమతవైపు చూసి, గబగబా అడుగులు వేసుకుంటూ బయటకు నడిచాడు తను.

అంతే! మళ్ళీ అటు వెళ్ళలేదు. అప్పట్నించి తన ఆప్తమిత్రులు ఈ సీసాలు, ఆ తాత, దొరికిన ఆడమనుషులు, అంతే!

* * *

గతం జ్ఞాపకాల పొడిలోంచి వర్తమానంలోకి వచ్చాడు రజనీ.

సునీత కొంచెం కొంచెంగా కదుల్తోంది. భారంగావున్న రెప్పలు కొద్ది కొద్దిగా పైకి

లేస్తున్నాయి. ప్రయత్నంమీద కళ్ళు తెరచింది. ఎదురుగా రజనీ ప్రేమ, ఆప్యాయత నిండిన చూపుల్తో ఆమె వైపు చూస్తున్నాడు.

"నన్ను క్షమిస్తారుకదూ!" అని చిన్నగా నవ్వింది. "ఈ అవకాశం కోసమే ఎన్నో ఆశల్తో బతికానండీ... ఆ నిజం మీకు తెలియజేయకుండానే నేను చచ్చిపోతానేమో? అని ఇన్నాళ్ళూ ఎంతో భయపడేదాన్ని. జరిగిందంతా చెప్తాను. దయవుంచి వినండి" అంది సునీత.

"ఒకరోజు మీరు నాతో అన్నారు గుర్తుందా? పెళ్ళి మాటలకోసం మా నాన్నగారిని మీఇంటికిపంపించమన్నారు. మీ నాన్నగారు, పిన్నిగారితో మనిద్దరి పెళ్ళి విషయం కదపమని చెప్పారు"

"అవును. ఆముందురోజే మా పిన్నితో చెప్పాను. 'ఆరోజు హోటల్లో చూసిన అమ్మాయిని చేసుకుంటాను. వాళ్ళ నాన్నగారు రేపు మనింటికి అన్ని వివరాలూ చర్చించి, ముహూర్తాలు పెట్టుకోవడం కోసం వస్తున్నారు. వారితో అన్ని విషయాలు మాట్లాడి ముహూర్తాలు పెట్టించండి' అని."

"మా నాన్నగారు మీ ఇంటికొచ్చిన సమయంలో మీరు, మీ నాన్నగారు ఇంట్లో లేరు ఆవిడ మా నాన్నగారికి చేయవలసిన మర్యాదలన్నీ చేసి... 'మీరు ఏమాత్రంకట్నం ఇవ్వగలరేంటిమావాడికి? లక్షలకొద్దీ కట్నం ఇస్తామంటూ ఎందరెందరో వస్తున్నారు" అన్నారు.

మా నాన్నగారు జవాబేం ఇవ్వలేదు.

"మీ అమ్మాయి అంటే మావాడు ఇష్టపడ్డాడు కాబట్టి ఓ యాభై వేలు కట్నం, ఇరవై వేలు ఆడపడుచుల కట్నం ఇస్తేనే గాని మీ అమ్మాయి ఈ ఇంట్లో అడుగు పెట్టడం జరగదు. అంతవరకూ తూగలేం అంటే ఓ పదివేలు తగ్గించి ఇవ్వండి" అందట.

నాన్నగారు నిరాశతో ఇంటికి తిరిగొచ్చారు. జరిగిందంతా చెప్పారు. "ఇక ఆ సంబంధంపై ఆశ వదలుకోమ్మా! వాళ్ళు చాలా పెద్ద పరుగుల్లో ఉన్నారు. మనం అంతలేసి పరుగులు పెట్టలేం. ఓ పది-పదిహేను వేలకన్నా ఎక్కువ కట్నం ఇవ్వగలిగే స్థితిలో నేను లేను" అన్నారు.

ఆ తర్వాత కొద్దిరోజులవరకూ మీరూ కనిపించలేదు. మీ ఉద్దేశంలో కూడా పెద్ద మొత్తాలు కట్నం అందుకోవాలనే కోరిక ఉందేమో? మీ నోట ఆ విషయం చెప్పలేక, మీ పిన్నిగారిచేత ఆ విషయం చెప్పించారేమోననిపించింది. మీ ఆదర్శాలు కూడా కబుర్లవరకే పరిమితం గాబోలని అనుకున్నాను. మీ పిన్నిగారు కూడా 'ఇది అబ్బాయి మాటే' అని అన్నారు. రోజుకోసారన్నా కనిపించే మీరు ఆ సమయంలో కనిపించకపోగానే నా అనుమానం బలపడింది. ఈ రకంగా నన్ను వదలించుకుందామని మీరు చూస్తున్నారేమో? కాని ఎలాగైనా ఆ డబ్బంతా మీ మొఖానకొట్టి మిమ్మల్ని సాధించి తీరాలన్న పట్టుదల నాలో పెరిగింది.

"నాన్నగారు రిటైరయ్యాక నా పెళ్ళి కోసమని ఓ ఇరవైఅయిదువేలు బాంకులో దాచారు. డాన్స్ క్లాసులు కండక్ట్‌చేసి డాన్స్ ప్రోగ్రామ్స్ ఇచ్చి మిగతా సొమ్ము సంపాదించి మీకు ఇవ్వాలని సంకల్పించాను.

"మా నాన్నగారి ద్వారా 'ఆ మొత్తం సొమ్ము మేము ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నామని, అందుగ్గాను ఓ ఆరునెలలు గడవు ఇమ్మని' కబురు పంపించాను.




# గ్లూకోన్-డి సూపర్‌హీరో.

ఉక్కపోస్తూ అలుపు
పుట్టించే రోజున కూడా
ఉరకలు వేసే శక్తి.




అలుపు తెచ్చే వేసవి రోజున మీ అబ్బాయికి కావలసింది గ్లూకోన్-డి: గ్లూకోజు, విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్లు గల తక్షణ శక్తినిచ్చే పానీయం.

గ్లూకోన్-డిని పళ్లరసం, పాలు, టీ, కాఫీ, లేదా నీళ్లలో కలిపారంటే కుటుంబం మొత్తానికి ఒక ఉల్లాస పానీయంగా తయారై పోతుంది. 100, 200, 500 గ్రాముల ప్యాకులలో లభిస్తుంది. గ్లాక్సో వారి గ్లూకోన్-డి.

అసలైన, కొత్త, రుగరుగుల ప్యాక్ కోసం చూడండి.

**గ్లూకోన్-డి** Ⓣ

సూపర్‌హీరో అమితంగా ఇష్టపడే శక్తినిచ్చే పానీయం.

GLL-238S

"ఆరునెలలు కాకపోతే ఆరు సంవత్సరాలు గడువు తీసుకోండి. ఆ డబ్బంతా ఇస్తేనే ఈ పెళ్ళి జరుగుతుంది. అంత వరకూ మా అబ్బాయిని మీ అమ్మాయి కలుసుకోవటానికి వీల్లేదు" అందట.

"అప్పట్నుంచి సంగీతం, నృత్యం క్లాసులు కండక్ట్ చేయడం ప్రారంభించాను. ఉదయం, సాయంత్రం పిల్లలకు ట్యూషన్సు చెప్పడం కూడా మొదలయింది. డాన్స్ పెర్‌ఫార్మెన్సెస్ కూడా ఇవ్వటానికి సిద్ధపడ్డాను. మీకు కావలసిన డబ్బు ఎన్ని రకాలుగా కష్టపడి శ్రమించి అయినా సంపాదించి మిమ్మల్ని చేసుకోవటానికి ప్రయత్నించాను. ఆ సమయంలో వరుసగా చాలారోజులు మీరెందుకు నాక్కనిపించలేదు?" అడిగింది సునీత.

"ఆ రెడ్డి, పాల్‌తో స్నేహం కుదిరింది కదా! ఓ నాలుగైదు రోజులవరకూ సాయంత్రం వేళల్లో వాళ్ళ రూములోనే ఫ్రెండ్సుతో గడచిపోయింది. ఆ తరువాత 'మా అమ్మకు తాతయ్య రాస్తానని చెప్పిన ఆస్తంతా నా పేర రాయిస్తానన్నారు మావయ్య'. తాతయ్య చనిపోయినా ఆయన మాట నిలబెట్టుకోవాలనే పంతంతో నేను వద్దంటున్నా సరే వదలకుండా ఆయన ఆ పని చేయించారు. ఓ వారంరోజులు రాయపురంలో ఉంచి నాకు నచ్చచెప్పి నాపేర కొంత పొలాన్ని, కొబ్బరితోటను రాయించి రిజిష్టర్ చేయించారు.

"ఆ తతంగం అంతా పూర్తయ్యేసరికి పదిరోజుల పైగా అయిపోయింది. అక్కణ్నించి వచ్చినవెంటనే వీళ్ళు తగులుకున్నారు. ఏ వూరికి వెళ్ళావని వాళ్ళడిగితే మామూలుగా జరిగిందంతా చెప్పాను.

"అయితే మా అందరికీ బ్రహ్మాండమైన పార్టీ ఇవ్వాల్సిందే. అన్నిలక్షల రూపాయల ఆస్తికి వారసుడు అయినందుకు' అంటూ పట్టుకొని వదలిపెట్టలేదు. ఈ లోపుగా అయిదారుసార్లు మీ ఇంటివైపు వచ్చాను. తాళం వేసుంది ఇంటికి. ఈ రకంగా మరో వారం మనం కలవకపోవడం జరిగింది. ఆ తరువాత నువ్వు ఆఖరిసారిగా ఆ బార్‌లో కనిపించడం, ఓ ఇరవై రోజులపైగా నీకు నేను కనిపించకపోవడంతో కట్నం గురించి నేను నీకు కనిపించలేదని నువ్వు రూఢి చేసేసుకున్నావు. మీ ఇంటికి తాళం వేసుంది మీరు ఏదైనా వూరికిగాని వెళ్ళారా ఆ సమయంలో?" అడిగాడు రజనీ.

"నా పెళ్ళి కోసమని వాళ్ళు కూడా ఆ వయసులో డబ్బు సంపాదనలో పడిపోయారు. మా నాన్నగారు ట్యుటోరియల్ కాలేజీలో ఉద్యోగం సంపాదించారు, మా అమ్మ టైలరింగ్ సెంటరుకు వెళ్ళి యూనిఫాంలు అవీ కుట్టి డబ్బు సంపాదించేది. ఇంటిదగ్గర ఎవరం ఉండేవారంకాము. ఆ సమయంలో మీరువచ్చి చూసి వెళ్తుండేవారేమో?

"నేను డాన్స్ నేర్చుకునేరోజుల్లో నాతో పాటు డాన్స్ నేర్చుకునే కుసుమ్ అనే ఆవిడ బాగా డాన్సు ప్రోగ్రాములు ఇస్తూ డబ్బు సంపాదించింది. ఆవిడ ఓసారి నాతో అంది 'డాన్సు నేర్చుకున్నావుగా! ప్రోగ్రామ్సు అవీ ఇస్తూవుంటే నేర్చుకున్న దాన్ని సార్థకం చేసుకున్నట్టు అవుతుంది. మీ ఇంట్లో కూడా నేను చెప్తానని చెప్పా. ఎక్కడైనా అవకాశం దొరికితే నీకు కబురుచేస్తాను. డబ్బుకు డబ్బూ వస్తుంది,' పేరుకు పేరూ వుంటుంది- నేర్చుకున్న విద్యను మనం మూలకు త్రోసెయ్యకుండా కళాసేవ చేస్తున్నాం అన్న

తృప్తి ఆనందం వుంటాయి' అంది. ఓ నాలుగైదుసార్లు ప్రోగ్రామ్స్ వున్నాయి వేస్తావా అని కబురుచేసింది. పబ్లిక్ ఫంక్షన్స్‌లో ఓ రెండుసార్లు స్టేజిఎక్కే అవకాశం కల్పించింది. ఆమెను కలుసుకుని 'అలాంటి అవకాశాలు ఏవైనావుంటే చెప్పండి' అన్నాను. 'నువ్వు చెయ్యాలే గాని...వందలాది అవకాశాలు. విదేశాలనుంచి చాలామంది వస్తుంటారు... వాళ్ళ ఎదుట నాట్యంచేసి మనదేశ కళా సంపదను వాళ్ళు మెచ్చుకునేలా చేసే అవకాశాలు కూడ చాలా వున్నాయి. అనగానే ఎగిరిగంతేశాను. ఓ హోటల్ మేనేజిమెంటును బతిమాలి అతి కష్టం మీద వాళ్ళను వప్పించి నాకు ఎపాయింట్‌మెంట్స్ ఇప్పించింది. వాళ్ళు ఓ రెండువేలు అడ్వాన్సుగా ఇచ్చి నా చేత ఎగ్రిమెంటు మీద సంతకం చేయించుకున్నారు- ఇది మామూలుగా ప్రోగ్రాం కాంట్రాక్ట్సు మాత్రమే, ఏం పరవాలేదు సంతకం పెట్టెయ్- అంది. ఆ కాగితాలు ఏంటో పూర్తిగా చదవకుండానే సంతకాలు పెట్టేశాను.

"మొదటి రోజు భరతనాట్యం చేయటానికి. తయారవుతున్న సమయంలో ఆనందంతో పొంగిపోయాను. విదేశీ ప్రముఖుల ముందు. నాట్యప్రదర్శన చేస్తున్నందుకు ఎంతగానో గర్వపడ్డాను. నేను సరదాగా నేర్చుకొన్న నాట్యం... ఈ రోజు నా జీవనజ్యోతి అవుతున్నందుకు మనసు నిండాసంతోషం నిండిపోయింది. ఎంతో ఉత్సాహంగా నాట్యంచేశాను. చప్పట్లు...ఎన్నో చప్పట్లు ఆడియన్సు అందులోనూ వివిధ దేశాల నుండి వచ్చిన ప్రముఖులు ఆనందం పట్టలేక నన్ను ఎంతగానో అభినందించి ముద్దులుకూడా కురిపించడానికి తయారయ్యారు. ఆ రోజు ప్రజంటేషన్స్ నాలుగువందల వరకు వచ్చాయి. అలా అయితే ఆరునెలలు అవసరంలేదు...ఈ లోపుగానే అంత డబ్బును జమచేయగలననే నమ్మకం నాలో పెరిగింది. 'రేపు మళ్ళీ ఎంత తొందరగా నాట్యప్రదర్శన చేసే అవకాశం వస్తుందా?' అని తహతహలాడాను. ఈ రోజు మోడరన్ డ్రెస్‌లో భరతనాట్యం...'అదీ విదేశీయుల కోరికపై' అనగానే పొంగిపోయాను. ఆడ్రస్‌లో డాన్స్ చేయడం ఇబ్బందికరంగా అనిపించినా 'ఇదో కొత్త ప్రయోగం ఇప్పటివరకూ ఎవరూ చేసి వుండరు' అనుకున్నాను.

ఆ మూడోరోజునే మీరు వచ్చారు" అంది సునీత.

"అమాయకంగా వాళ్ళ ఉచ్చులో చిక్కావన్న మాట. మొదట నిన్ను ప్రలోభపెట్టడానికి అలా విదేశీ ప్రముఖులు ... ప్రశంసలు... ప్రజంటేషన్సు అంటూ మభ్యపెట్టారు. ఆ తరువాత నెమ్మదిగా కేబరేలకు దిగజారుస్తారు. ఇలాంటివి సాధారణంగా ఎవరూ వూహించివుండరు. గుడ్డిగా నమ్మి ఊబిలోకి దిగబడిపోయావు. అదో విష వలయం...ఎంతో తీపిగా ఆహ్వానం లభిస్తుంది. అంతా పోగొట్టుకున్న తర్వాత గాని అసలురంగులు బైటపడవు. దాంట్లోకి వెళ్ళడమే కాని బయటపడటం అంటూ వుండదు.

"ఫ్రెండ్స్ బలవంతం మీద అనుకోకుండా వచ్చి బలవంతంమీదే తాగి ఆ మైకంలో నిన్నుచూసి ఆవేశంలో పిచ్చాడినైపోయానేగాని... ఇదంతా నేనూ వూహించలేదు. ఆలోచించలేదు. నన్ను

మోసంచేయటానికనుకున్నాను. తప్ప నా కోసమే నువ్వాపని చేస్తున్నట్లు తెలుసుకోలేక పోయాను. ఆ సంఘటన తర్వాత నువ్వు వూరినుండి చెప్పాపెయ్య కుండా పారిపోవడంతో పిచ్చివాణ్ణయి పోయాను. నువ్వులేని ఈ జీవితంలో ఎవరైనా ఒకటే అని, మమతను ఇచ్చి పెళ్ళిచేస్తానంటే 'ఊ'కొట్టాను.

"కొంతకాలం సుఖంగా సాగిన మా సంసారంలో కలతలు ప్రారంభం అయ్యాయి. లేనిపోని అనుమానాలతో మమత జీవితాన్ని నరకప్రాయంగా మార్చింది. 'తల్లిలేని పిల్ల...పోనీలే' అని ఎంతగా సహించినా, మరీ మూర్ఖంగా తయారయి అమానుషంగా ప్రవర్తించ డంతో, ఇలా వచ్చెయ్యడం తప్ప మరో గత్యంతరం లేకపోయింది నాకు. ఇక మళ్ళీ తిరిగి ఆమె దగ్గరకు వెళ్ళడం అన్నది కల. నాకు ఈ జీవితమే హాయిగా, ఆనందంగా వుంది. ఏ చీకూచింతాలేదు బాదర బందీ లేదు" అన్నాడు రజనీ.

"మీ భార్య రాయపురంలోనే వుంటు న్నారా?" అడిగింది సునీత.

"నర్సింగ్‌హోమ్‌ను మేనేజ్ చేసు కుంటూ వుండివుంటుంది. ఆమె సంగతు లేవీ నాకుతెలియవు. నా సంగతి అడ్రసు ఆమెకు దొరక్కుండా జాగ్రత్తపడు తుంటాను. ఆమె గుర్తుకొస్తేనే చాలు ఆ



సంఘటనలన్నీ కళ్ళముందు కదిలి... మనసు రంపపుకోతకు గురిఅవుతుంది. ఆమె తలపునకు రాకుండా చేసుకోటానికి ప్రయత్నిస్తూ వుంటాను. తాగుడు, తిరుగుడులో ఆమెను మరచిపోవటానికి ప్రయత్నం చేస్తూంటాను.

ఇదో ఓ విషవలయమే. ఇందులో చిక్కుకున్నవాడు బయటపడటం అసాధ్యం. ఆమె దగ్గరకు నేను పోను. ఆమె నా దగ్గరకు రాదు... రాకూడదు. ఇక నువ్వు తిరిగి నాజీవితంలో ప్రవేశిస్తున్నావు గనుక ఇక నాకేం ఫరవాలేదు. సునీతా... ఇక నువ్వు ఎప్పుడూ నాతోనే వుండాలి. నన్ను వదలి వెళ్ళకూడదు" ఆమె చేతిని పట్టుకొని గుండెల్లో దాచుకుని మత్తుగా వాలిపోయాడు రజనీ.

సర్ది పడుకోబెట్టింది సునీత.

నిముషాల్లో నిద్రలోకి జారిపోయాడు రజనీ.

* * *

కిటికీలోంచి పడుతున్న కిరణాలవెచ్చదనానికి తెలివొచ్చింది రజనీకు.

టైమ్ తొమ్మిదయింది. పక్కన చూశాడు-సునీతలేదు. టేబుల్ పైన,విస్కీ బాటిల్ కింద ఓ కాగితం రెపరెపలాడుతూ కనిపించింది.అది సునీత రాసిన వుత్తరం.

"నా ప్రియమైన రజనీ,

మిమ్మల్ని వదిలిపోవద్దన్నారు. నన్ను తిరిగి మీ జీవితంలో ప్రవేశించమన్నారు. మీ సంస్కారానికి నా జోహార్లు. మీకు నేను తగను. నావల్ల ఇప్పటికే మీ జీవితం చాలావరకు నాశనం అయిపోయింది. ఇంకా మీ దగ్గరవుండి మరింత నాశనం చేయలేను. అందుకే వెళ్ళిపోతున్నాను. ఆరోజు మీరు నన్ను హోటల్లో చూశారు. నేను బెదిరిపోయి పారిపోయాను. నన్ను మీరు వెంబడించారు. ఆ తర్వాత మిమ్మల్ని రౌడీలు కొట్టారు. వాళ్ళకు తెలిసిపోయింది ఇక, నేనా హోటల్లో వుండలేనని. లోపలి గదిలో బంధించి నన్ను పాడుచేశారు. ఆ ప్రొప్రయిటర్ నన్ను బలవంతం చేశాడు. వాడి దౌర్జన్యాన్ని వంట్లో శక్తి వున్నంత వరకూ ఎదిరించాను.అబలను... ఎంతకని ఆ దుర్మార్గాన్ని ఎదిరించగలను. అలసిపోయి వివశురాలైపోయి వున్న సమయంలో వాడికి బలయిపోయాను. వాడి తర్వాత వారి మేనేజర్, ఆ తర్వాతమరొకరు. ఆ తర్వాత ఇంకొకరు. ఇలా ఎందరో...

"సంపాదించిందంతా వాళ్ళ ముఖాన కొట్టినా ఎగ్రిమెంటు వాళ్ళ చేతుల్లో వుండిపోయింది. ఇంటికి రౌడీలు రావడం బలవంతంగా తనను బయటకు తీసుకువెళ్ళడం వాళ్ళ మాటలు, పేటిన్నిటిబట్టి నాన్నగారికి అమ్మకు అన్ని విషయాలు చూచాయగా తెలిసిపోయాయి. నన్ను నిలదీసి అడిగారు.అంతా విని నెత్తి బాదుకుని ఏడ్చారు. ఆ బాధ వాళ్ళను తినేసింది. నా బతుకు ఇలా మారినందుకు బెంగతోనూ, మానసిక వ్యథతోనూ నాన్నగారికి పక్షవాతం వచ్చి ఓ నెల తర్వాత చనిపోయారు. అమ్మ కూడా మానసికంగా చిదిగిపోయి కన్నుమూసింది.

"సరే..నా సంగతలా వుంచండి. మరి ఎన్నోరకాలుగా దేశానికి మీ సేవల్ని అందించవలసిన మీరు ఈ విధంగా ఒక ఆడది మిమ్మల్ని దగా చేసిందనీ మరో ఆడది నిర్లక్ష్యం చేసిందనీ, కుంగిపోయి బతుకు బండలు చేసుకోవడంలో అర్థం లేదు. జీవితాన్ని పూలబాటగా చేసుకోటానికి ప్రయత్నించండి. మగవాడి జీవితంలో దివ్యమైన వరంగా మసలవలసిన



అతివల
అందాలను
అగ్రస్థాయికి చేర్చే
ఏకైక, ప్రత్యేక
బ్లౌజ్ షోరూమ్

# మయూరి

## మ్యాచింగ్ సెంటర్

తీర్థకట్ట వీధి
తిరుపతి

ఫోన్: P.P.3255

arun Ads.

ఆడది ఒక్కోసారి శాపంగా మారిపోతూ వుంటుంది. ప్రయత్నంమీద మీ భార్యలో వచ్చే మార్పుకోసం ఎదురుచూడండి. ఆమె మూర్ఖత్వంగా ఆలోచిస్తూ వున్నకొద్దీ, ఆమె నాశనాన్ని కోరితెచ్చుకుంటోందన్న మాటే! అంతకూ ఆమెలో మీరు ఆశించిన మార్పు రాకపోతే అలాంటి మూర్ఖురాలి కోసం మీరెందుకు బాధపడటం, జీవితాన్ని వేదనల పాలు చేసుకోవడం...మీ బల హీనతల్ని జయించటానికి ప్రయత్నిస్తూ, ఆత్మానందాన్ని సాధించటానికిప్రయత్నిం చండి. బంగారు భవిష్యత్తు మీ ముందు వుంది. అది అందుకోవటానికి ప్రయత్నిం చండి. ఇదే మీ ప్రేయసిగా నా ఆఖరి కోరిక...ఆకాంక్ష! నాకోసం బాధపడ కండి. ఎవరికీ అందని దూరాలకు పారి పోతున్నాను.

సెలవ్

మీ ప్రియ సునీత"

ఆ ఉత్తరాన్ని చదివి కొన్నిక్షణాలు అలా వుండిపోయాడు రజనీ. వెంటనే తేరుకుని ఆత్రంగా అంతా వెదికాడు. అతని అనుమానం నిజమయింది. సునీత శవం మాత్రమే కనిపించిందతనికి.

మనసంతా వికలం అయిపోయింది.

"ఆమె వెళ్ళిపోయింది తాతా! నాకు చెప్పా చెయ్యకుండా వెళ్ళిపోయింది" అన్నాడు రజనీ-నీడలా వెన్నంటిన తాత భుజం మీద వాలిపోతూ.

* * *

గోడగడియారం పన్నెండు గంటలు కొట్టింది. సోఫాలోంచి లేచి మమత కిటికీ దగ్గరకు వెళ్ళిచూసింది.

పోర్టికోలో వెలుగుతున్న లైటు వెలుగులో ఏమీకనిపించలేదు. కొన్నినిము షాలు అలాగే గ్రిల్ పట్టుకొని నిలబడి పోయింది.

"ఈవేళ కూడా రాలేదు" అనుకుంది నిరాశగా.

అది ఆమెకు అలవాటయిపోయింది. ప్రతిరోజూ రాత్రి పన్నెండు వరకూ ఆమె అలా నిరీక్షిస్తూనే వుంటుంది. కిటికీగుండా బయటకు చూస్తూ, అలా చాలాసేపు నిల బడే వుంటుంది. వేచివున్న కళ్ళు అలసి పోతాయి. బయట కాలింగ్ బెల్ ఎవరైనా మోగిస్తే పరుగెత్తుకు వెళ్ళి తలుపు తీస్తుంది. ఆ వచ్చింది రజనీ కాదని తేల గానే నిరాశా నిస్పృహలతో నీరసంగా కూలబడిపోతుంది.

"నేను చేసినది ఎంత తప్పని? ఆవే శంలో మూర్ఖంగా ఏదో నోరుజారానే అనుకో, దానికింత శిక్ష వేయాలా? ఇంతలా ఏడ్పించాలా? ఆవేశంగా కోపంతో ఆరోజు ఇంటినుండి వెళ్ళిపోయావు. ఇంత వరకూ తిరిగి రాలేదు. ఆ మాటలు నా నోటి నుండి ఎలా జారాయో నాకే తెలీదు పిచ్చి పిచ్చిగా వాగేశాను. మీ మనసును నొప్పించాను...నన్ను క్షమించండి. డాక్టర్ పద్మిని పట్ల కూడా నా ప్రవర్తన చాలా అమానుషంగా వుంది. పాపం ఆమె ఇంటినుండి బాధతో వెళ్ళిపోయింది. ఇంతవరకూ ఆమె జాడతెలియనే తెలి యదు. ఆమెను అపార్థం చేసుకున్నాను. ఆమెపట్ల మీ అభిమానాన్ని, మీపట్ల ఆమె చూపే గౌరవాన్ని అర్థం చేసుకోకుండా సంస్కారహీనంగా ప్రవర్తించింది. ఆమె ఉత్తరం కళ్ళు తెరిపించింది. మనుషుల్లో ఇంతటి ఉత్తమ సంస్కారం వుంటుందని తను వూహించలేదు" అను కుంది.

మెట్లెక్కి మేడ పైకి వెళ్ళింది. సుందరి, దుర్గమ్మ హాయిగా గుర్రుపెట్టి నిద్ర





పోతున్నారు. వాళ్ళ నిద్రకు అంతే వుండదు. మధ్యాహ్నం అంతా నిద్ర పోతారు. రాత్రి తొమ్మిదికి వేసిన పడక వుదయం ఏదయినా అలాగేవుంటుంది. దుర్గమ్మ భర్త వచ్చి పెద్దపెద్ద కేకలు వేసి లేపితే అప్పుడు లేస్తారు. కాని తను మాత్రం ఆయన వస్తారేమో- అని పన్నెం డింటి వరకూ మెలకువగానే వుంటుంది. కిటికీలోంచి రోడ్డువెపు తొంగిచూస్తుంది. ఆయన వెళ్ళి పోయినప్పట్నుంచీ ఏదో బెంగ, దిగులు. ఒక్కోసారి తిండి కూడా సయించదు. ఆయన ఎక్కడున్నారో? ఏం చేస్తున్నారో అన్న చింతే ఎప్పుడూ తినేస్తుంది. భోజనం చేశారా? వేళకు ఆయనకు అవన్నీ అమరుతున్నాయా? ఎవరు చేసి పెడతారు- అన్న ఆలోచన బుర్రను దొలిచి వేస్తూంటుంది.

ఆయనకోసం తనే అంతలా బాధ పడుతోందితప్ప వాళ్ళకా బాధేంలేదువేళకు తిండి నిద్ర అమరిపోతున్నాయి. ఏదీకూ చింతా లేదు. ఇద్దరూ తీరిగ్గా కూర్చుని కబుర్లాడుకుంటూ పకపక నవ్వు కుంటూ సరదాగా వున్నట్టు అగుపిస్తారు ఎప్పుడూ మావయ్య పిల్లల చదువు కోస మని పట్నంలోనే వుండిపోయారు. "పాపం ఆయన అక్కడ ఎన్ని ఇబ్బం దులు పడుతున్నారో మీరు వెళ్ళండి" అంటే కదలరు'ఫరవాలేదమ్మా ఆయనకు వంట అలవాటే. అమ్మాయికి వంట్లో నీరసంగా వున్నప్పుడల్లా ఆయనే వండి పడేస్తుంటాడు అయినా పెద్ద వండేం వుంది? ముగ్గురు పిల్లలు, తనూ. అంతే కదా? ఇక్కడ నువ్వొక్కర్తివే ఎలా వుంటావు? ఉన్నా చూస్తూ చూస్తూ వదిలేసి పోవటానికిమాకు మనసు రావడం లేదు. మా గురించి నువ్వేం బాధ పెట్టు కోకమ్మాయ్!' అంటుంది దుర్గమ్మ.

పోనీ సుందరి అయినా వెళ్ళిపోవచ్చు కదా? కాని ఆమె కదలదు "నేను లేకపోతే మా అత్తయ్య ఒక్కర్తి వుండలేదు నన్ను వదలి వుండటం అంటే ఆవిడకి ప్రాణాలు పోయినంత పనవుతుంది" అంటుంది.

'వీళ్లుండి చేసే సాయమూ అంటే ఏదీ లేదు.వాళ్ళతిండి నిద్రా వాళ్ళు చూసుకుం టారు తప్ప తనతోఓమాటన్నామాట్లాడరు ఏదైనా డబ్బు అవసరం వస్తేతప్ప. వాళ్ళ మాటల్లోపడి తను మూర్ఖంగా తన కాళ్ళ కింద తనే గొయ్యితవ్వుకొంది. ఇక వీళ్ళ మాటల్లో తను పడకూడదు. నోటికొచ్చి నట్లల్లా మాట్లాడకూడదు' అనుకుంది.

కిందకు దిగి సోఫాలో కూర్చుంది. దుర్గమ్మ గుర్రు కిందివరకూ వినిపిస్తోంది. ఎదురుగా రజనీ ఫొటోలో చిరునవ్వు నవ్వుతూ నిలుచున్నాడు. ఆయన పక్కన తను ఎంత గర్వంగా... ధీమాగా నిల్చొనివుంది తను. పెళ్ళయిన కొత్తలో తీయించుకున్న ఫొటో అది. ఆరోజులే వేరు...

పెళ్ళయిన కొత్తలో ఎన్నో ఎన్నో మధురమైన అనుభూతులు. అవన్నీ గుర్తొచ్చాయి. దీర్ఘంగా నిట్టూర్చి లేచి కారు వద్దకు వెళ్ళింది మమత.

ఇంట్లో గడియారం అయిదు గంటలు కొట్టటం విన్పించింది. అప్పటికే పరిసరాల నిండా నెమ్మదిగా వెలుగురేకలు అలము కుంటున్నాయి!

మమత కారులో కూర్చుని, స్టార్టు చేసి రోడ్డు మీదకు పోనిచ్చింది. తన ఇన్నాళ్ళ నిరీక్షణకు స్వస్తి చెప్పి, సముద్రంలో కలిసే నదిలా భర్తకు చేరువకావాలను కున్న ఆమె కోరిక నెరవేరే తరుణం సమీపిస్తోంది క్షణక్షణానికీ... ★



# చతుర సమీక్ష

ఇటీవల విశేషంగా పెరిగిన పాఠకాదరణను పురస్కరించుకుని 'చతుర'ను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది మీ పత్రిక 'చతుర'. ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవల బాగోగులను చర్చించే ఆ శీర్షిక పేరు "చతుర సమీక్ష".

సాధారణంగా పత్రికలలో సాహిత్యానుభవంగల విమర్శకులచే వివిధ రచయిత(త్రు)ల పుస్తకాలను సమీక్షింపజేయటం రివాజు. కాని 'చతుర'లో ఈ శీర్షికవల్ల ఆ అవకాశం పాఠకులకే లభిస్తుంది. పాఠకులు చేయవలసిందల్లా 'చతుర'లో ప్రచురించే నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆ నవల నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులను గురించి రాయవచ్చు!

ఇక ఈ శీర్షికలో పాల్గొనే పాఠకులు గమనించవలసిన ముఖ్యాంశాలేమంటే :

1. "చతుర సమీక్ష"కు పంపే మీ రచన అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపు మాత్రమే రాయాలి.

2. మీ సమీక్షలు మాకు ఏ నెల నవల వి ఆ నెల 15వ తేదీలోపు అందాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఇందులో ఇస్తున్న కూపన్‌ను జతపరచాలి.

4. కవర్‌పై "చతుర సమీక్ష"కు అని పేర్కొనాలి.

మాకు అందిన పాఠకుల సమీక్షలలో ఉత్తమమైనవిగా మేము ఎంపిక చేసిన మూడింటిని ప్రచురించి రూ. 100, 75, 50 చొప్పున నగదు బహుమతులు పంపగలం.

ఈ నెల నవలపై పాఠకుల "చతుర సమీక్ష"లు నవంబర్ సంచికలో ప్రచురింపబడతాయి.

ఇక విరివిగా పాల్గొని ఈ శీర్షికను సద్వినియోగం చేసుకునే వంతు పాఠకులదే!

కూపన్

సెప్టెంబర్ 'చతుర' నవల : ఆశల శిఖరాలు

సమీక్షకుని పేరు :..........................

చిరునామా :..............................

..........................



# చతుర కతలు



## అసలు విషయం

యాపిల్ టైలర్‌కు ఆ ఊళ్లో మంచి పేరుంది. కుర్రకారంతా అక్కడే పాంటూ, చొక్కాలు కుట్టించుకుంటారు. యాపిల్ టైలర్స్‌లో కుట్టించామని చెప్పుకోవడం కాలేజిస్టూడెంట్లకి గర్వకారణంగా వుంటుంది. యాపిల్ టైలర్స్ ప్రొప్రయిటర్ పున్నారావుకి యాభై ఏళ్లు వుంటాయి. ఎప్పటికప్పుడు లేటెస్ట్ ఫాషన్లు తెలుసుకోవడం, కుర్రకారుకి ఆ ఫాషన్లలో కుట్టి అందించడం వల్లే పున్నారావుకి అంత పేరు వచ్చింది. ఇస్తానన్న టైముకి ఓ పూట ముందే ఇచ్చేస్తాడు. ఇలా ప్రాంప్ట్ సర్వీస్‌తోపాటు తన వద్దకొచ్చేఖాతాదారుల పేర్లన్నీ గుర్తుంచుకుంటాడు.

కొలతలు తీసుకుంటూ పేరుతో పిలుస్తూ సరదాగా కబుర్లు చెబుతాడు. సినిమాల గురించి అడిగి, ఫలానా సినిమాలో ఫలానాహీరో ఫలానా పాటలో వేసుకున్న డ్రెస్ కుట్టేదా అని వూరిస్తాడు. కాలేజి సంగతులు వాకబుచేస్తాడు. పున్నారావు నోటి మంచితనంతో ఆరు మిషన్లు పదిమంది కుర్రాళ్లతో వర్ధిల్లుతున్నాడు.

శంకరం ఆ ఊరి కాలేజిలో కొత్తగా చేరాడు. కాలేజి స్టూడెంట్స్ అందరి చొక్కాలజేబులమీద ఓ మూలగా ఎర్రని యాపిల్‌పండు దారంతోకుట్టి వుండటాన్ని గమనించాడు. ముందర అర్థంకాక ఓ స్నేహితుణ్ణి అడిగాడు.

అతను చిద్విలాసంగా నవ్వి-

"మన కాలేజి స్టూడెంట్స్ అంతా యాపిల్ టైలర్స్‌లోనే కుట్టిస్తారు. ఈ యాపిల్ ఆ టైలర్‌కి గుర్తు. ప్రతివారి చొక్కా జేబుమీద ఇలా ట్రేడ్‌మార్క్‌లా యాపిల్‌ని దారంతో కుట్టడం అతని అలవాటు" అన్నాడు.

తన చొక్కా జేబుమీద యాపిల్ గుర్తు లేకపోవడం శంకరానికి ఏదో వెలితిగాతోచింది. ఆ మర్నాడే శంకరం కొత్త చొక్కా, పాంటుకి కావల్సిన క్లాత్ తీసుకుని యాపిల్ టైలర్స్‌కు వెళ్లాడు.

శంకరాన్ని చూడగానే టైలర్ పున్నారావు సాదరంగా ఆహ్వానించాడు.

కొత్త ఖాతాదారని చెప్పి టీ తెప్పించి మర్యాదలు చేశాడు. కొలతలు తీసుకుంటుంటే శంకరం దృష్టి టేబుల్‌మీద చెక్కతో అందంగా చేసి వుంచిన యాపిల్ పండుపై పడింది. అది ఎర్రగా నిగనిగలాడుతూ నిజం యాపిల్‌ని తలపింప చేస్తోంది.

శంకరానికి ఆయాపిల్‌ని చూడగానే చటుక్కున ఓ అనుమానం పొడసూపింది.

"ఎన్నో పేర్లు వుండగా మీరు యాపిల్‌టైలర్స్ అని పెట్టారేమిటి. ఆశ్చర్యంగావుందే" అన్నాడు.

"ఇందులో ఆశ్చర్యమేముందండి. యాపిల్‌పండే లేకపోతే అసలు మాకు పుడ్డేవుండేదికాదు" అన్నాడు పున్నారావు. కళ్లజోడు పైనుంచి చిలిపిగా చూస్తూ.





ఆ మాటకు ఆశ్చర్యపోవడం శంకరం వంతు అయింది.

"అదేమిటి వింతగావుందే. యాపిల్‌కీ టైలరింగ్‌కీ సంబంధం ఏమిటి" అన్నాడు.

"మీరు చదివే వుంటారు యాడమ్ అండ్ ఈవ్ కథ. ఈవ్ కనుక యాపిల్ తినకుండా వుంటే అసలు దుస్తులు వేసుకునేపనే వుండేదికాదు. దుస్తులు లేకపోతే టైలర్లూ వుండేవాళ్లుకాదు గదా! అందుకే దుస్తులు వేసుకోవడానికి కారణమైన యాపిల్ పట్ల గౌరవసూచకంగా మా షాపుకు యాపిల్ టైలర్స్ అని పేరు పెట్టా" అన్నాడు పున్నారావు ముఖంలో గర్వం తొణికిసలాడుతుండగా.

శంకరం, పున్నారావు చమత్కారానికి చిరుదరహాసం చేశాడు.

—జి. చక్రధర్

# పాపం చిరంజీవి!

ఆరోజు ఆదివారం. అద్దె గదిలో నిద్రపోతున్న చిరుద్యోగి చిరంజీవి తెల్లవారిన గంటకు బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ నిద్రలేచాడు. కాలకృత్యాలు తీర్చుకుని, స్టవ్ మీద కాస్తంత కాఫీపెట్టుకుని తాగి, మరోకప్పు కాఫీ ఫ్లాస్కులో పోసి, హాయిగా మడత మంచం మీద వాలి సిగరెట్ వెలిగించాడు.

బయట సన్నగా వర్షపు తుంపర పడుతూంది. ఈరోజు వర్షం ఇలాగే కురిస్తే సినిమా లాంటి మరే ప్రోగ్రాములకి అవకాశంలేదు. పైగా జీతాలు మరునాడు కాని రావు. హాయిగా ఈ వర్షంలో మరోసారి కాస్తంత కాఫీ తాగి, లైటు వేసుకుని, గదిలో మడత మంచం మీద పడుకుని దుప్పటి ముసుగెట్టి కొత్త వీక్లీ చదువుకోవటంలో వున్న ఆనందం మరెందులోనూ వుండదు.

ఇంటివారి వాటాలోకి పేపర్ బోయ్ వచ్చి ఆరోజు దినపత్రిక ఇచ్చి వెళ్లిపోతున్నాడు. చిరంజీవి అతన్ని ఆగమని చెప్పి గబగబా హేంగర్‌ని తగిలించి వున్న తన పేంటు జేబు తడిమాడు. సరిగ్గా రెండున్నర రూపాయలు వున్నాయి. రెండు



న్నర ఇచ్చి వార పత్రికకొని, పేజీలు తిరగేసి పత్రికను మళ్లా మడత మంచం మీద పడేశాడు. బొమ్మలను బట్టి కథలు చాలా ఆసక్తికరంగా వుండేలాగే అనిపించాయి.

ఫ్లాస్కులో మిగిలివున్న కాఫీని కప్పులో పోయబోతూ, సిగరెట్లు ఎన్ని వున్నాయో పేకెట్ తెసి చూశాడు. ఖాళీ పేకెట్టు చిరంజీవిని చూసి చిద్విలాసంగా నవ్వింది. సిగరెట్లు కొందామంటే డబ్బులు లేవు. తీరా కాఫీ తాగాక సిగరెట్ కాల్చక పోతే పత్రికలోని ఏ కథా సరిగా తన బుర్రకు ఎక్కచావదు. ఉన్న డబ్బులు కాస్తా పత్రిక కోసం ఖర్చయిపోయాయి. ఏం చేయాలో పాలుపోలేదు చిరంజీవికి.

ఇంతలో వీధిలో 'పాత పేపర్లు కొంటాం' అంటూ ఓ కేక వినిపించింది. చిరంజీవి బుర్రలో ఒక ఆలోచన మెరుపులా మెరిసింది. పేపర్లు కొనేవాణ్ని పిలిచి, ఇంట్లోని పాత పత్రికలన్నీ మడత మంచం మీద కుప్పలా పేర్చి ఆ కుప్ప తీసుకెళ్లి పేపర్ల వాడి ముందుంచాడు. వాడు పేపర్లు తూచి కేజీకి కాస్తంత తక్కువగా వున్నాయని రెండు రూపాయలు చిరంజీవి చేతులో పెట్టి పేపర్లు సంచిలో కూరుకుని, గొడుగు వేసుకుని వెళ్లిపోయాడు.

చిరంజీవి గది తలుపు గొళ్లెం పెట్టి, తమ ఇంటికి ఎదురుగా వున్న బడ్డీలో అరపెట్టి ఫిల్టర్ సిగరెట్‌లు తెచ్చుకున్నాడు. కాఫీ తాగి, సిగరెట్ వెలిగించి మడత మంచం మీద వాలి, దుప్పటి ముసుగెట్టి కొత్త వీక్లీ కోసం చూశాడు. ఆ వీక్లీ గదిలో ఎక్కడా కనిపించలేదు. పాత కాగితాలతో పాటు కొత్త వీక్లీ కూడా గడపదాటి వెళ్ళిపోయిందని అప్పటికి గాని తెలియలేదు పాపం చిరంజీవికి!

—వక్కలంక రామారావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 482.

ఉషా కిరణ్ మూవీస్




నిర్మాత

రామోజీరావు

కథ, స్క్రీన్ ప్లే, సంభాషణలు, దర్శకత్వం

డి.వి.నరసరాజు



# కారు దిద్దిన కాపురం

